శ్రీరస్తు.

2099

# శేషధర్మము.

తామరపల్లి తిమ్మయప్రధాని ప్రణీతము.







చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1927



# పీఠిక.

ఈయితిహాసమును సంస్కృతమునుండి నలువురు పూర్వకవు లాంధ్రీకరించియుండిరి.

1. వెణుతురుపల్లి విశ్వనాథకవి.
2. తామరపల్లి తిమ్మయప్రధాని.
3. తురుమెళ్ల రామనకవి.
4. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి.(మఱియు నొకరిద్దఱు గలరు)

వీనిలో సకలవిధప్రచారములోనున్న తిమ్మయప్రధానిగ్రంథమునకు ముద్రితప్రతులు చాలఁగలవు. అవి బహుకాలముక్రిందట ముద్రింపఁబడినవి:—

1. ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలలో పాలూరి రాజంసెట్టిగారు వావిళ్లరామస్వామిశాస్త్రులుగారిచేఁ బరిష్కరింపించి 1881-సం॥న ముద్రించినది.

2. జ్ఞానసూర్యోదయముద్రాక్షరశాలలో భువనగిరి వేంకటనరసింహులుసెట్టిగారు, ప్రపంచసర్వేశ్వరశాస్త్రిగారిచేఁ బరిష్కరింపించి 1892, 1906 సం॥ లలో ముద్రించినవి.

కాని వారి కెవ్వరికిని సంపూర్ణప్రతులు లభింపలేదు. ఒక్కదానిలోనుగూడఁ గృత్యాదిపద్యములు లేవు. "అభ్యుదయపరంపరాభివృద్ధిగా" ననియే ప్రారంభించిరి. ఊహింపఁగా ముద్రాశాలాధికారులకు దొరకినప్రతి యొక్కటివలెనే కనఁబడుచున్నది. ప్రమాదము లన్నిం

టిలో సమానముగా నుండుటయే మనయూహకుఁ బ్రబలనిదర్శనము. ఇపుడు మా యీముద్రణసమయమునకు, అచ్చుప్రతులు మూఁడు, వ్రాఁతప్రతులు, ఆంధ్రసాహిత్యపరిషత్తులో నైదు, ఓరియంటల్ లైబ్రరీలో రెండును సాయపడినవి. పరిషత్తులోని యైదుగ్రంథములలో మూఁటఁ గృత్యాదిపద్యము లున్నవి. దొరతనమువారి ఓరియంటలు లైబ్రరీలో నసంపూర్ణముగాఁ గృత్యాదిపద్యములు కొన్నియున్నవి.వీని నన్నింటి నొక్కింత యొక్కింత యాధారముచేసికొని మే మీప్రతిని సిద్ధపఱిచి పాఠకులహస్తములం దిడుచున్నారము. ఇందు వెనుకటి ముద్రితప్రతులఁ జదివినవారి కున్న స్థిరసందేహములు తీఱిపోవునని తలఁచుచున్నారము. ఇదివఱకుఁ జదివినవారు మరల దీనిని బఠించిరేని కొన్ని గాథల సందర్భములోఁ గ్రొత్తగనే కనఁబడవచ్చును. వెనుకటి పరిష్కర్తలు ప్రత్యంతరములు దొరకకపోవుటచేతను, వ్రాఁతలో మిక్కిలిగఁ దప్పులుండుటచేతను, ఉన్నదానికిఁ గించిత్పరిష్కరణముతోఁ దృప్తిపొందిరి. విశేషప్రతులయాధారమున మేము గావించిన యీముద్రణము బహువిధములఁ బాఠకులకుఁ బరితోషణము గలిగించునని సంతసించుచున్నారము. మాసంతసమునకుఁ బాఠకులు ప్రోద్బలముచేయుదురుగాక.

ఈతిమ్మయప్రధానికాలము కవులచరిత్రమునందు "నూఱుసంవత్సరములక్రింద నుండియుండు" నని సంశయింపఁబడినది.

ఇక్కవి చాలతావుల వ్యాకరణదుష్టములగు పదములు విశేషముగాఁ బ్రయోగించియున్నాఁడు గాని, కవిత్వము మృదుమధురమై యొప్పుచున్నది.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.





శ్రీరస్తు.

# శేషధర్మము

## పీఠిక.



మత్పావన పాదపద్మజరజశ్శ్రేణీప్రసిద్ధక్రియా
సామర్థ్యంబు చెలంగ గౌతమ గృహస్థస్వామిఁ గావించి యు
ద్ధామప్రౌఢిమ జానకీరమణి యుద్వాహంబు గైకొన్న శ్రీ
రామబ్రహ్మము కేసమంత్రిమణి ధర్మాజిప్రభుం బ్రోవుతన్. 1

ఉ. [1]కన్నులవిన్కి జన్నిదము గద్దియకెక్కుఁడు సొంపుగూర్పఁ గూ
ర్చున్నతనూజుఁ జూచితివె యంచుఁ దురంగ యటన్న నంతకున్
వన్నియగా మృగేంద్రపయి వారణకుంభము లుంచితంచు జా
యన్నగఁ జేయుఁ శంభుఁడు కృతార్థుని ధర్మయమంత్రిఁ బ్రోవుతన్. 2

ఉ. పొందుగ నిందిరారమణుపొక్కిలితమ్మికొటారులో శుభ
స్యంది సువర్ణబృందములు శాశ్వతలీలల నిందుజాట సం
క్రందనముఖ్యఫాలఫలకంబుల నించుసరోజనందనుం
డిందుపురేల ధర్మమణి నెల్లపుడున్ దయ విందుసేయుతన్. 3

చ. ఉరమునఁ గౌస్తుభప్రభకు నూర్జితశోభనమిచ్చు పాదప
ద్మరుచులు బాసికంబులుగఁ దాల్చుచు నక్షిచకోరపంక్తికిన్
హరిముఖచంద్రచంద్రికల నామెతసేయుపయోధికన్య సా
దరదరహాసవాసనల ధర్మయమంత్రివరేణ్యుఁ బ్రోవుతన్. 4

గీ. మోవి చిగురాకుకెక్కువ తావితేనె, లానుకొననిచ్చు కుత్తుకయరుచి మాన్చి
పరునిసామేను గైకొన్న గిరితనూజ, సిరులు దయచేసి యతని రక్షించుఁగాత. 5

---

1 కన్నులకల్కి.

క. వేణీరుచి విజితాభ్ర, శ్రేణిక్ జనితప్రభాధరీకృత పులిన
శ్రోణిక్ వీణాపుస్తక, పాణి న్వాణి న్నుతింతుఁ బద్మజురాణిన్. 6

చ. తన దగువారువం బొడలఁ దాల్చిన సొమ్మును జాతివైరపుం
గినుక దొరంగి యొం డొకటి గింకిరి సేయఁగఁ జూచి యాఁదలం
దనరు సుధాంశురేఖ రసధారలు చిందఁగ గుజ్జుబొజ్జ పె
ల్పునఁ గదలంగ నవ్వు సురపూజ్యగణాధిపుఁ బ్రస్తుతించెదన్. 7

క. శరణాగతరక్షణవిభు, చరణస్మరణానుకరణ జలనిధితరణా
చరణాధరణిజదత్తా, భరణస్థిరతేజుఁ గొల్తుఁ బవనతనూజున్. 8

గీ. వ్యాస వల్మీకభవ కాళిదాస దండి, భారవి మయూర భవభూతి బాణు లనఁగ
దిగ్గజములట్లు ధారుణిఁ దేజరిల్లు, సంస్కృతకవీంద్రచంద్రుల సన్నుతింతు. 9

ఆ. అరఁటిపండు విచ్చి యందిచ్చుకైవడి, భారతంబుఁ దెనుఁగుబాస నొడివి
ననిచినట్టి ఘనుల నన్నయభట్టుఁ ది, క్కనను నెఱ్ఱప్రెగడగారిఁ గొలుతు. 10

క. శ్రీరామాయణనిర్జర, భూరుహఫలరసము పుణ్యపురుషులకెల్లం
జూఱలు విడిచిన కవితా, పారాయణు శ్రీహుళక్కిభాస్కరుఁ గొలుతున్. 11

క. వాగీశాగోచర మగు, భాగవతాగమము రామభద్రుని పేరన్
ధీగరిమఁ దెనుఁగుచేసిన, భాగవతుని బోతరాజుఁ బ్రణుతింతు మదిన్. 12

క. ఎఱుఁగరు గణగుణలక్షణ, మెఱుఁగరు రసభావరీతు లెఱుఁగరు శబ్దం
[1]బెఱుఁగ నిది రాచగడ్డమె, కొఱకొఱకవులేల వారిఁ గొనియాడంగన్. 13

వ. అని యిష్టదేవతానమస్కరణంబును సుకవిజనసంస్మరణంబును గుకవిజననిరాకరణంబును నొనరించి చతుర్దశభువనసదనపాలుం డగుమదనగోపాలు రమారమణీరమణీయశాతకుంభకుంభవిజృంభమాణకుచకుంభకుంకుమాభరణంబులగు శ్రీచరణంబులకు మదీయాంతఃకరణంబున శరణంబుగావించి బుధజనంబులమనంబులు సొక్క నొక్క సకలపుణ్యకథాసుధాధురీణం బగుపురాణంబు తెనుఁగుసేయ నూహించుసమయంబున.

సీ. శ్రీరామభద్రదాక్షిణ్యాగణ్యకటాక్షవీక్షణార్జితపుణ్యలక్షణుండు
కానీనభేనసంతానచింతామణీదానావధానవిద్యాధనుండు
భూభువనావనప్రాభవభవకళాశోభమానానేకవైభవుండు
సురసింధుసైంధవతరుగంధసింధురబంధురకీర్తిధురంధరుండు
గీ. చోళనేపాళకేరళగౌళమాళ, వాంగవంగకళింగకుళింగసింధు

---

1 బరయనిది రాచగడ్డమె, కురకురకవులేల.

చోటకర్ణాటలాటమరాటమగధ, మంత్రికులహేళి ధర్మయామాత్యమాళి. 15

క. హాటకవసన కథాంకిత, హాటకశాటీకవాట హర్మ్యశిరోగే
హాటకరుచులరిహాటక, కూటము సాటైన కొలువుకూటమునందున్. 16

క. కలకల నగుచు న్సన్మం, త్రులు సరసులు గాయకులుఁ బురోహితులుఁ గవీం
ద్రులు బంధులు నాయకులుం, గొలువఁగఁ గొలువుండి మదిని గుతుక మెలర్పన్. 17

సీ. శ్రీరామపాదరాజీవసేవాలోలు వశగతమధురిమావాగ్విశాలు
మహితలప్రస్తూయమాన భార్గవగోత్రు సురుచిరాపస్తంబసూత్రుఁ బాత్రుఁ
జంద్రప్రభానేంద్రశరణమంత్రికుమారు ధారుణీనుతకవితావిహారు
నాగమాంబాగర్భసాగరాత్రితనూజు దీనార్తరక్షణదివ్యతేజు

గీ. సూరధీనిధియనుజాతు శుభసమేతుఁ, జంద్రనార్యాగ్రజను గురుచరణభజను
బంధుఫలవల్లి తామరపల్లి తిమ్మ, కవిశిఖామణి న న్నెంచి గారవించి. 18

సీ. బహుపురాణగ్రంథపఠనార్థకరణాతిశూరుండు మాయన్న సూరమంత్రి
మహితసభాభిరామాముఖకావ్యంబు ధరనిల్పె మాతండ్రి శరణమంత్రి
తగవరి యై యన్నదానంబు చేయుచు వెలసె మాపెదతండ్రి విస్సమంత్రి
వేదపర్వమ్మన వినుతులు గాంచెను సరసుండు మాతాత చంద్రమంత్రి

గీ. ప్రౌఢరాయల మెప్పించి రాయసములు, పైఁడిగంటంబుగొని వ్రాసి భద్రలీలఁ
బైఁడిగంటమువా రనుపద్దుఁ దెచ్చి, యలరె మాతాతముత్తాత యబ్బమంత్రి. 19

సీ. పుష్పలింగేశ్వరపూజానిరంతరసంగతైశ్వర్యుండు లింగఘనుఁడు
గోపాలపదదయాకలితాన్నదానాది గుణపట్టభద్రుండు గోపశౌరి
యనఘుండు పెదజగ్గ నాయనతమ్ముండు సత్యసంధుఁడు చినజగ్గవిభుఁడు
శ్రీరామపదపద్మసేవాధురంధరహృదయాంబుసంభవుఁ డెఱ్ఱమంత్రి

గీ. కాశ్యపసగోత్రసురరాజు కామరాజు, వీరు వా రనకుండ వల్లూరు నీదు
తల్లిపుట్టింటివారెల్ల ధన్యు లెన్నఁ, దరమె వారలఁ దిమ్మప్రధానవర్య. 20

క. మిత్రజనవనజమిత్రుఁ బ, విత్రుని వల్లూరిజగ్గవిభు కొండమదౌ
హిత్రుని శరణామాత్యుని, పుత్రుని నినుఁ దిమ్మనార్య పొగడం దరమే. 21

ఉ. తామరసుండుబోటి కనుదామరల న్నటియించుచుండుఁ గెం
దామరకొల్కు నీకులము తామరసాక్షుబిడారు నీమన
స్తామరసం బదొక్కగుఱుతా మఱి నీదుకవిత్వసీమకుం
దామరపల్లితిమ్మకవితామరసోద్భవ మింతు వన్నిటన్. 22

క. మృదుమధురగభీరశుభ, ప్రదకవితారాజ్యపట్టభద్రుఁడవు బళీ!
పొదలెదు యదునాథదయా, స్పదవచనసుధాళి గ్రమ్మ శరణయతిమ్మా. 23

గీ. పైఁడిగంటమువారు నాఁ బ్రబలె వన్నె, నంతఁ దామరపల్లివా రనఁగ నలరి
కుందనముమీఁదఁ బరిమళ మొందినట్లు, తిమ్మయామాత్య నీకుల మెన్నఁ గాంచె. 24

వ. అని బహుమానపూర్వకంబుగాఁ బలికి మఱియు ని ట్లనియె. 25

సీ. శ్రీరామపాదరాజీవద్వయీనిరంతరసమారాధనోత్సాహమూర్తి
బ్రహ్మసంస్థాపనారామతటాకాదిసప్తసంతానదీక్షాప్రవర్తి
కర్ణఖేచరకల్పకద్రుచింతామణిసమసమంచితదానచక్రవర్తి
శరశరద్ఘనసుధాకరకఱకంఠనీహారహారానురాహారకీర్తి

గీ. మంత్రికులపోషి సంతతమధురభాషి, యహితబలభేది సకలవిద్యావినోది
యెలమి నిందుపురేల దేవేంద్రులీలఁ, దనరు మాయన్న యోబప్రధానమౌళి. 26

వ. బ్రహ్మప్రతిష్ఠ తటాక వన కృతి దేవతాయతన నిధి సంతానంబు లను సప్తసంతానంబులలోఁ గృతి యుత్తమం బగు నందును బురాణం బైన బంగారంబునకుం బరిమళంబు గలిగినచందంబున నందం బగు భారతవేదంబునకు శిరోభూషణం బైన హరివంశంబున సకలపుణ్యకథాకథనంబును బుధజనంబుల మనంబులకు నాశ్చర్యం బొనరించు నదియు నగు నాశ్చర్యపర్వంబున విశేషధర్మంబు లైన శేషధర్మంబు లొక మహాకవీంద్రునిచే శ్రీరామనామాంకితంబుగాఁ దెనుంగు సేయించి హర్షించెద నని యాజ్ఞాపించె మదీయమనోరథంబును నిట్టిద కావున నిమ్మహాగ్రంథానుసంధానధౌరంధర్యబంధురప్రతిభ నీయధీనం బాచరింపుదు నని కర్పూరతాంబూలమణిమయజాంబూనదాంబరాభరణాదివివిధవిభవంబు లొసంగినఁ బ్రమోదరసతరంగితాంతరంగంబున నంగీకరించితి. 27

చ. పొర దెరలించుచు న్మిరియపుంబొడి శర్కర దార్చి చేతికిం
జెఱకులు కూలికిం దినఁగఁ జేతము దార్చుట గాదె దాత య
క్కఱ గని పూర్వపుణ్యకథ కర్ణసుఖక్రియఁ దేర్చి వారిచేఁ
బొరసినయర్థసిద్ధి నిహముం బరముం గన నేర్పు గల్గుటన్. 28

సీ. శ్రీకరాభ్యుదయంబు శివధనుర్విజయంబు కమనీయహృదయంబు గల్గువాఁడు
సాకేతధామంబు సద్గుణస్తోమంబు కల్యాణనామంబు గల్గువాఁడు
జనకజామోహంబు సంతతోత్సాహంబు కరుణాప్రవాహంబు గల్గువాఁడు
భక్తానురాగంబు బలభేదిభోగంబు లలితాంగరాగంబు గలుగువాఁడు

గీ. రమణ నిందుపురేల ధర్మప్రధాన, కమలబాంధవుపొలింటఁ గల్గువాఁడు
కలుము లీనెడుచూపులు గలుగువాఁడు, రామచంద్రుఁడు లోకసంరక్షకుండు. 29

వ. మదీయభవ్యకావ్యకన్యకాప్రియుఁడౌట మేలనియుం దదనుబంధసంధానకరణంబైన యిందుపురేల ధర్మయామాత్యువంశంబు తదాచార్యవర్యకులవర్ణనపూర్వకంబుగా నభివర్ణించెద. 30

సీ. శ్రీవత్సగోత్రవారిధిపూర్ణతారకారకుం డంచితలక్షణుండు
వేదశాస్త్రపురాణవిద్యాపరిజ్ఞానబోధకుం డఖిలార్థసాధకుండు
శాంతిదాంతిక్షమాసత్యాదిసద్గుణభూషణుం డుచితసంభాషణుండు
వనరాశికన్యకావల్లభపదపద్మభావనుం డన్వయపావనుండు
గీ. లీల విలసిల్లు నిందుపురేలపెద్ద, ధర్మయామాత్యుగురువన్న దానగురువు
తిరుమలాచార్యతనయుండు స్థిరయశుండు, చక్రవర్తులధర్మయాచార్యమౌళి. 31

గీ. ధర్మయాచార్యుతమ్ముఁడు ధర్మమూర్తి, కృష్ణమయగారు గాంచెను గృష్ణపాద
పద్మపరిచర్యు సంతతభాగ్యధుర్యు, నద్రిసమధైర్యు శ్రీరంగయార్యవర్యు 32

ఉ. శ్రీవిభు దివ్యనాభిసరసీరుహమధ్యమునందు మొల్చువా
ణీవరుఁ డమ్మహామహుని నెమ్మదిఁ గశ్యపుఁ డుద్భవించె నా
కోవిదచంద్రశేఖరుని గోత్రమున న్విలసిల్లె మిక్కిలిన్
భూవినుతప్రభావుఁ డగు పొర్లయమంత్రి జగత్ప్రసిద్ధుఁడై. 33

క. ఘనుఁ డగు పొర్లయమంత్రిం, దునికామిని పోచమాంబ దుర్వారయశో
ధనుఁ గులవర్ధనుఁ గనియెం, దనయు న్నరసింహు హరికథావ్రతజిహ్వున్. 34

గీ. మంత్రిమణి నరసప్ప ధర్మాయి యందుఁ, దనయులను బొమ్మయను ననంతనను గేస
ఘనుని బెద్దప్రధానేంద్రు ఖండెరావుఁ, గాంచె నంబోధి కల్పవృక్షములపగిది. 35

క. ఆభద్రాత్ములసోదరి, సౌభాగ్యదయాదిసుగుణచణపొమ్మాయిన్
శోభానిధి యగు విశ్వా, లాభశపతి పెండ్లియాడి యలరెన్ జగతిన్. 36

ఉ. చేయును విష్ణుపూజ యెడసేయును బాపవిచారుఁ బుణ్యమున్
నేయు నిలాతలంబు తనచేయువిధంబున కానుకూల్యమున్
జేయఁగఁ జేయు శోభనమె చేయును మాటలు వేయుఁ జేయుఁ బొ
మ్మాయి గుణంబులెన్నఁ దరమా కరమాపరమార్థవేదికిన్. 37

క. ధీరుఁ డగుపొమ్మధీమణి, మారాయిని బెండ్లియాడి మహినుతసుగుణో
దారుల లింగప్పను నయ, గారిని బుత్రకులఁ గాంచెఁ గరుణాధికులన్. 38

వ. అందు. 39

గీ. అధిపుఁ డయ్యగారు నరసాయి యందుఁ బ్రేమ, దనర లింగాంబను ననంతమ్మ నరస
ధీమణి వరేణ్యు రఘుపతి రామదాసు, మంత్రి చంద్రునిగాంచె సమ్మదమెలర్ప. 40

వ. అందు. 41

గీ. పేర్మి లింగాంబ నల్కొండ ధర్మమంత్రి, ధీవరేణ్యు ననంతమ్మ దేవునూరి
యప్పయామాత్యచంద్రుని నభిమతంబు, లలర వరియించి మించిరి హర్షలీల. 42

ఉ. అంగకళింగవంగవిబుధాంగణసంగతదానుఁ డభ్రమా
తంగభుజంగపుంగవమతంగభవారిపురంగలింగతా
రాంగజజిత్తురంగభుజగాంగదసారసనందనాంగనా
లింగనకీర్తిధుర్యుఁ డగులింగనమంత్రి చెలంగు ధారుణిన్. 43

గీ. ఆచమూనాథపతికి నర్ధాంగలక్ష్మి, యైనకోనాంబ ముఖవిజితాబ్జబింబ
బంధురక్షావలంబ సౌభాగ్యగుణక, దంబ విలసిల్లు నన్నదానాంబ యనఁగ. 44

గీ. కోనమాంబకు లింగప్రధానమణికి, వెలయు చందాయి కోనక్క వెంకటమ్మ
రాజమంత్రి నారాయణరాయమౌళి, సంభవించిరి జగములు సన్నుతింప. 45

గీ. చందురుఁడు రోహిణీదేవి చందమునను, చందమాంబను [1]గ్రొత్తమల్చంద్రమంత్రి
హర్షమిగురొత్తఁ బెండ్లియై యంగరంగ, వైభవంబుల వన్నెయు వాసిఁ గాంచె. 46

గీ. భూనుతైశ్వర్యనికురుంబ కోనమాంబ, కుటిలరిపుగజమృగరాజు గోపరాజు
సంగయామాత్యు వరియించెఁ జక్రహస్తు, నిందిరాదేవి వరియించు చందమునను. 47

క. పెద్దతికంబులు ప్రియములు, హద్దుగఁ గని వెంకటమ్మ యనవరతము తా
ముద్దియ లెల్ల నుతింపఁగ, ముద్దప్పను బెండ్లియాడి ముదము వహించెన్. 48

వ. అప్పవిప్రతాతిలకంబునకు సహోదరుండు. 49

సీ. ఏమంత్రిసౌందర్య మింద్రనందననందనందనాత్మజులపై పొందు లుంచు
నేమంత్రిసత్కీర్తి యిభరాజమృగరాజశరరాజకాంతులసవరిణించు
నేమంత్రియైశ్వర్య మీశాలకాధీశకౌరవేశస్ఫూర్తి గారవించు
నేమంత్రివితరణం బింద్రమణీనభోమణిభవభవశిరోమణుల మించు
గీ. నతఁడు లక్ష్మీశచరణసేవాధికుండు, ప్రబలసుల్తానహమ్మదుపాదుషాయి
మహితసామ్రాజ్యవైభవమజుముదారు, రాయహేళినారాయణరాయమౌళి. 50

ఉ. రాయని నిల్చి పిల్చి కవిరాయలకోరిక లెల్ల నిచ్చు నా
రా యనిపించుచుం బుడమిరాయనిచేఁ గను రాజ్యలక్ష్మిమేల్

1 కోనపోల్పొందమంత్రి.

రాయనఁ జేయుఁ వేలుపులరాయనిభూజ నిరంతరంబునా
రాయణరాయఁ డేమగురురాజులు మెచ్చ ధరాతలంబునన్. 51

ఉ. కాయఁ డొకింత యైన నృపకార్యవిరోధుల నెట్టివారికిం
జేయఁడు కీడు నిచ్చలును శ్రీహరిపాదపయోజపూజలుం
బాయఁడు రాజచోరకథ పజ్జకు డాయఁడు లింగమంత్రినా
రాయణరాయఁ డెన్న నవలావలరాయఁడు రాయఁ డన్నిటన్. 52

సీ. ద్విజరాజుకళలచే వెలయించు హంససంతతులపైఁ బక్షపాతం బొనర్చు
నమరశాఖికులంబు సుమనోగతుల మెల్పు భోగీంద్రునకు నవ్యభోగ మొసఁగు
నగ్రహారంబుల కలరుసూత్రము నేయుఁ శంకరు నినువీర్యసరణి మనుచుఁ
దగ సరస్వతికి నంతస్స్వరము ఘటించు విబుధవాహిని యెందు విస్తరించు
గీ. గరిమ నిందుపురేల లింగన్నమంత్రి, రాజమౌళినారాయణరావుకీర్తి
కారణగుణంబు విడువదు కార్య మనుచు, జగతి కెల్లను బోధించుచందమునను. 53

గీ. అమ్మహామంత్రిశేఖరుఁ డచ్చుబాయి, వెంకటమ్మను బెండ్లి యై వివిధభోగ
భాగ్యవిభవంబు లొందుచు బహుళదాన, ధర్మము లొనర్చె ధారుణీతలము వొగడ.

సీ. అన్నదాననిరూఢి నన్నపూర్ణకు సాటి యచ్చుబాయమ వెంకటమ్మగారు
ఐశ్వర్యసామగ్రి నబ్ధికన్యకు సాటి యచ్చుబాయమ వెంకటమ్మగారు
కమనీయరూపరేఖలయందు రతి సాటి యచ్చుబాయమ వెంకటమ్మగారు
అధికక్షమాయుక్తి నవనిదేవికి సాటి యచ్చుబాయమ వెంకటమ్మగారు
గీ. సకలభోగానుభవముల శచికి సాటి, రమణ వెలయఁ నారాయణరాయమణికి
ప్రాణవల్లభ యై వేడ్కఁ బరఁగుచున్న, యచ్చుబాయమ్మ యల వెంకటమ్మగారు. 55

వ. అందు. 56

సీ. రూపరేఖారూఢి రోహిణీదేవికి హెచ్చుగా యనవచ్చు నచ్చుబాయి
నమితభోగంబుల నలశచీదేవికి హెచ్చుగా యనవచ్చు నచ్చుబాయి
చతురభాషణముల శారదాదేవికి హెచ్చుగా యనవచ్చు నచ్చుబాయి
భూరిక్షమాయుక్తి ధారుణీదేవికి హెచ్చుగా యనవచ్చు నచ్చుబాయి
గీ. పతిపదాంబుజయుగసేవఁ బద్మకన్న, హెచ్చుగా యనవచ్చును నచ్చుబాయి
ననుచు నఖిరతి బాంధవు లభినుతింప, నలరు నారాయణారాయ నచ్చుబాయి. 57

గీ. రమణ వెలయు నారాయణరాయమణికి, నచ్చుబాయికి జనియించి రలర సగ్గు
బాయి కొమ్మక్క కొండమ్మ భద్రకీర్తి, దానధర్మాధికుండగు కొనవిభుఁడు. 58

గీ. వెలయ సగుబాయి సబినీసు వేంకటేశు, గంగ కెనయైన కొండమ్మ లింగమంత్రి
రమణి కొండమ్మ యానంతరాయవిభుని, వరుస వరియించి రత్యంతవైభవముల. 59

వ. ఈపతివ్రతాతిలకంబులకుం జనకుం డగునారాయణమంత్రిచంద్రుని పిన్నతాత. 60

గీ. లలి ననంతయ్యకొండమవలనఁ దంగ, మక్కజిన్నిమాంబికను రామక్కగారి
నక్కపలిచంద్రు ధర్మాయియందు ధీరు, నిఖిలవిద్యావిహారుఁ గోనేరుఁ గాంచె. 61

ఉ. కోరుపదార్థమిచ్చు బుధకోటికి గానకళాప్రవీణతం
దేరు రఘూత్తమప్రకటనిత్యదయాగతరాజ్యలక్ష్ములన్
మీఱు మహాగభీరుని సుమేరుమహీధరధీరు వీరు గో
నేరు నుతింపశక్యమె వినిర్మలకీర్తివిహారు ధారుణిన్. 62

గీ. కోనయామాత్యచంద్రుండు కూర్మిలీనఁ, గీర్తినిధియైనదామెర గిద్దె నాగ
మంత్రిశేఖ సత్పుత్రి మహితగాత్రి, సంగుబాయిని వరియించె జగము వొగడ. 63

గీ. తంగమక్క వెలీకుంట తంగనాగ, ధీరు జిన్నమ శ్రీకల్వకూరికోన
విభుని తామక మల్లయవేంకటేంద్రుఁ, జేర్మి లింగమ బ్రహ్మాజిఁ బెండ్లియైరి. 64

క. అక్కపలిమంత్రిచంద్రుఁడు, చుక్కలచక్కందనమును జుక్కరనంగా
విక్కడినాగమ నేబమ, నొక్కమ్మడిఁ బెండ్లియాడి యున్నతికెక్కెన్. 65

గీ. అక్కపలికి నాగాయికి నాత్మజాత, యైనగిరుమాయి గంగాసమానధర్మ
కార్యనిర్వహణోత్సుకు ఖారుఖాన వీరయామాత్యు వరియించి వేడ్కగాంచె. 66

వ. ఈమంత్రిమణికి మామయగు నక్కపలిమంత్రిశేఖరునిపినతండ్రి. 67

క. సరసుఁడు కేసామాత్యుఁడు, నరసాయిం బెండ్లియాడె నవ్యప్రీతిన్
హరి కలశాంబుధికన్యం, బరిణయ మైనట్లు బుధులు ప్రస్తుతి సేయన్. 68

క. వరుసము వల్కడు పుత్రుల, వరుసం బోషించు నతిథివర్గంబుల ని
ల్వరుస గలసాధ్వి కెనయే, నరసమ చెన్నంగఁ దరమె నలువకు నైనన్. 69

సీ. కానీనసంతాన ఘనసమానమహాదానచతురుండు యాజమంత్రి
సర్వంసహాచక్రసంరక్షణాధ్యక్షదక్షదీక్షుఁడు పెద్దధర్మమంత్రి
సౌందర్యగాంభీర్యచాతుర్యశౌర్యాది సరససద్గుణరాశి నరసమంత్రి
ధర్మాంబరధ్యానమర్మవినిర్మలధర్మచిత్తుఁడు పినధర్మమంత్రి

గీ. సంతతైశ్వర్యవంతుఁ డనంతమంత్రి, కానమాంబామణియుఁ బినకానమాంబ
కీర్తినిధి యైన నరసయ కేసమంత్రి, నరసమాంబయుఁ గలిగిరి సరసమతులు. 70

వ. అందు. 71

గీ. శౌరి పెదకానమాంబ బండారుధర్మ, నార్యవర్యుండు పినకానమాంబ గంటి
నరసమంత్రియు వరియించి నవ్యభవ్య, భోగవైభవభాగ్యవిస్ఫూర్తిఁ గనిరి. 72
ఉ. మందరశైలధీరుఁడు సమస్తజనస్తవనీయభావసం
క్రందనుఁ డర్థిపోషణధురంధరుఁ డీశపదాంబుజద్వయీ
వందనశీలుఁ డార్యగుణవర్ణితకీర్తివధూమనోహరుం
డిందుపురేలకేసవిభునేబనమంత్రి చెలంగు ధారుణిన్. 73
గీ. ధర్మగుణశాలి యీబప్రధానమౌళి, వివిధభాగమ్ములో గ్రమ్మ వెంకటమ్మఁ
బెండ్లియై కీర్తిసుకృతముల్ పృథివిఁ గుప్ప, తెప్పలుగఁ గప్ప నప్పఁగొండప్పగనియె.
చ. పలికిన బల్కు కొంగుముడి పట్టినపట్టు ధ్రువంబు నెమ్మదిం
దలఁచిన తల్పు సిద్ధము ఘనంబుగ నిచ్చినయీవి యక్షయం
బలవడఁ జూచుచూపు సకలార్థినిదానము మంత్రిమాత్రుఁడే
తలఁపఁగ ధర్మమూర్తి పెదధర్మశిరోమణి ధారుణీస్థలిన్. 75
క. ధీమణి యిందుపురేల, గ్రామణి బుధబాంధవాప్తగాయకకవిచిం
తామణి యాశ్రితజనర, క్షామణి పెదధర్మబుధశిఖామణి వెలయున్. 76
ఉ. సూరిజనోపకారి పరిశుద్ధమనోంబుజభాసమానదై
త్యారి సమస్తపాపపరిహారి బలారిసమానభోగసం
చారి విదారితారిశరశారదనీరదసారదాబ్జవి
స్తారయశోవిహారి పెదధర్మయశౌరి చెలంగు ధారుణిన్. 77
క. ఆయుత్తమచరితుఁడు ధ, ర్మాయిని గులరూపగుణవిరాజితఁ బినధ
ర్మాయిని బరిణయ మయ్యెను, శ్రీయువతిని భూమి నతుల శ్రీహరికరణిన్. 78
క. ధర్మంబులు నడుపుచును న, ధర్మంబుల తెరువువోక ధర్మాత్ములు స
ద్ధర్మగుణరాశి యనఁగా, ధర్మాజీచంద్రు పెద్ద ధర్మక వెలయున్. 79
చ. సరసిజగర్భువాణిగతి శంకరుపార్వతికైవడిం బురం
దరుని పులోమనందనవిధంబున నచ్యుతులక్ష్మిమాడ్కిఁ బ్రి
స్ఫురితవచోన్నదానమతి భోగసమృద్ధుల సంతతంబు నా
దరుమయమంత్రిచంద్రు పినధర్మక మించు ధరాతలంబునన్. 80
గీ. కీర్తినిధి రామభద్రుండు కేసమక్క, యచ్చమయుఁ లింగమయుఁ గోనమాంబగారు
మంత్రినిధియైన పెద్దధర్మప్రధాన, మణికిఁ గల్గిరి పెద్దధర్మక్కవలన. 81
వ. అందు. 82

గీ. కేసమక్కను దామరగిందెనంగ, ఘనుఁడు నచ్చమ లింగనగారి వివాహ
చేయఁ గోనక్కసావడిసింగమైన, లింగవిభుఁడు వరించిరి చెంగలించి. 83

క. ఏవడిగిన నిడుకర్ణుని, కైవడి శ్రీరామపాదకమలార్చకుఁ డా
పోవడి పోవడిసేయును, సావడి లింగన్నమంత్రిచంద్రుఁడు ధాత్రిన్. 84

క. పదిదిక్కుల నిజకీర్తులు, వెదచల్లుచు ధరణి పొగడ వెలసిన తత్త్వా
భ్యుదయుఁడు రామన యతనికి, మదనాకృతి రామకృష్ణమణి జనియించెన్. 85

వ. ఇమ్మంత్రిమణిపితామహుం డైనపెదధర్మయామాత్యు ననుజుండు. 86

క. నరసారథిపదభక్తుఁడు, సరసామితవాగ్విలాససౌజన్యుఁడు భూ
వరసాధుసభాపూజ్యుఁడు, నరసామాత్యుండు వెలయు నయవినయములన్. 87

గీ. మంత్రిమణినరసప్ప ధర్మాయివలన, నలఘుతరబుద్ధి సురమంత్రి యాబమంత్రి
రమ్యగుణహారి గొండలరాయశౌరిఁ, గనియె సముచితదానవిఖ్యాతి మెఱయ. 88

క. ధార్మికవాది నయజ్ఞుఁడు, ధర్మానుసభాపదాబ్జతత్పరమతి యై
ధర్మాత్ములపొగడిక గని, ధర్మాధీశ్వరుఁడు పిన్నధర్మన వెలయున్. 89

క. ఆమాన్యుఁడు భాగీరథిఁ, బ్రేమ న్వరియించి కాంచెఁ బేర్మిని సుగుణో
ద్దాముల యాబన వేంకట, రామామాత్యులను గీర్తి రంజిలుచుండన్. 90

సీ. తరములు పాలింప ధర్మంబు పూరింపఁ బ్రజల మన్నింప భారము వహింపఁ
దగవులు దీర్ప నుద్దండులఁ దెగటార్పఁ గార్యంబు లొనఁగూర్ప ఘనుల నేర్పఁ
బరుసఁదనము వీడ బంధువర్గముఁ గూడఁ బాపములకు నోడ భాష లాడ
శరణాగతులఁ గాయ సజ్జనంబుల డాయ నుపకారములు సేయ లిపులు వ్రాయ

గీ. సప్తసంతానములు నిల్ప సఖుల మన్ప, నర్థ మార్జింప శ్రీహరి నభినుతింప
సరసుఁ డిందుపురేలకేసప్రధాన, మణితనూజుఁ డనంతయామాత్యమౌళి. 91

క. ఆనీరధిగంభీరుఁడు, కానకవరియించి కాంచె కాహినికాబా
జాని స్సద్గులగని యగు, కోనమ్మను సకలజనులుఁ గొనియాడంగన్. 92

గీ. అమ్మహామహు పినతండ్రి యఖిలదాన, ధర్మనిధి యైనపెద్దప్రధానమౌళి
ప్రేమ దళుకొత్త నాచారిఁ బెండ్లియాడి, సంతతోదారకీర్తులు సంతరించె. 93

క. ఆయనయనుజుఁడు ఖండే, రాయఁడు కేసమ్మవలన రసికుని గీర్తి
స్థేయుని నామామాత్యుని, ధీయుతు సుతుఁ గాంచె దివ్యతేజం బలరన్. 94

క. సరసుఁడు నామామాత్యుఁడు, నరసాయిం బెండ్లియాడి నానాభోగ
స్ఫురణం బెనుపొందుచు ను, స్థిరతరసత్కీర్తి యెల్లదిక్కుల నించెన్. 95

ఉ. వీరల కంతకంత కభివృద్ధిగ దీవన లిచ్చుచు న్సదా
చారపరాయణత్వమున సత్త్వమునన్ ఘన వేదశాస్త్రవి
ద్యారభటిం బురోహితుల కగ్రణియై విలసిల్లు ధాత్రిం బ
ల్లాఱు నుతింప భాస్కరుని మల్లన మల్లహరాంఘ్రిభక్తుఁడై. 96

—— షష్ఠ్యంతములు. ——

క. శ్రీమదయోధ్యాపట్టణ, ధామునకున్ జానకీహృదయకుముదసుధా
ధామునకుఁ దనురుచివిజిత, జీమూతస్తోమునకును శ్రీరామునకున్. 97

క. కృతికిం గువలయనీలా, కృతికిన్ సుగ్రీవదత్తకిష్కింధాభూ
స్థితికిన్ సంతతసత్య, వ్రతికిన్ జగదవనమతికి రఘుకులపతికిన్. 98

క. పరహితవిస్రంభునకున్, దురపహ్నవశత్రుభయదదోస్స్తంభునకున్
శరణానతశంభునకున్, శరణాగతరక్షణైకసంరంభునకున్. 99

క. కులనగధీరునకు న్ని, స్తులితాక్షయఖడ్గబాణతూణీరునకున్
జలనిధిగభీరునకు ని, ర్మలకీర్తివిహారునకును రఘువీరునకున్. 100

క. ఆగమనుత పదపద్మప, రాగనిరస్తాభియోగరాజదహల్యా
యోగానురాగగౌతమ, వాగభినుతవిశదకీర్తివాల్లభ్యునకున్. 101

# ప్రథమాశ్వాసము.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన హరివంశకలితం బైన యా
శ్చర్యపర్వంబునందలి శేషధర్మంబులకుం గథాక్రమం బెట్టి దనిన. 102

క. కామితఫలదమహీరుహ, సామగ్రిం జెలఁగి మౌనిశతసవనసదా
క్రామితమై ధరణిస్థలి, నైమిశవన మొప్పరు నందనవనం బనఁగన్. 103

ఆ. అచట దీర్ఘసత్త్రయాగంబు సేయుచు, శౌనకాదిమునులు సకలపుణ్య
కథలు దెలుపుసూతుఁ గనుఁగొని వినుతించి, పలికి రిట్లు మనము పల్లవింప. 104

సీ. సూత మహాభాగ శోభనచారిత్ర వ్యాసప్రసాదంబు వాసి గన్న
యాతెఱుఁగని యర్థ మింతైనఁ గలుగునె వేదశాస్త్రపురాణవేది వీవ
బహుపుణ్యఫల మిచ్చుభారతకథలెల్ల వినిపించితివి మాకు వీను లలర
శ్రీకృష్ణచరితాభిషిక్త మై కనుపట్టు హరివంశ మచ్చట నద్భుతంబు
గీ. లెవ్వి గల వందు నవి యెల్ల నేర్పడించి, పలికి సభ్యులడెందంబు పల్లవింపఁ
జేయుఁ ధర్మంబు మీవంటి శిష్టజనుల, కిందులకె కాదె పెద్ద లై యెన్నఁ బడుట.

క. అని పలికిన సూతుండును, వినుఁ డీయర్థంబు మీరు వేఁడినరీతిన్
జనమేజయభూపతియును, ఘనవైశంపాయనమునిఁ గనుఁగొని యడిగెన్. 106

ఉ. వింటిమి సర్వధర్మములు వింటిమి కౌరవపాండవస్థితుల్
వింటిమి కృష్ణదేవుఁ డరివీరుల నెల్ల జయించి కానుకల్
గొంట లసద్దయామహిమకుం గుఱి సేయుచు భారతంబు మీ
రంటినవేడ్కఁ బల్కఁగ ధరామరలోకశిఖావతంసమా. 107

చ. ఇలఁ గలయట్టి పుణ్యకథ లెల్లను బల్కితి రీర లందులో
పల నొకఁ డాన తీయ రది భద్రకరం బగు పాండుసూనుల
న్నిలుపఁగఁ గోరి కృష్ణుఁ డతినిర్మలకీర్తి రహస్యభాషలం
దెలిపినయర్థ మంతయును దేవరవా రెఱిఁగింపఁగాఁ దగున్. 108

వ. అని నిజవచనసుధారసంబుఁ గర్ణపుటంబుల నింపం గోరుచున్న శౌనకాదులకు సూతుం డానతిచ్చె మీ రడిగినయట్లు రాజసింహం బైనజనమేజయుండు వేఁడినం దలంచుకొని ధర్మం బెఱింగినవాఁ డై వైశంపాయనుం డి ట్లనియె. 109

క. జనమేజయభూవల్లభ, వినుతాశ్చర్యంబు ధర్మవేత్తలచేతం
బనివడి నుడువంబడినది, విను కృష్ణకథామృతంబు వీనులు దనియన్. 110

వ. విచిత్రధర్మంబులు నరకవేదనలు విష్ణుచరిత్రంబులు భక్తిలక్షణంబులు నన్నజలగో భూమిదానంబులు సత్సంగమలాభంబులు సాలగ్రామఫలంబులు నేకాదశీవ్రతంబులు నతిథుల యతిబ్రహ్మచారులం బూజించిన సుకృతంబు విష్ణు ప్రదక్షిణ సౌభాగ్యంబు మహాత్ములకు నమస్కరించిన విశేషంబు జననీగర్భచింతయుం సంసారవిచారంబు బుణికథనికగతులు గంగాకావేరీపంపామహిమయుఁ జంద్రపుష్కరిణీస మున్నతియుం రంగనాథవైభవంబు శ్రీశైలవేంకటాచల హస్తిశిఖరంబుల కరిగిన వారి పుణ్యఫలంబుల సింహాద్రి హేమకూట విరూపాక్ష కుంభకోణంబుల దర్శించిన మేలు జయంతీనవము లాచరించిన యతిశయంబులు శివరాత్రివ్రతలక్షణంబును నఖిల మునిదేవభూదేవమధ్యంబున సకలధర్మస్వరూపి యైన కృష్ణుం డానతిచ్చిన భీమార్జుననకులసహదేవద్రౌపదీసమేతుం డై ధర్మరాజు వినియె నని జనమేజయుం డి ట్లనియె. 111

క. ఎచ్చోట నుండి కృష్ణుం, డచ్చుపదం గథలు నొడివె నానతి యిమ్మా
విచ్చలవిడి భూసుర యన, నచ్చతురుఁడు హర్షమగ్నుఁ డై యిట్లనియెన్. 112

ఆ. రాజ్య ముడిగి పాండురాజతనూజులు, ద్రుపదరాజపుత్రితోడఁ గూడి

కామ్యకవనిలోనఁ గాఱియవసుదుండ, యనుఘుండు తెలిసి యావరమున, 113

మ. వివిధాయుధమ్ములు సవరించి యుద్భటాద్భటులు చూపుచు వీరభటులు నడువ
ఖురపుటాహతి రజోగరిమను మింటికి వలస గావింప నశ్వములు దొడర
వరనేమిఘట్టనం బురగలోకము త్రోవ సవరింప రథములు సందడింప
రోదోంతరము మేర రూపింపఁ బట్టైన కరులు కొండలపెంపుఁ గావనేయ

గీ. నేల యీనినకైవడి నిండికొన్న, బలము లరుదేర వారణపట్టణంబు
డాయఁ జనుదెంచి తత్సౌధజాయమాన, మణివిభాస్ఫూర్తి కాశ్చర్యమగ్నుఁ డయ్యె.

వ. అంత భీష్ముఁ డెదురుగా వచ్చి విదురసహితుం డై యున్నవాసుదేవు సుచిత్రప్రకా
రంబున దర్శించి యర్ఘ్యపాద్యాదికృత్యంబు లాచరించి కుశలం బడుగువాఁడై
యి ట్లనియె. 115

ఉ. నేమమె కృష్ణ మీకు యదుసింహము రాముఁడు లెస్స యున్నవాఁ
డే మఱి వృష్ణిభోజులకు శీవియె రుక్మిణి సత్యభామయుం
బ్రేమ భజింతురే సుతులు పెంపు వహింతురె వైరిభూపతుల్
నేమముతోడ నెల్లపుడు నీపదపద్మము లాశ్రయింతురే. 116

క. వనజాక్ష భవద్దర్శన, మునఁ బాపము లెల్లఁ బోయె మోదము గలిగెన్
నినుఁ గన్న యంతమాత్రనె, ఘనఫలములు దమకుఁ దామ కలుగుచు నుండున్. 117

గీ. పద్మలోచన నీరాక భాగ్య మబ్బెఁ, బాపములు పేరు నుడివినఁ బాఱిపోయె
స్వప్నమున నైన నీకీర్తి సౌఖ్యమిచ్చుఁ, జూడఁగల్గిన జుబ్బనచూఱగాదె. 118

క. మును లైనను నీపదములు, గనఁ జాలరు పుణ్యమేమి గల్గెనొ నాకుం
గనుఁగొంటిని జన్మాంతర, మున నైనం బాపసమితిఁ బోకార్తు నిటన్. 119

వ. పరులకు మీదర్శనంబు దుర్లభంబు గాదె యని పల్కి సత్కారంబు చేసిన నవ్వ
క్తుండు నిరంజనుండు నప్రకాశుండు నైనకృష్ణుండు దంతమరీచిజాలంబులు మణి
మండపంబునకు వన్నెవెట్టుచు నవ్వు దళుకొత్త విదురునిం జూచి భీష్మున కి
ట్లనియె. 120

క. విను భీష్మ పాండునందను, లనఘులు ధర్మస్వరూపి వగునీ వుండం
బనిలేనిపనికి నయ్యో, వనవాసాయాసభరము వారికిఁ దగునే. 121

క. కౌంతేయులు నావా రని, స్వాంతంబునఁ దెలియు మెగ్గు వారికి రా దా
కాంతులకుఁ గీడు నేయం, జింతించినజనుల కెల్లఁ జేసేత నగున్. 122

మ. అని వేగంబున లేచి ద్రోణ కృప భీష్మాదిత్యపుత్రాదియో
ధనికాయంబుల గుండియ ల్చెదర గాంధారీతనూజు ల్భయం
బున జంక న్విదురుండు కామ్యకవనీభూమార్గముం జూపఁగాఁ
జని యాకృష్ణుఁడు పాండునందననిరీక్షాసక్తచిత్తంబుతోన్. 123

వ. అంత విదురు నిలువ నియోగించి. 124

సీ. భీష్మునిఁ దనవెంటఁ బెట్టుక చని కాంచె దైత్యారి యనఘుని ధర్మసుతునిఁ
దమ్ములు ద్రౌపది ధర్మశీలురు మును ల్వేదశాస్త్రపురాణవిహితమతులు
నవనీసురులు సోమయాజులు గాంధర్వవిద్యావిచక్షణుల్ వినయపరులు
నాటకాలంకారపాటవాభిజ్ఞులు తత్త్వవేత్తలు శబ్దతర్కఘనులు

గీ. విష్ణుభక్తులుఁ బెద్దలు వీరవరులు, నీతిమంతులు సరసులు నేరుపరుపఁ
గవులు మంత్రులు భృత్యులుఁ గార్యదక్షు,లలమి కొలువంగఁ గొలువున్నయట్టివాని.

వ. ఆసమయంబున. 126

ఉ. లీల సుయోధనుం దునిమి లెస్సగఁ దద్రుధిరాంబుధారలం
దేలునమంచుఁ జేత గదఁ ద్రిప్పెడితమ్ములఁ గూడి పాండుభూ
పాలసుతాగ్రజుం దదరిపాటుగఁ జూచి యెదుర్కొనెన్ దయా
శీలురఁ బుణ్యమూర్తులఁ బ్రసిద్ధచరిత్రులఁ గృష్ణభీష్ములన్. 127

వ. అప్పుడు కందమూలఫలంబులతోడ నెదుర్కొని నడుచుచు సంగంబువలనం గామం
బును గామంబువలనం గ్రోధంబును గ్రోధంబువలన మోహంబును మోహంబు
వలన స్మృతివిభ్రమంబును స్మృతివిభ్రమంబువలన బుద్ధినాశంబును బుద్ధినాశంబున
నాత్మవివేకంబును నెడలునని గీతలయందుఁ బలుకంబడియెఁ గావున నిది యెఱింగి
బుద్ధిమంతుండు సంగంబుఁ బరిహరించునది. 128

ఆ. వాసుదేవ కృష్ణ వనమాలి సర్వేశ, లోకనాథ భక్తలోకవరద
చక్రహస్త నాదుసత్యప్రతిజ్ఞలు, నిలుపవయ్య కరుణ నీరజాక్ష. 129

క. అని ధర్మలోపభయమున, వనజాక్షుని భక్తలోకవరదు రమేశున్
మనమున నిడికొని ధ్యానం, బొనరించెను ధర్మతనయుఁ డురుతరభక్తిన్. 130

వ. అప్పుడు. 131

క. హరియును ధర్మజుధర్మము, నిరుపమగతి నిలుపఁ దలఁచె నెమ్మదిలోనన్
సురతరువు కరణి గోర్కులు, కరుణించుం గాదె భక్తగణముల కెందున్. 132

వ. అని యిట్లు ధర్మరాజు ధ్యానంబు సేయుచు ననుజసహితుండై కందమూలఫలంబుల

తోడ బ్రాహ్మణవర్గంబుఁ బురస్కరించుకొని కృష్ణభీష్ముల నెదుర్కొని యథోచితంబుగా నాలింగననమస్కారంబులు నర్ఘ్యపాద్యాదికృత్యంబులు నాచరించి తోడ్కొని తెచ్చి పర్ణశాలామధ్యంబున దర్భాసనం బిడి సుఖోపవిష్టులైన వారిం గుశలం బడుగం దలంచి యిట్లనియె. 133

ఉ. యాదవనాథ మేలె యిటకై చనుదెంచుట కేమిహేతువో
పేదల బంధుహీనులను బెంపుఁ దొఱంగిన మమ్ముఁ జూడ స
మ్మోదము మీకుఁ దాత కగు ముచ్చటతో ధృతరాష్ట్రనాత్మజుల్
మేదిని నేలని మ్మనెడు మెల్పునఁ గన్గవ నీరు వెల్చుచున్. 134

గీ. కృష్ణ సర్వాత్మ నీమాయఁ గికురువెట్టఁ, దరమె మాకంచుఁ దమ్ములు దాను నూర
కున్న భక్తుల దుఃఖంబు లుడుపఁ గోరి, యమరతటినీతనూజున కనియెఁ జక్రి. 135

ఉ. వీరలఁ జూడు భీష్మ హరివిక్రమశాలులు సత్యసంధు లా
చారపరాయణు ల్వినుతసత్యధురీణులు ధర్మవర్తనుల్
ధీరులు నాకు భక్తులు విధేయులు మీకు ను గోప మీర్ష్యయుం
జేరఁగనీనివారు గుణశీలురు పాండుకుమారు లారయన్. 136

వ. అనిన దేవకీనందనునకు గంగానందనుం డిట్లనియె. 137

ఆ. నీపదాబ్జభక్తి నిర్మలాచారంబు, నెఱపువారికోర్కి నించుభార
మరయ నీకుఁ గాక యన్యుల కబ్బునే, కాన వారిఁ గావు కమలనయన. 138

క. నీభక్తుఁ డెవ్వఁ డైనన్, శోభనసాయుజ్యపదము సులభముగఁ గను
న్నీభక్తుఁడు గాకుండిన, భూభర్తయు నైన నరకమునఁ బడును హరీ. 139

వ. అనిన గంగానందనునకు దేవకీనందనుం డిట్లనియె. 140

గీ. బలదయాసత్యనిధులైన పాండవులకుఁ, దెలుపుమా జ్ఞానబోధంబు తెలఁగు భీష్మ
చిత్త మెప్పుడు మాయందుఁ జేర్చువారి, కిహపరభయం బటన్నది యింత లేదు.

క. అని పలికిన శాంతనవుఁడు, వనజాక్షుని భక్తలోకవరదునిఁ గృష్ణున్
మనమున నిడికొని మ్రొక్కుచు, వినయంబున ధర్మరాజు విన ని ట్లనియెన్. 142

సీ. పాండునందన జగత్ప్రఖ్యాతచారిత్ర కేవల బ్రహ్మంబు కృష్ణమూర్తి
చుట్టంబు చెలికాఁడు శుభదాత మంత్రంబుఁ దపములు జ్ఞానంబు ధర్మ మితఁడె
యీదయాసాగరు నింద్రాదిసన్నుతు నఖిలభూతాధారు నాదిదేవు
సర్వలోకశరణ్యు సంతాపతారకుం గామితార్థప్రదుఁ గంజనాభుఁ
ఆ. జంద్రసూర్యనేత్రు సంసారపారగు, భుక్తిముక్తు లిచ్చుపుణ్యపురుషుఁ

గాఁగ నెఱిఁగి కొలువు కల్పవృక్షము రీతిఁ, గోర్కులెల్ల మిగులఁ గురియు నీకు.143

వ. అనిన విని భీష్మునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 144

ఉత్సాహ. సర్వశాస్త్రవేది వీవు జాహ్నవీతనూజ ని
ర్గర్వయుక్తి ధర్మయుక్తి గంజనాభభక్తియుంఙ
బర్వమై తనర్చుఁ దెలియఁ బలుకుమయ్య యాకసం
బుర్వి నిండినారు సురలు యోగివరులుఁ గోరికన్. 145

వ. అనిన యుధిష్ఠిరునకు భీష్ముం డిట్లనియె. 146

ఉ. పాండుతనూజ వింటె హరిభక్తి పఠించిన విన్నవారికిం
గొండలవంటిపాపములు గూలుచుఁ గోరుకు లిచ్చుఁ గావునం
గుండలిరాజతల్ప విభుఁ గొల్చుము కొల్చినవారి కెంతయు
న్నిండు శుభంబు శాత్రవులు నిల్వరు బాధలు చేర వెచ్చటన్. 147

సీ. వాసుదేవుని గృహద్వారంబునకు నేగుపాదముల్ సౌఖ్యసంపాదకములు
శ్రీవల్లభునిఁ బూజసేయంగ మరగిన హస్తంబు లమితపుణ్యాకరములు
జలజాక్షురూపంబుఁ జక్కఁగా నీక్షించుకన్నులు వైభవకారణములు
హరినామకీర్తనం బశ్రాంత మొనరింపఁ బట్టినజిహ్వ సౌభాగ్యకరణి

గీ. నిక్కమీమాట నిక్కము నిక్క మరయ,భుజము లివె యెత్తి పలికెద బొంకు గాదు
వేదశాస్త్రంబులకు మించు వెదక దొరక, దవని దైవంబు లేదు కేశవునికంటె.148

సీ. సారంబు హీనవును సారెకు నెఱిఁగింతు ఘోరమై పరఁగు సంసారమునను
శ్రీవిష్ణుపూజన చింతన ధ్యానముల్ తలిదండ్రులకు సేవ సలుపువారి
పుణ్యకథాసక్తిఁ బ్రొద్దుపుచ్చినవారి నోడివినకార్యంబు నడుపువారి
నఖిలభూతములందు ననుకంప గలవారి ధర్మమార్గంబులు దలఁచువారి

గీ. సరస విడువక రక్షించుఁ జక్రపాణిఁ, గొలువు వర్ణింపు కూజింపు గలుగు శుభము
నిజము దెలియంగ దేహంబు నీరుబుగ్గ, కలిమి బలుములు మెఱుపులకరణి యరయ.

ఆ. సగము నిద్రచేత జరుగు నాయుష్యంబు, కడమ విడువ ముదువఁ గట్టఁ బూయఁ
దిరుగ విఱుగఁ బెరుఁగ దినములు గడచును, బుణ్య మాచరింపఁ బ్రొద్దు లేక. 150

ఉ. పిన్నతనమ్మున న్మిగులఁ బెద్దతనమ్మున ధర్మవర్తనల్
సున్న వయస్సున న్నడువఁ జొప్పగు దేహము శాశ్వతంబు గా
దెన్నఁటి కింతయుం దెలిసి యెగ్గు దలంపక పుణ్యమార్గముల్
గన్న మహానుభావులకు గల్గు నిరంతరసౌఖ్యసంపదల్. 151

గీ. వినుఁడు నామాట పాండవు ల్విశ్వసించి, దేహ మస్థిర మది నమ్మి తిరుగ రాదు
లోభ మోహంబు లుడుగుచు లోకనాథుఁ, జక్రిఁ బూజింప జన్మంబు సఫలమగును.

వ. పర్వతపాషాణ వృక్ష పక్షి పశుమృగాదులం గోటివేలు జన్మంబు లెత్తిన మానవదేహంబు గలుగు నందుఁ బూర్వపుణ్యవశంబున దేవదానవభోగబుద్ధు లుద్భవంబు లగును దుర్లభం బైనమనుష్యశరీరంబు దాల్చియుం హరిం బూజింపనివారికంటె మూర్ఖుండు లేఁడు పూజితుం డై జగన్నాథుండు కోరుకు లిచ్చుఁ బాదమాత్రంబెల్ల హస్తిపాదంబునకు లోనువ యైన తెఱంగున స్థావరజంగమాత్మకం బైనజగం బాకాశంబుచేతఁ గప్పంబడినచందంబున భువనంబు విష్ణువ్యాప్తం బై ప్రవర్తిల్లు నన్యోన్యసాధనంబు లైన జననమరణంబులు మర్త్యులకుం గొంగుముల్లె. తన్నాశనంబునకు మూలంబు పురుషోత్తమసేవ ధ్యానంబు చేసినఁ బూజించినఁ దలంచిన దండంబు పెట్టిన సంసారసాగరంబు దరియింపం జేయు మాధవు నెవ్వండు పూజింపక యుండు నెవ్వనిపేరు నుడివిన సకలపాపంబు లణఁగు నట్టినారాయణు పాదపద్మంబులు భజియించి జనకాదిరాజలోకంబు మోక్షంబుఁ గనియె నాసర్వేశ్వరు నామధేయంబు విజయంబునఁ జెలంగ లోకంబు సంసారసాగరంబునఁ బరిభ్రమించు నింతవిచిత్రంబు గలదే యెంతపర్యంతం బింద్రియవైకల్యంబు రోగంబులును బాధింపకుండు నంతలోనన ముక్తిరతులకు వైకుంఠపూజనంబు కర్తవ్యంబు మాటిమాటికి భుజం బెత్తి హితంబు సెప్పెద భుక్తిముక్తిప్రదుం డైనకృష్ణుం డెల్లకాలంబు నెల్లవారికిఁ బూజ్యుం డై యుండు. 153

క. క్రోధము హృదయముఁ గలఁచును, గ్రోధము పాపముల కెల్ల గురు వనిపించుం
గ్రోధము ధర్మముఁ జెఱచును, గ్రోధము విడువంగవలయుం గుణవంతులకున్. 154

క. విను సుఖదుఃఖంబులకును, మనసే కారణము దాని మాటికి నెటకుం
జననీయక హరియందుం, బనుపఱుపుము కౌతుకంబు పాటిలు నీకున్. 155

గీ. అచ్యుత యనంత గోవింద [1]యనెడి నామ, కీర్తనం బౌషధం బౌచుఁ గెడపఁజాలు
రోగజాలంబు లెల్ల నారూఢిగాఁగఁ, దథ్య మీమాట తప్పదు ధర్మపుత్ర. 156

క. హరిహరపూజాపరు లగు, పురుషులకును బంధుమిత్రపుత్రధనంబుల్
పరిపూర్ణంబుగ వెలయును, శరనిధిగంభీర జన్మజన్మములందున్. 157

క. ఇహపరములు గావలసిన, నహరహమును జేయవలయు హరిపూజనముల్
ఇహపరము లొల్లకుండిన, సహజంబుగఁ బరుల నింద సలుపఁగవలయున్. 158

1 యనెడిపేరు, నొడువఁ.

గీ. ధర్మమూర్తికి హరికిని దండ మిడ నె,వండు దేహంబు నింతైన వంచ ననివ
వాఁడు పాపాత్ముఁ డనఁబడు వనజనాభు, భక్తి దుర్లభ మందురు బ్రహ్మకైన. 159
ఉ. కోపములేక విప్రులను గూర్చి యసూయయుం లోభమోహముల్
దాపున నిల్వనీని యతిధన్యుని నీశుఁడు సంతసించు నా
శ్రీపతి యెల్లవారలకు సేవ్యుఁడ యాయన యాయదూత్తముం
డీపరమేష్ఠి కావఁగ వహించిన యప్పుడె చేరుఁ గోరుకుల్. 160
గీ. పుడమిఁ బుట్టింప రక్షింపఁ బొలియఁజేయఁ,గర్త కృష్ణుండ యాహరి కరుణఁ బలుక
సర్వధర్మకథాప్రపంచమ్ము వినుము, శోక మంతరయుఁ బోకార్చి సుఖివి గమ్ము. 161
క. అని గాంగేయుఁడు పలికిన, విని ధర్మతనూభవుండు విశ్వంభరుఁ దా
ఘనముగ నెఱింగి తత్పద, వనజంబులు పూజనేయ వాంఛించె మదిన్. 162
ఆ. శత్రుహరము పుణ్యసంపాదనం బఘ, భంజనంబు విష్ణుభక్తికరము
నయిన యాచరిత్ర మాసక్తిఁ బఠియించు, జనుల కిహపరములు సంభవించు. 663
క. ఈగతిఁ దెలియం బలికిన, భాగీరథికొడుకుపలుకుఁ బాటించి మహా
భాగుండు పృథాసూనుఁడు, యోగికులారాధ్యుఁ గృష్ణు నొయ్యనఁ బలికెన్. 164
ఉత్సాహ. దేవదేవ వాసుదేవ దివ్యతేజ కృష్ణ సం
భావనీయపాదపద్మ భక్తలోకరక్షకా
కావవయ్య నీదుభక్తిఁ గలుగఁజేసి యదియు మా
కావరించు నీవరంబు నాత్మలోఁ దిరంబుగన్. 165
ఆ. రాజ్య మడిగి కృష్ణ రాజీవలోచన, నిన్ను శరణుఁ బొంది నెగడఁగోరి
నార మఖిలధర్మ మారూఢమూలంబు, గాఁగ నెఱుఁగఁ బలికి కావుమయ్య. 166
మత్తకోకిల. నీవ చుట్టము నీవ నెచ్చెలి నీవ దైవము దాతయుం
న్నీవ విద్యయు నీవ ప్రాణము నీవ తల్లియుఁ దండ్రియుం
న్నీవ సొమ్మువు నీవ నేతవు నీవ మాకు సమస్తముం
గావు కావుము కృష్ణ మాధవ కంసదానవభంజనా. 167
గీ. పురము దేశంబు నశ్వకరిరథభటులు, నీకటాక్షంబు గలిగిన నిలిచి యుండుఁ
గడతుమే మేము నీయాజ్ఞఁ గమలనాభ, కొల్లగా నీదుదయ మీఁదఁ జల్ల వేల. 168
శా. ఏధర్మం బొనరింప వాంఛితము లీడేఱున్ సిరు ల్పెక్కు లా
నాధర్మం బెఱిఁగింపవే త్రిభువనఖ్యాతార్థము ల్నీకు సం
బోధార్హంబులునుం గరామలకము ల్ఖ్యాతప్రభావంబు ధ

ర్మాధర్మంబులు సువ్రతంబులును బుణ్యస్థానముల్ తీర్థముల్. 169

గీ. అనుచు నూరకయున్న ధర్మాత్మభవుని, చిత్త మీక్షించి మానుల చేష్టఁ దెలిసి
సకలలోకైకనాథుండు చక్రి పలికె, ధర్మవాక్యంబుఁ గుతుకాస్పదంబు గాఁగ. 170

## భూదానప్రశంస.

క. బళిబళి ధర్మకథల్ వినఁ, దలఁచితె వ్వఁడుఁ జిత్త మెంత ధన్యాత్ముఁడవో
కలిగించు విన్నవారికి, సులలితభూదానరక్తి శుభలోకంబుల్. 171

క. దానములలోన నుత్తమ, దాన మ్మరయంగ భూమిదానము దానం
గాననగు భుక్తిముక్తులు, మానవులకు సర్వలోకమాన్యచరిత్రా. 172

గీ. పుడమివలన సమస్తంబుఁ బుట్టుఁ గాన, సరవి నది యిచ్చినాతఁడె సర్వదాత
యమ్మహాత్మునిఁ బుణ్యలోకమ్ములెల్లఁ, దామ వరియించు నాచంద్రతారకముగ. 173

మత్తకోకిల. సోమయాజులు సత్యసంధులు సువ్రతు ల్గురుదేవతా
ప్రేమఁ బూనినవారు యోగులు పెంపుఁ గాంచి రొకింతయుఙ్
భూమిదాతలు వోలె వారలు పుణ్యజాలము వేలుపు
ల్తామె యెన్నదు రొక్కసత్కథ ధర్మనందన వింటివే. 174

తరల. కృతయుగంబునఁ దొల్లి శాంతుఁడు కీర్తి పౌరుషమూర్తి సం
తతదయానిధి యోగభూషణనామధేయుఁడు బ్రాహ్మణుం
డతులితాగ్నిసమర్చనక్రియ లైనచో బలివెట్టి వా
ర్చుతఱి నాతని బల్కెఁ దత్ప్రియసుందరీమణి మెల్లఁగన్. 175

ఉ. వీరె భవత్కుమారకులు వేఁగెద రాఁకట నేలఁ బొర్లుచు
న్నారు కృశాంగులై కనిననాటికిఁ జూడ వశంబె ప్రోవఁగా
నేరను గూరగాయ దిని నేనొకరీతి దినంబుఁ బుచ్చఁగా
నోరుతుఁ గాక యాశిశువు లోపుమరే పరికింపు వల్లభా. 176

క. దారుణచింతాజలగం, భీరము తనుజాతమకరభీకరము తిర
స్కారతరంగాకులమగు, దారిద్ర్యాంబునిధి మునుఁగుతన బ్రదుకేలా. 177

ఉ. లోఁడికులాంగన ల్మణులతోఁ గనకంబులతోడ వెండితో
వాడలవాడలన్ సిరికి వన్నెలు వెట్టుచు నాథ పుత్రులం
గూడి సుఖింపఁగా మనము కూటికిఁ గూరకుఁ జిక్కి బిడ్డ ల
ల్లాడఁగ నెల్లకాలము మహాత్మ కనుంగొనుచుండ శక్యమే. 178

క. అని కడు వేఁడుచుఁ జుట్టుం, దవయులు వేష్టింప విడినధమ్మిల్లములోఁ

గనుఁగవ నశ్రులు జాఱఁగఁ, బనుపుచు నిలఁబడిన చండిఁ బరికించి మదిన్. 179

వ. కారుణ్యంబు వొడమినవాఁడై పతి సతి కిట్లనియె. 180

ఉ. చింతిల నేల పుణ్యములు సేయనివారల కిట్టిదుఃఖముల్
వింతయె యింతయైన, బృథివీస్థలి విప్రులకిచ్చువార ల
శ్రాంతసుఖాభివృద్ధిఁ గనఁ జాలుదు రట్టిది నీవు చేయలే
దింతియ మాసమాత్రము సహింపు తపంబునఁ దెత్తు సంపదల్. 181

గీ. లలన నీరీతి నూఱడిలంగఁ బలికి, తపము సేయంగ నాత్మలోఁ దలఁచి సర్వ
సార మగు నొక్కపద్యంబు చదివె నపుడు, పుణ్యవర్తుఁడా యోగభూషణుండు. 182

క. దారిద్ర్యమ నీకు నమస్కారము నీకరుణ పెంపు గలుగంగా నే
నేరుతు నందఱిఁ గనుఁగొన, నేరం డొకఁడైన తనదు నెఱిఁ గనుఁగొనఁగన్. 183

వ. అని పలికి యోగభూషణుండు తపోవనంబునకుం జని యం దగ్నిప్రతిష్ఠాపనంబు సేసి
గ్రీష్మంబునఁ బంచాగ్నిమధ్యంబున వాయుభక్షణుండై జితేంద్రియుండై హృద
యంబునం బుండరీకాక్షునిం బదిలంబుగా నిలిపి బాహ్యేంద్రియంబులు మఱచిన
వాఁడై. 184

మ. హరి నారాయణు వాసుదేవు జలదశ్యాముఁ మురారిఁ దయా
పరుఁ బీతాంబరుఁ గౌస్తుభోజ్జ్వలు గదాపాణి స్మరించు న్రమా
వరునిఁ ధ్యానము సేయుచుం బొగడుచు న్వర్తిల్లు విశ్వంభరా
మరు మోసం బొనరింప వేలుపులు రంభ న్మేనకం బంపినన్. 185

క. వచ్చి తపోవిఘ్నమునకుఁ, జొచ్చినఁ గాకున్న మగిడి సురగిరి యంతఁ
జెచ్చెరనె బ్రహ్మవాదిని, నచ్చెడు తెరువునకు వెఱచి రసురులు సురలున్. 186

ఉ. అంతట దేవతాధిపతి యాత్మభయంబున విప్రభోజనం
బెంతయుఁ జేయఁ బంపె హరిదీశులతో నడువంగ శారదా
కాంతుని గాన నేఁగి శశికాంతులమించు కిరీటకాంతిఁ ద
త్ప్రాంత మలంకరించి నిగమార్థముల న్నుతియించె మించుగన్. 187

వ. అప్పుడు దేవత లిట్లనిరి. 188

ఉ. దండము దేవతాపతికి దండము నిర్జరలోకనేతకుఁ
దండము పద్మగర్భునికి దండము యోగిమనోబ్జవాసికిఁ
దండము హంసయానునకు దండము వేదసమూహమూర్తికిఁ
దండము సత్యమూర్తికిని దండము భాస్కరబింబవర్తికిన్, 189

వ. అని నుతియించిన దేవతలకు బ్రహ్మ యిట్లనియె. 190

మ. వినుఁ డో దేవతలార విష్ణువు జగద్విఖ్యాతచారిత్రుఁ డా
యనకన్నం గరుణాపరుండు ఫలదానాఢ్యత్వుఁ డొక్కండుఁ గ
ల్గునె యేలోకమునందుఁ గావున హరిన్ ఘోరాసురప్రాణభం
జను సేవింత మటంచు బ్రహ్మయును దీక్షాసక్తుఁ డయ్యెం దగన్. 191

వ. ఇట్లు ధ్యాననిష్ఠుం డైన పద్మగర్భుండు హృదయాంతరప్రవిష్టుం డైన భగవంతునిచేతఁ దెలుపంబడిన వాక్యంబులకు సంతసిల్లి నారాయణునిచేత మీకోరిక లీడేఱు నని సందేహంబు వాపి యింద్రపురోగము లైనయమరులం గూడుకొని భూసురుని తపోవనంబునకుం జని నిజస్వరూపంబుఁ దెలిపి నీతపంబునకు మెచ్చి వరంబు లీయ వచ్చితిమి వేఁడు మనిన బద్ధాంజలి యై నమస్కరించి యోగభూషణుం డిట్లనియె. 192

క. సిరు లిచ్చి కావు మెప్పుడుఁ, బరులకు నాశింపకుండ బ్రదికింపు మనన్
స్థిరసంపద లిచ్చితి భూ, సుర విప్రుల కొసఁగు మింక శుభ మగు నీకున్. 193

క. అని పలికి పద్మగర్భుఁడు, తనలోకంబునకు నరిగె ధరణీసురుఁడున్
వనజాక్షుని వర్ణించుచుఁ, జనియెన్ గృహమునకు నధికసంతోషమునన్. 194

వ. అనిన విని యోగభూషణుండు సంప్రాప్తమనోరథుం డై యింటికిం జని యతఁ డేచందంబునం బ్రవర్తించె నానతీయవే యనిన యుధిష్ఠిరునకు మురహరుఁ డిట్లనియె.

క. భుగభుగల వలచు సిరులున్, ధగధగలీనెడు సువర్ణతతిసౌధములున్
ధిగధిగని మెఱయు చెలులున్, సొగసగు నిలుసూచి భూమిసురుఁ డలరె మదిన్.

ఉ. వచ్చినతన్నుఁ జూచి నిజవాంఛితముల్ చిగిరింపఁ గానుకల్
దెచ్చి సఖీజనావయవదీధితితోడ నివాళి యీయఁగాఁ
జొచ్చిన భామినీవిమలసోమముఖిన్ మణిభూషితాంగిక
న్మచ్చట దీర విప్రకులముఖ్యుఁడు చూచి ప్రమోద మందుచున్. 197

వ. గృహప్రవేశంబు చేసి యిష్టోపభోగంబులఁ బరితృప్తిం బొందుచు నొక్కనాఁడు సమీపంబున నున్ననిజాంగనం గనుంగొని యిట్లనియె. 198

క. నామాట కడుగుదాఁటకు, నేమము ధర్మంబు సేయ సిద్ధించు ధరన్
భూమీసురులకు నన్నం, బామరిగా నిడుము మనకు నభివృద్ధి యగున్. 199

గీ. నాయొనర్చినపుణ్యంబు నడుపు నడుప, వేని సర్వంబు నష్టమై యేగు ననిన
మగనిమాటకుఁ గోపించి మగువ పలికెఁ, గన్నులెఱ్ఱగఁ గావించి కటము లదర. 200

గీ. భూమిసురులకు నింతైనఁ బుడుకనోఁప, బిడ్డలకు బెట్టి యింకనైనఁ బెంపవలయు

నెవ్వ రైనను మనకు మ న్నిచ్చిరయ్యా, యూరకే యుండు మింటిలో నోపుదేని.
క. అని మగని నెటిక విఱచుచుఁ, జనుదెంచిన యతిథికోటి సంబంధిజను
ల్వినఁ దిట్టి తానె భోజన, మొనరించుచు నెట్టినింద కులుకక యుండెన్. 202
గీ. బంధుజనముల విప్రులఁ బరిహరించి, నట్టికతమున సిరి వోయె నగ్ని సోఁకి
యున్నగహనంబు తెలియఁగున దిన్నదైనఁ, దలఁకి బ్రాహ్మణుఁ డొక్క గీతంబు పాడె. 203
క. చెప్పినపని యొన్నరింపని, యప్పడఁతుక యున్నసదన మది గహన మగుం
జెప్పినపని యొనరించిన, యప్పడఁతుక యున్నగహన మది సదన మగున్. 204
మ. అని కాంతామణిఁ బిల్చి బ్రాహ్మణుఁడు భామా చూచితే నీకతం
బున దొంగల్ ధన మెల్ల దోఁచిరి గృహంబుల్ వహ్ని చేఁ బోయెఁ జె
ప్పినమాట ల్వినవైతి వాఫలము సంప్రీతిన్ భుజింపంగఁ గ
ల్గెను నేఁ బోయెద నుండఁగూడదు మనకి క్రీడాగతి న్నిల్వుమా. 205
క. ఆలా గను పతిమాటకుఁ, జాలాభయమంది నాథ సర్వము నిమ్మా
వాలాయము నీదానికి, నేలా యీతప్పు గావు మింతియ చాలున్. 206
మ. అని ప్రాణేశుని పాదపద్మముల కొయ్యన్ సాఁగి దండంబు వె
ట్టి నుతుల్సేయుచు ధర్మతత్పరత రెట్టింపం బ్రవర్తించె న
వ్వనజాతాక్షియు యోగభూషణుఁడు దివ్యద్ధాన్య మాణిక్యగో
ధనము ల్చిక్కిన విచ్చె భూసురులకున్ ధారానుపూర్వంబుగన్. 207
క. కడి మాడ నేయునన్నము, పడఁతుక యిడె విప్రతతికి బ్రాహ్మణుఁ డెడమా
కుడి యెఱుఁగక గృహావృత్తులు, కడమగ మణిధాన్యవస్త్రకనకము లొసఁగెన్. 208
వ. ఇట్లు సకలదానంబులుఁ జేయుచుండి యొక్కనాఁడు శయనించియున్న సమ
యంబున. 209
క. ఖేదముఁ బొందఁగ నేటికి, భూదానము సేయుము విప్ర! భూసురులకు స
మ్మోద మగు మునుపు వలెనే, యాదానముఁ బొగడుచుందు రమరులు మునులున్.
మ. అని మింట న్వినఁబడ్డ మాటకుఁ బ్రమోదాయత్తుఁడై బ్రాహ్మణుం
డనిశంబున్ మణు లెండ్లుఁ గోకలును క్షేత్రారామముల్ ధాన్యముల్
ధనము ల్విద్యలు భూము లన్నములు సాలగ్రామము ల్లింగముల్
కనువృష్టిం బడిన ట్లొసంగె వివిధక్ష్మాదేవతాశ్రేణికిన్. 211
క. అదిగనుక ధరామరులకు, ముద మొదవఁగ భూమిదానములు సేయుము సం
పద లెల్లఁ గలుగు రాజ్య, ప్రద మగు శీఘ్రంబె పాండురాజతనూజా. 212

గీ. అశ్వమేధాదియాగంబు లాచరింపఁ, బొరయుపుణ్యంబు భూదానమునఁ జెలంగు
నఖిలసౌభాగ్యకరము పుణ్యాలయంబు, నిహపరప్రద మని యది యెన్నఁ బడియె.
గీ. దానహోమార్చనంబుల ధ్యానవేళ, భోజనము సేయుతఱి నన్ను బుద్ధిఁ జేర్చి
యెవ్వఁ డీడేర్చు బ్రాహ్మణాభీష్టసమితి, నతనికోరుకు లీడేర్తు నది నిజంబు. 214
వ. అనిన గదాగ్రజునకుఁ బాండవాగ్రజుం డిట్లనియె. 215
క. భూసురుఁ డేలోకంబున, భాసురుఁడై యుండెఁ దెలియఁ బలుకుము కృష్ణా
యీసచరాచరములఁ గల, వాసులు నీ వెఱుఁగఁబడనివా రెం దైనన్. 216
వ. అనిన నయ్యోగభూషణుండు సత్యసంధుండు నహంకారవిరహితుండు నై సర్వకాలము నన్ను స్మరియించుచుఁ బదివేలేండ్లు సకలసంపద లనుభవించి యంత్యంబున దేవర్షిగణసేవితం బైన నాలోకంబున వసియించె నీవును తత్ప్రభావంబుఁ జెందఁగలవాఁడవు భూదానవైభవంబు సర్వంబు నెఱింగించితి ధర్మంబును వినినఁ జూచినఁ జేసినఁ జేయించిన సంతోషించిన నింద్రపదవి చేకూరు నీయుపాఖ్యానంబు భూసురసమూహంబున దేవాలయంబునఁ బఠియించిన నాకర్ణించిన సాలోక్యంబు సిద్ధించు నిక్కంబింక నేమి విన వేడుక యయ్యె నెఱింగింపవే యనిన మురహరునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 217

## గోదానమహిమ.

క. గోదాన మధికపుణ్యము, గాదా యని పలుకుచుంద్రు ఘను లది యెవ్వా
రాది నొనర్చిరి తత్ఫల, మేదెస ఫలియించె నాకు నెఱిఁగింపు హరీ. 218
వ. అని యడిగిన కౌంతేయాగ్రజునకు సుశర్మోపాఖ్యానం బెఱిఁగింపఁ దలంచి కృష్ణుం డిట్లనియె. 219
చ. వినుము సుశర్మ నాఁ గలఁడు విప్రుఁడు వేదపురాణపారగుం
డనఘుఁడు శాంతుఁ డింద్రియజయాధికుఁ డాయన యాత్మదేహముం
గని ముది మెంతరోఁత యని గ్రక్కున రోసి తపోవనంబుఁ జే
రి నృహరి వాసుదేవుని హరిన్ గుఱిసేసి తపం బొనర్చుచున్. 220
క. దివమునకు నేగి చిక్కిన, యవయవములతోడ నాథరాముఁ డుండం
గవ లాచు దేవదూతలు, రవళిం జనుదెంచి రమరరా జరుదందన్. 221
మత్తకోకిల. మ్రొక్కి యందఱు నొక్కపెట్టుగ మొత్తి పెట్టిరి యింద్ర మా
నిక్కఁ జూడుము కాలదూతలు దీర్ఘహాశభయంకరుల్

వెక్కిరించుచు మమ్ముఁ గొట్టి త్రివిష్టపార్హజనంబులం
జిక్కఁబట్టి యమాలయంబునఁ జేర్చి రేటికిఁ బల్కఁగన్. 222

క. వారలతోఁ బలుమాఱును, బోరాటం బాడి యోడి పుల్ల విఱిగి యు
న్నారము నిఁక వెఱగుము మన, వారికి సురలోక మబ్బు వాకులు గలవే. 223

వ. అనినఁ దనదూతలకు దేవేంద్రుండు పాపాత్ములకు నరకంబును బుణ్యాత్ములకు దివంబును ననుభవనీయం బందు గోదానంబు చేసినవా రెల్లపాపంబులుం బరిహరించి నాపురంబునం గాఁపురం బుందురు సమవర్తియు నాయాజ్ఞావర్తి యై యుండు వారొనర్చిన పుణ్యంబులు తెలిపి యుత్తమలోకంబులకుఁ బంపు సందేహంబు మానుం డనినఁ దత్సభామధ్యంబున నున్న సుశర్మ విని తనతనూజుల కెఱింగింపఁ దలంచి దివ్యవిమానారూఢుం డై వారలసమీపంబునకు వచ్చి యి ట్లనియె. 224

గీ. వినుఁడు నామాట తనయులు విశ్వసించి, స్వర్గసౌఖ్యంబు లెపుడుఁ గావలసె నేని
పాఁడిగలమంచియావుల బ్రాహ్మణులకు, నిందు మీకోర్కెలెల్ల నీడేఱుచుండు.

క. అనిన యశరీరివాక్యము, విని కొడుకులుఁ జుట్టములును వెఱఁగంది మదిం
గొనియాడి రదియు మొదలుగ, నొనరించిరి గోప్రదాన ముత్తమ లెల్లన్. 226

క. అదిగనుక నీవు మొదవుల, ముద మొదవఁగ నిమ్ము విప్రముఖ్యులకు సదా
స్పద మగు సిరులకు స్వర్గ, ప్రదము యశస్కరము పాపపరిహార మరయన్. 227

క. ధర గోదానము నేసిన, పురుషులు యమధర్మరాజు పూజింపంగా
సురలోకంబున నుందురు, తరుణీసుతబంధుమిత్రదాయాదులతోన్. 228

క. పది గలిగిన నొక టీవలెఁ, బదిపదులు గడించె నేని పది యీయఁ దగుం
బదిపదులపదులు దొరకినఁ, బదిపదు లావుల నొసంగ ఫల మొకటి యగున్. 229

గీ. ఆవుదానంబుకంటె లే దధిక మొకటి, యవని న్యాయార్జితం బది య య్యె నేని
నుభయకులసంభవుల నెల్ల నుద్ధరించు, నమృత మరయంగ గోక్షీర మనియె బ్రహ్మ.

వ. స్వాధ్యాయపరులై వృత్తులు లేకయున్న వృద్ధులకు బ్రహ్మచారులకు బహుకుటుంబులకుఁ బౌరాణికులకు సోమయాజులకుఁ బుణ్యక్షేత్రంబునఁ బుణ్యకాలంబునఁ దలిదండ్రు లదినంబులఁ జంద్రసూర్యగ్రహణంబుల సంక్రాంతుల జన్మనక్షత్రంబుల నయనంబుల వ్యతీపాతల మహాలయంబుల గోదానం బాచరించిన గవాభావం బైన నిష్క్రద్వయంబు నన్ను ధ్యానంబు చేసి యిచ్చినవారలకు నాలోకంబు సుకరం బై యుండు శ్రోత్రియు లైనబ్రాహ్మణులను జూచినపుడ పుణ్యకాలంబుగాఁ దలంచి యిచ్చిన లక్ష్మీప్రదంబుఁ బుత్రపౌత్రాభివర్ధనంబు నగు ముల్లోకంబుల నింతకంటె

నొండు లేదు గావున గోదానం బొనరింపు ముభయలోకపుణ్యంబుల నొందెడు విధి నిశ్చయం బీయుపాఖ్యానంబు విన్నఁ బతియించిన మనోరథంబు లీడేఱు ననిన విని మఱియు నొక్కధర్మం బెఱుంగఁ దలంచి యుధిష్ఠిరుం డి ట్లనియె. 231

క. ఈదానంబులలోపల, నేదానం బధికపుణ్య మిష్టార్థకరం
బాదానం బెఱిఁగింపుము, నీదాసున కాదరమున నీరజనాభా. 232

వ. అనినఁ బాండవాగ్రజునకు గదాగ్రజుం డి ట్లనియె. 233

## అన్నదాన మహిమ.

గీ. ఆయురారోగ్యవర్ధనం బన్న మరయ, నన్నమునఁ బుట్టు లోకంబు లన్నముననె
ప్రాణములు నిల్చుఁ గావునఁ బరమపుణ్య, మన్నదానంబుకన్న లే దధిక మొకటి.

సీ. ఇందుల కెఱిఁగింతు నితిహాస మది విను పూర్వంబునను [1]యోగభూమణుండు
నా సర్వశాస్త్రార్థనయవేది విప్రుండు ఘను లైనసుతులఁ బెక్కండ్రఁ గాంచి
ధనవంతుఁ డై చాల ధాన్యంబు లార్జించి యతిథుల బంధుల హిత వొనర్చి
కఱవైనతఱి మంచికాలంబునను నీరు వా రనకుండ నవ్వారి గాఁగ

గీ. పలయఁ నన్నంబు పెట్టుట వ్రతము చేసి
యుండ దివిజులచేఁ బురుహూతుఁ డెఱిఁగి
యది పరీక్షించు వేడుక నరుగుదెంచి
బ్రహ్మనిధి యైన తన్మందిరంబుఁ గాంచి. 235

వ. వెఱఁగుపడి వేగంబునఁ బుష్కలావర్తకంబు లను మేఘంబులం బంపి యేడు దివసంబులు రేఁబవ ళ్లేర్పఱుప రాకుండ సాంద్రవర్షంబు గురిపించినఁ బదియోజనంబుల నిడుపును వెడల్పును మిఱ్ఱు పల్లంబులు సమతలంబు లయ్యె నాసమయంబున.

గీ. చిక్కి వ్రేలాడు డోలును జేతికోల, కుంటినడకయు నఱచూపు కూఁతవినికి
యచ్చుపడఁ బేదబ్రాహ్మణుఁ డై సురేంద్రుఁ, డడిగె ఘుర్ఘురరవమున నన్న మంత.

క. భూసురవేషముఁ దాల్చిన, వాసవు నీక్షించి యెదుర వచ్చి నుతు ల్వే
చేసి పదాబ్జము లంటు చుపాసించె సుశర్ముఁ దనదు వ్రతధర్మంబున్. 238

వ. ఇత్తెఱంగున నతిథిసత్కారంబు గావించి వచనసుధారసంబు వెల్లివిరియించుచు ని ట్లనియె. 239

---

1 యోగభూమణుండని యిక్కడమాత్ర మనేకప్రతులలో నున్నది. తక్కిన తావుల సుశర్మయని వచ్చుచున్నది.

ఉ. పాపము దూలెఁ బుణ్యములు పాల్పడియెం గులధర్మ మెల్ల ను
ద్దీపిత మయ్యె నిర్వురను దేహిఁ గృతార్థుఁడ నైతి జన్మవి
ద్యావయోబంధుభృత్యహితదాససుతాదులు వన్నె కెక్కి రి
చ్ఛాపరు లైన మీ రిటకుఁ జయ్యన వచ్చుట భూసురోత్తమా. 240

క. అని పలుకుచుండ విప్రుఁడు, ఘనమగు నవ్వానలోనఁ గాంతయు యత్నం
బునఁ బొయ్యి మంటసేయుచుఁ, గనుపొగ చొరకుండ వంట కడువడిఁ జేసెన్.

వ. అంత సుశర్మయు బ్రాహ్మణుని పాదంబులు గడిగి పూజించి రసోపపన్నంబులైన యన్నంబులు వడ్డించి విష్ణుస్వరూపంబుగాఁ దలంచి నమస్కరించె నాసమయంబున నింద్రుండు తలంచిన దేవతలు బ్రాహ్మణవేషధరులై వచ్చి యన్నంబు వేఁడిన.

క. విని యింద్రుఁ డాసుశర్మం, గని పలికె స్వీరి విడిచి కడి యెత్తఁగ వ
చ్చునె కలిగిన నిడు సహభోజన మొనరఁగ లేకయున్నఁ జనియెద నేనున్. 243

గీ. ఇత్తెఱంగున నుడివిన యింద్రు మాట, కులికి యన్నంబు మిగుల లేకుంటఁ దెలిసి
వందు వేగమ యాఁకొని వచ్చినారు, మగుడ నన్న సుశర్మతో మగువ పలికె. 244

గీ. నొచ్చి యాఁకట విప్రులు వచ్చినారు
బున్న మని యాఁద నొకటైనఁ బుడుక లేదు
ముసురు పట్టిన దెచ్చోట మసలరాదిఁ
కేమి కావింతు నాథ నాకెఱుఁగఁ బలుకు. 245

వ. అనిన బ్రాహ్మణుం డిట్లనియె. 246

క. నూనెను నేతను గోకలు, నానిచి మండించి వంట నడిపింపు మనం
దా నట్లు చేసి యవియుం, గానఁగ లేకున్నఁ గాంత కాంతుని కనియెన్. 247

క. కోకలు మానియ నేతులు, పోకార్చితి వంట గాకపోయెను విప్రుల్
మూఁకయి యాఁకటఁ జిక్కిరి, నాకిఁక నేబుద్ధి ప్రాణనాయక చెప్పుమా. 248

వ. ఇత్తెఱంగునఁ బలుకు కలికిపలుకుల కలిగి కన్నుఁగవఁ గెంపు సంపాదించుచు దైవప్రేరేపకత్వంబున విప్రుండు నిష్ఠురవచనంబుల నింతి కిట్లనియె. 249

సీ. విప్రు లాఁకట మలమల వేఁగుచున్న, వారు ప్రొద్దెల్లఁ బోయె నీవంటివార
లున్నచోటను బెఱవారి కుండఁ దరమె, వచ్చిఁ బాదంబు లిడి వేగ వండు మనిన.

క. పెనిమిటి మాటలు విని ప్రియ, మునఁ బాదాబ్జముల నూనె ముంచుచుఁ బ్రొయిలో
నునిచినను వంట యయ్యె, న్వనజాతాక్షియును వేదనలు లేకుండెన్. 251

వ. సుశర్మయుఁ బాకంబునకుం గొంత కాంతకు సహాయం బొనరించి యంత బ్రాహ్మణుల
పాదంబులు గడిగి విస్తరలు వేసి కూర్చుండ నియోగించి సంభ్రమంబున విచారింపక
యన్నంబు వడ్డింప వచ్చిన సమయంబునఁ బురందరుం డిట్లనియె. 252

క. ఇల్లాలు మెలఁగకున్నను, గుల్లా సౌఖ్యంబు పతికిఁ గొండంతైనన్
ఇల్లాలు మెలఁగుచున్నను, గొల్లా సౌఖ్యంబు పతికి గోరంతైనన్. 253

క. తల్లి తెఱంగున నతిథుల, కిల్లా లన్నంబు వెట్ట నింద్రాదిసురల్
చెల్లింతు రిల్లకోర్కులు, తెల్లము నీభార్య నిటకుఁ దెమ్ము సుశర్మా. 254

వ. యోగీశ్వరులకు జ్ఞానంబును భూసురులకు శ్రుతంబును బక్షులకుఁ బక్షంబులును
మనుష్యుల కన్నంబును శూరులకు ధైర్యంబును సంపదలకు ధర్మంబును గాంతలకు
శీలంబును గృహస్థులకు భార్యయుం బలంబులు గావున బలహీనుండ వై మా కేమి
సేయంగలవాఁడవు నీభార్య రాకుండినఁ బోయెద మని యింద్రుండు పలికిన విని
భీతుండై విష్ణుధ్యాన పరాయణత్వంబున వంటసాలకుం జని కన్నులు తేల వేయుచు
భూమిం బడి మూర్ఛిల్లిన నిజభార్యం జూచి యి ట్లనియె. 255

గీ. పాపకర్ముండు నిష్ఠురభాషణుండు, కలఁడె నాకన్న మూఁడులోకముల నెందు
నడుగు దాఁటక వర్తించు నంబుజాక్షి, కిట్లు సేసిన కొఱగామి నెట్లు తీర్తు. 256

క. ఆపద లవివేకయినం, బైపడు నాతండె పశువు పండితునకు సం
తాపముఁ బొందు వివేకము, త్రోపడచినఁ గడలినదులు దొట్టినరీతిన్. 257

వ. అని పలికి క్షమియింపఁ దగు నని పరుషాక్షరంబుగాఁ దిరుగ ని ట్లనియె. 258

క. ఏలా ప్రాకృతకాంతల, లీలన్ వర్తింప వేగ లెమ్మా రమ్మా
పాలింతువు నను విప్రులఁ, జాల న్నినుఁ బాసి నిలువ జలజాతాక్షీ. 259

క. మున్నెన్నఁడు నీమాటలు, నిన్నాడినవాఁడఁ గాను నీవే ప్రాణం
బన్నను నిహపరసాధన, మన్నను వేలుపు లటన్న నతివా నాకున్. 260

వ. అని పలికి విప్రుండు నేలం బడి మూర్ఛిల్లె నప్పతివ్రతయును వాసవుదయావిశేషంబున
రత్నభూషణభూషి తాంగియై లేచి విస్మయంబుఁ జెంది రసోపపన్నం బైనయ
న్నంబు వడ్డించిన భోజనంబు చేసి బ్రాహ్మణరూపధరు లైన సురలు హర్షించి సుఖా
సీనులై యామెం గనుంగొని నీపతిం దోడ్కొని రమ్మనిన వంటసాల కరిగి శోకాక్రాం
తుఁ డైయున్న వల్లభుం జూచి దుఃఖించి యి ట్లనియె. 261

క. ప్రాకృతజనుల తెఱంగున, నీకేటికిఁ జింత కడుపు నిండ న్విప్రుల్
శాకం బైన భుజించి నిరాకులగతి నున్నవారు రమ్మా చూడన్. 262

క. సూఖులు భయములు మఱి వే, ఱూఖులు శోకములు గూడి యనుదివసంబుల్
జేరును మూఢజనంబులఁ, జేరంగా వెఱచు బుధుల సిద్ధం బరయన్. 263

క. కలవాణి యిట్లు పలికినఁ, గలఁ కంతయుఁ దీఱి లేచి కల గన్నగతిం
దలఁచి చనుదెంచి దండం, బలవఱచుచు విప్రవరుల కనియెం బ్రీతిన్. 264

గీ. ఇపుడు జన్మంబు ఫలియించె నెల్ల కులము, వన్నె కెక్కెను మీపాదవందనంబు
కతన నీకూరనారలు కష్టమయ్యెఁ, దప్పు సైరించి దయ నేలఁ దగుదురయ్య. 265

వ. అని పలికి మాటిమాటికి దండప్రణామంబు లాచరించి తేజోమయుం డైవపురుషునిం
గాంచి యాశ్చర్యమానమానసుం డై యున్న భూసురునకు వాసవుం డిట్లనియె. 266

మత్తకోకిల. వీరు దేవత లే సురేంద్రుఁడ వింత లెవ్వరు గారు నీ
భూరిధర్మపరీక్ష సేయఁగఁ బూని వచ్చితి మంతయుం
జేరె స్వర్గమునందు నుండెడు నేవసించిన యన్నినా
శ్లాఘడిల్లుము నీచరిత్రము లొప్పు విప్రవతంసమా. 267

వ. ఇత్తెఱంగున సుశర్మకు వరంబు లొసంగి యతనిధర్మపత్నిం గొనియాడి యింద్రుం డంతర్హితుం డయ్యె భూసురుండును భార్యాసమేతుండై యభీష్టభోగంబు లనుభవించి యంత్యంబున స్వర్లోకనివాసంబు చేకొనియె. నీవు నాచందంబున భయభక్తు లుల్లసిల్ల నన్నదానం బొనర్చిన నిహపరసౌఖ్యంబులు కరతలామలకంబు లై యుండు యశంబు సిద్ధించు నీశ్వరుండు సర్వభూతహృదయంబులం బ్రవర్తించుం గావున భోక్త పరమేశ్వరుండు, భక్ష్యభోజ్యంబు లనుభవించి యెవ్వనిమందిరంబున నతిథు లెట్లు తృప్తిం బొందుదు రట్ల దేవత లెల్ల సంతసిల్లుదు రదిగావున నన్నదాత సర్వోత్కృష్టుం డగు నీయుపాఖ్యానంబు దేవబ్రాహ్మణసన్నిధానంబున విన్నవారి కుత్తమ లోకంబు గలుగు నని యానతిచ్చిన దేవకీనందనునకుఁ గుంతీనందనుం డిట్లనియె. 268

క. నారాయణ సంశయములు, దేరిచి కోరికి ఘటింప దేవర కెపుడున్
భారము గావున నడిగెద, నారూఢిం దెలియఁ బలుకు మనుకంపమెయిన్. 269

క. ధనికులు దేవబ్రాహ్మణ, జనములయెడ భక్తి గలిగి సత్పాత్రములం
దనిపిన సురపూజితు లై, యనిశంబును బరమపదవియం దుందు రొగిన్. 270

క. పేదలు దానము సేయన్, లేదుగదా సొమ్ము వారు లేవడిచేఁ జి
క్కెదో స్వర్గసుఖంబున, కేదెనియుఁ ద్రోవ గలదొ యెఱిఁగింపు హరీ. 271

వ. అనిన భగవంతుం డిట్లనియె. 272

గీ. వినుము చెప్పెదఁ గౌంతేయ విన్నవారి, పాపములు పోవు నధ్వరఫలము నొందు
ధనము లేకయుఁ ధర్మతత్పరతఁ దొల్లి, మునులు గాంచిరి జలదానమున దివంబు.

క. దంతితురంగమరథగో, కాంతామణివస్త్రధాన్యకనకాదులు దా
మెంతెంత గలిగె నేనియుఁ, నంతంతకుఁ గోరుచుండు రఖిలజనంబుల్. 273

క. అన్నము నుదకముఁ బ్రాణికిఁ, గన్నపుడే తుష్టికరము గావున నెపుడున్
ము న్నెన్నఁబడియె దానము, లెన్నిటికో సకలశాస్త్రహితమతిఁ దెలియన్. 274

వ. సకలప్రాణులప్రాణంబులు జలంబులంద నిలుచుం గావున జలదానశీలుండు ప్రాణదాత యనంబడు నిందుల కొక్కయితిహాసంబు గలదు తొల్లి శాంతుండు జితేంద్రియుండు నిస్పృహుండు శుచియు వేదశాస్త్రపారగుండు నైన సుశీలుం డను బ్రాహ్మణుం డుంఛవృత్తి వర్తించుచు జలదానపరుండై పశుపక్షిమృగాదులకు ననావృష్టికాలంబునం బెదపెద్ద నూతులం దోడి శీతలోదకంబులు పోయుచు బదరికాశ్రమంబున నుండె దేవయక్షసిద్ధసాధ్యకిన్నరకింపురుషాదులు తదాశ్రమంబునఁ గ్రీడింతురు. భూసురునిపుణ్యావర్తనలకు నింద్రుండు శంకితుం డై పావకసహితుండై వచ్చి యెండం బడి దప్పిగొని వచ్చినారము మాయిద్దఱకుఁ బానీయంబు గావలె నని యార్తస్వరంబున వేఁడిన విప్రుం డిట్లనియె. 276

## జలదానమహిమ.

మత్తకోకిల. ఏపు దప్పి మహాతపంబున నేఁగుదెంచితి రయ్య మా
కీపదంబులు చూచుభాగ్యము లేమిపుణ్యమొ యబ్బె నం
తాప మాఱ జలంబుఁ ద్రావుఁడు తావకీనదయాబ్ధికిం
దేపఁ జేసి యటంచుఁ బూజలఁ దేర్చి తోయము పోసినన్. 277

క. చలిపందిరిలోపలఁ గల, జల మంతయుఁ ద్రావి తనివిసాలకయుండెన్
బలభేది సుశీలుండును, గలశంబులు రిక్త మైనఁ గనుఁగొని ఖిలిన్. 278

వ. ఇది యేమి కారణంబున నిండుకుండలు రిక్త యయ్యె నని కళవళం బందుచు సర్వలోకశరణ్యుం డైన పుండరీకాక్షు ధ్యానంబు చేసి రక్షింపు మని ప్రార్థించి చింతాకులుం డై. 279

తరల. పుడిసెఁడన్నియు నీళ్లు చిక్కకపోయె విప్రుఁడు దప్పిచే
బడలె మిక్కిలి నేమి నేయుదు బంటుధర్మము నిల్పవే
తడవు సేయక తల్లిదండ్రియు దాత దైవము నాకు నీ
యడుగు లెప్పుడుఁ గావవే దయ నంబుజాక్ష రమాపతీ. 280

క. ఈరీతిఁ బలుక విప్రుఁడు, నీరజనాభుండు కడవ నిండించె దయం
జేరి పదివేలశిఖులన్, వారిధి వలెఁ ద్రావె వహ్ని వడిగా నదియున్. 281

వ. అదియుం జాలక. 282

క. జలములు తే తె మ్మనుచుం, బలుమాఱును వేఁడి వేఁడి పాయె సురేంద్రుం
గలపికొని వహ్ని దివమున, కలఘుఁడు బ్రాహ్మణుఁడు విస్మయాయత్తుం డై. 283

గీ. తట్ట గుద్దలి చేకొని తరుణితోడఁ, ద్రవ్వెఁ గూపంబు పాతాళతలము దాఁక
నంతకంతకు జాపడ్డ నరసి దేవ, మాయగా యంచు మాధవు మరువు సొచ్చె. 284

ఉత్సాహ. వాసుదేవ రామకృష్ణ వారిజాక్ష మాధవా
వాసవాదివంద్య నీకు వందనం బొనర్చెదన్
దాసుఁ డైన నా వ్రతంబుఁ దప్పకుండ నీవు పైఁ
బూసికొన్నఁ గాక నీళ్లు పుట్టనేర వియ్యెడన్. 285

వ. అని పునఃపునః ప్రణామంబు లాచరించినఁ బుండరీకాక్షుండు సుధారసంబునకు వాసి గల్పించు జలంబుఁ గల్పించిన నాసుశీలుండు సంతుష్టాంతరంగుం డై మునిసంఘంబు నుతియింప జలదానంబు సేయుచున్నం గని యింద్రుండు విఘ్నం బొనర్పం దలంచి వేలుపులం గూడుకొని పరులచందంబుల నిరువదియొక్కమాఱు వచ్చి జలపానంబు నేసి విఫలమనోరథుం డయ్యె. 286

క. ఏరీతుల నాదాసుల, కోరికఁ బోకార్ప నొరులకు స్వశ మానే
నేర రనంగా భక్త, ప్రారంభము చెఱుచునతఁడు ప్రాజ్ఞుం డగునే. 287

గీ. స్వర్గమున కేగి యింద్రుఁ డనర్గళమ్ము
లైన విప్రునిధర్మంబు లరసి జడిసి
పదియుం రెండేండ్లు వానలు పడకయుండఁ
జేయ నపుడు తదాశ్రమక్షేత్ర మందు. 288

వ. నాకారుణ్యంబున నుత్తమజలంబు లుత్పన్నం బైన సకలభూతంబుల కొసంగుచు సుశీలుం డుండె నింద్రుండును జంద్రసూర్యాదిగ్రహంబులం బంపిన వచ్చి దప్పి దీర్చుకొని సంతసంబున నందఱు నొక్కప్రదేశంబున నున్నఁ గల్పాంతంబు కైవడి వాన కురిసినం జింతించి. 289

క. మానవుల కొకటి సేయం, బూనినఁ గార్యంబు వేఱెపుట్టుట యరుదే
నేనొకటి సేయఁ దలఁచినఁ, దానొక్కటి చేసె నార దైవం బనుచున్. 290

గీ. ఇట్లు చింతించి సురలతో నింద్రుఁ డిదియ
స్వర్గ మని యెంచి గ్రహముల సంస్మరింప
వారు చనుదెంచి బ్రాహ్మణవంశతిలక
మగు సుశీలునిఁ గనుఁగొని యభినుతించి. 291

పంచచామరము. ధరామరేంద్రచంద్ర నీదుధర్మకర్మమర్మముల్
చరాచరంబు లైనలోకజాలముల్ నుతింపఁగాఁ
బరాత్పరుండు సంతసించుభాగ్య మింతకన్న నె
వ్వరి న్వరించె నిన్నుఁ జూడ వచ్చె వజ్రి పేఁడుగో. 292

గీ. చంద్రసూర్యముఖగ్రహచయము మేము, నవ్యకాంచనమణివిమానమ్ము నీకుఁ దెచ్చితిమి యెక్కు పోదము దిశలు వొగడ, స్వర్గసుఖ మెల్లకాలంబు సాగు ననిన.

వ. అవ్వాక్యంబులు విని లోకోపకారంబుగా నొక్కవరంబు వేఁడెద నిక్కడ నున్న వారల కందఱకును దూరస్థు లైనధర్మాత్ములకును నిది మొదలుకొని యుత్తమలోకంబు లొసంగవలయు న ట్లయిన మీవెంట వచ్చెదఁ గాకున్న రమాపతిం బ్రార్థించుచు సుఖంబున నిక్కడన యుండెద మీర లరుగుం డనిన గ్రహంబులు నీకోరినయట్ల తరుగుల్మలతాదులకు దుష్టమృగాదులకు ముక్తి యయ్యెడు రమ్మని భార్యానమే తంబుగా సూర్యసంకాశం బైనవిమానం బెక్కించుకొని నాకంబున కరిగిన నాసుశీ లుండు చతుర్యుగసహస్రంబు లనేకభోగంబు లనుభవించి తదనంతరంబున బ్రహ్మ లోకంబునుం జెంది సుఖంబు నుండె నట్లుగావున నీవు నెల్లకాలంబుఁ జలిపందిరి పెట్టించి శీతలోదకమ్ములు మానవుల కిమ్ము పేదల కిది ధర్మంబును స్వర్గమోక్షప్రదా యకంబును దేవతలకు దుర్లభంబు నై యుండు నీయుపాఖ్యానంబు విన్నవార లకు సకలపాపక్షయంబు లక్ష్మీసాధకంబు నై యుండు నిందుకు సందేహంబు లే దని యానతిచ్చిన మురహరునకు యుధిష్ఠిరుం డి ట్లనియె. 294

## కన్యకాదానప్రకారము.

గీ. దానములలోనఁ గన్యకాదాన మధిక, మండ్రు దానికి వరుఁ డెవ్వఁ డర్హుఁ డిచ్చు కాల మెయ్యది యెట్టిలోకములు గలుగు, మాకు నింతయుం దెలిఁగింపుమా రమేశ.

వ. అనిన ధర్మరాజునకుఁ గృష్ణుం డి ట్లనియె. 296

గీ. ధర్మములమీఁద నెంతతోత్పర్య మున్న
నంతకీర్తియు సమకూరు నండ్రు బుధులు

మంచికథ లెల్లఁ దెలియంగ మానసంబు
మెలఁపి యడిగెదు కౌంతేయ మేలు వినుము. 297

ఆ. కులము గలిగి ధర్మగుణములఁ జూపట్టి, రోగి గాక మంచిరూపు దనర
వేదవేది యైన పేదకుఁ గన్యక, నొసఁగునతఁడు బ్రహ్మవసతిఁ గాంచు. 298

క. ధన మిచ్చి పెండ్లిచేసిన, ఘనునకు నేలోక మైనఁ గలుగున్ విషువా
యనసంక్రాంతులు గ్రహణం,బును దీర్థక్షేత్రములును ముఖ్యము లొసఁగన్. 299

క. కన్యాదానము చేసిన, ధన్యుఁడు గంధర్వదేవతాతతి పొగడన్
మాన్యక్రియఁ బితరులతో, దైన్యము లేకుండు నెపుడుఁ దా నాయొద్దన్. 300

సీ. ఇత్తెఱంగున నొక్క యితిహాస మెఱిఁగింతు సకలసౌభాగ్యైకసాధన మగు
కృతయుగంబునఁ దొల్లి సతతకళ్యాణాస్పదం బైననర్మదాతటమునందు
విజితేంద్రియుఁడు మౌని విశ్రుతకౌండిన్యకులసంభవుఁడు శాస్త్రకోవిదుండు
మహితవర్తనుఁడు ధర్మవ్రతుం డనమించు భూసురోత్తముఁడు తపోవనంబు

గీ. నందు వసియించి యొక్కనాఁ డడవి కేగి, యింధనములకు శిష్యుల నెల్ల ననిపి
కరి శరభ సింహ శార్దూల ఘనమృగముల, దారుణం బైన కాననాంతరములోన. 301

క. అక్కడఁ గలిగిన వింతలు, వెక్కస మై తోఁపఁ జూడ వేడుక పడి తా
నొక్కెడ నిలిచి ముందఱఁ, గ్రక్కున వినెఁ గరుణఁ గావు కా వనుమాటల్.

మత్తకోకిల. ఆనినాదము నట్టె వీనుల నాలకించి యిదేమిరో
కానఁ బోలు నటంచు ముందఱఁ గాలు సాఁచుచు హుంకృతిన్
ధ్వానమేదుర ముగ్రకంటక దందశూకలతావృతం
బైనరూపముఁ జూచి చాల భయంబు పుట్టఁగ మళ్లినన్. 303

గీ. మమ్ము వీక్షింపు రక్షింపు రమ్మటంచుఁ, గూపముననుండి యొకపెద్దకూఁత పొడమ
విని గిఱుక్కున మరలి సంవృతబలాఢ్యు, నద్భుతాకారు నొక్కని నచటఁ గాంచి.

క. నీ వెవ్వ రేమి సేయుదు, నా విని యతఁ డుద్భవిల్లు నవధూమంబుల్
పోవార్చి ధరామర యో,హో తెలుపకుమయ్య నీకు నొగి నెఱిఁగింతున్. 305

క. ఏము నీపితరులము తథ్యంబుగా నెఱుంగు మనిన ధర్మవ్రతుం డిట్లనియె. 306

ఆ. ఏమి పనికి నుందు రిచ్చటఁ బితృలోక, మేల విడువ మీర లెఱుఁగఁ బలుకుఁ
డనిన మాకులంబునందు ధర్మాత్ములు, పుట్టకున్నకతనఁ బొరసెఁ గీడు. 307

వ. సందేహంబు లేదు నీ పోడకు మాకులంబున గృహకన్యాభూతిలాజ్యగోదానంబు
లాచరించువారును గంగా కావేరి కృష్ణాదిమహానదుల స్నానంబులు సేయువారును

విషువాయన సంక్రాంతి వ్యతీపాతాష్టక సోమసూర్యోపరాగంబుల మమ్ముఁ దలంచి యేమయిన నిచ్చువారును బంచయజ్ఞపరాయణులును బ్రాతర్మధ్యాహ్నకాలంబుల స్నానం బొనరించువారును లేరు గావున దేవాలయంబులఁ గార్తికమాఘమాసంబుల దీపంబులు పెట్టువారును నేకాదశీ శివరాత్రి ప్రముఖ పుణ్యదివసంబుల నుపవాసంబు లుండువారును మాఘస్నానరతులు వేదవేదాంగపారగులు పురాణధర్మశాస్త్రజ్ఞులు శ్రౌతస్మార్తకర్మానుష్ఠానపరులు సూర్యుండు కన్యాగతుం డైనఁ బితృపూజ లాచరించువారు హరిహరభక్తులు రౌద్రపౌరుషసూక్తంబులు జపించువారు నధ్యాత్మశాస్త్రంబు చదువువారు సూర్యున కర్ఘ్యనమస్కారంబు లొనర్చువారు లేరు గావున మాకీదురవస్థ ప్రాప్తంబయ్యె ననిన విని పడంకుచు నేలం బడి మూర్ఛిల్లి తెలిసి పితృవర్గంబునకు ధర్మవ్రతుం డిట్లనియె. 308

గీ. ఇపుడు సంకోచములు మాని యిష్ట మెద్ది, గలుగు నెద్దాన బ్రహ్మలోకంబు మీకు
నదియ నేయంగ యత్నమే నాచరింతుఁ, దెలుపఁ గదరయ్య మీమదిఁ గలతెఱంగు.

వ. అనిన నభ్యాసురునకుఁ బితరు లిట్లనిరి. 310

సీ. పెక్కులు గల వన్ని పితృమోక్షదములైన దానంబు లందు నుత్తమముఁ దెలియ
విను మెఱుఁగింతుము తనకన్యకను బిల్చి తగినట్టివరునకు దార వోతు
రట్లు గూడని నాఁటి కాత్మధనం బిచ్చి చేయింతు రదియును జెల్ల కున్న
దొరకినమాత్రంబు తోడైనఁ బెండ్లికి ఘనముగా బ్రహ్మలోకంబు గలుగుఁ
గీ. గన్యకాదాన మిది మున్నుఁ గమలభవుఁడు, చేసె నాఁ డాదిగా నెల్లశిష్టజనులు
చేత నొనరింపు మిది నీవు చేయవేని, దమకుఁ గూపంబునన యుంకి తథ్య మరయ.

క. భోగ రుడిగి చిక్కి వగచే, బెగడి తిలోదకముఁ ద్రావఁ బెదవులు సాఁచుం
దెగఁ జూడు వీరి వగలం, దెగఁజూడుము బ్రహ్మ నీకు దీర్ఘాయు వగున్. 312

గీ. అనుచు దీవించి కానరాఁ డయ్యె నతఁడు, విప్రుఁ డాశ్చర్య మొందుచు వినతుఁ డగుచు
శిష్యులును దాను నాశ్రమసీమఁ జేరి, పెద్దలకుఁ జెప్పి పెండ్లిండ్లు పెక్కు నేసె. 313

క. కావునను వివాహంబులు, గావింపుము ధనము లొసఁగి కడుఁ బేదలకున్
ధూవర దానం బితరులు, దేవతలును దృప్తి నొంది దీవింతు రొగిన్. 314

క. ఈకథ బ్రాహ్మణసభలన్, వాక్రుచ్చినవారు గంద్రు వరవైభవముల్
చేకొందురు తమతెగలో, శ్రీకాంతునినెలవు సురలు సిద్ధులుఁ బొగడన్. 315

వ. అని లోకరక్షకుం డైనపుండరీకాక్షుండు ధర్మరాజున కెఱింగించిన చందంబు వై

శంపాయనుండు జనమేజయునకుం దెలిపినట్లు సూతుండు శౌనకాదులకుఁ
జెప్పుటయుం. 316

క. ఖరదూషణముఖరణగణ, సరభసభుజబలచతుర్దశసహస్రనిశా
చరసంహారణైకధను, ర్ధర ధరణీనాథచంద్ర ధైర్యనగేంద్రా. 317

ఉ. అత్రి వసిష్ఠ గౌతమ కణాదమునీంద్రనుతప్రతాప మూ
ర్తిత్రయరూప సుందర పరిస్ఫుర దాశుగచాప దేవతా
గోత్ర ధనుర్ధనుర్దమనగుంఫితశౌర్యకలాప వార్ధిద
ర్పత్రుటనోగ్రకోప మహిపాలనఖేలన భక్తపాలనా. 318

మాలిని. విభవవిజయశీలా విశ్రుతానందలీలా త్రిభువనజనరక్షా దీనమందారవృక్షా
అభినవసుమబాణా యంబుధిగ్రాహిబాణా, శుభఫలదవరేణ్యా సూర్యవంశాగ్రగణ్యా.

గద్యము. ఇది శ్రీమన్మదనగోపాలలీలావలోకనపవిత్ర శరణయామాత్యపుత్ర సకలవిద్యావధాన, తామరపల్లి తిమ్మయప్రధానప్రణీతం బైన హరివంశోదితం బైన యాశ్చర్యపర్వంబునందలి, శేషధర్మంబున భూదానమాహాత్మ్యంబును గోదానమహిమయును నన్నదానప్రభావంబును జలదానవిశేషంబును గన్యాదానకీర్తనంబును నన్నది ప్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.



జగదేకధనుర్ధర
రాజద్విరుదాంక భక్తరక్షణగుణ ధ
న్యాజీపండిత మానస
రాజీవాశ్రితధామ రాఘవరామా. 1

వ. విన నవధరింపు మఖిలపురాణవ్యాఖ్యానముద్రాసమేతుం డైనసూతుండు శౌనకాది మహామునులకుం జెప్పినట్లు యుధిష్ఠిరునకుం గృష్ణుం డానతిచ్చినప్రకారంబు జన మేజయునకు వైశంపాయనుం డెఱింగించె నని బోధించి మఱియు ని ట్లనియె. 2

గీ. ధర్మతనయుండు కన్యకాదానమహిమ, యుత్తెఱంగున విని మది నింపు దనరఁ దిరుగ నొకదివ్యధర్మంబుఁ దెలియఁ గోరి, హరికి వందన మొనరించి యనియె నిట్లు.

శా. సాధు ల్వల్కుదు రెల్ల ధర్మములలో సత్యంబు శ్రేష్ఠం బటం చేధర్మం బమరు ల్నుతింతురు మనోభీష్టప్రదం బేదియుం సాధించె న్బహుళప్రయాసత హరిశ్చంద్రుండు తా నెద్ది నా కాధర్మం బెఱిఁగింపవే కరుణచే నబ్జాక్ష నారాయణా. 4

ఆ. అనుచు ధర్మరాజు వినయభాషణముల, నడుగుచున్నయట్టియవసరమున ద్రుపదరాజపుత్రి తోయజాక్షుగుణంబు, మించు గాఁగ సన్నుతించి పలికె. 5

క. ఈయర్థము మీబావకుఁ, బాయని దయతోడఁ దెలుపుపగిది న్నాకున్ శ్రేయంబుగ నెఱిఁగింపవె, మాయన్నా వాసుదేవ మాధవ కృష్ణా. 6

వ. అనిన జగదీశ్వరుం డైన శ్రీకృష్ణుండు ద్రౌపదీధర్మరాజుల మొగంబులు చూచి మీ యిద్దఱకు నొక్కధర్మం బెఱుంగ జేసెద నయ్యేనె మీయనుకూలదాంపత్యంబున కిదియ కారణంబు వినుం డని నవ్వి యి ట్లనియె. 7

క. సత్యంబె తల్లిదండ్రులు, సత్యమె దైవంబు దాత సత్యమె గురువున్ సత్యమునఁ బాప మణఁగును, సత్యంబున ముక్తి గల్గు సత్యమె జయమా. 8

వ. అనిన విని సత్యవాదులకు స్వర్గంబు గలుగు నని విందు మది యెఱిఁగింపు మన్న యుధిష్ఠిరునకు హరి యిట్లనియె. 9

## సత్యప్రశంస.

క. తనకొఱకును గోబ్రాహ్మణ, జనములకై పెండ్లియెడల సర్వధనంబుం
జను వేళ బొంకవచ్చును, వినుమిది వెలియైనచోట వెస నరకమగున్. 10

వ. సత్యంబు నడుప నెవ్వండు సంకల్పించుకొనియుండు నతనిచేత స్థావరజంగమాత్మకం బైనజగంబు పవిత్రం బగుఁ జంద్రసూర్యాదిగ్రహంబులు నింద్రాదిదేవతలు సత్యంబుచేతన నిలుపంబడిరి. సకలపాపక్షయంబులును విద్యాకీర్తిప్రదంబును నై శుభం బైనయది సత్యంబె కావున బుద్ధిమంతులకు సత్యంబు పలుకవలయుఁ దొల్లి వేదవేదాంగపారగుం డైన సుమతి యనుబ్రాహ్మణుండు కాంచనాక్షం బనుపులికి సత్యంబు నొడివి దివంబున కరిగె ననినఁ గృష్ణునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 11

క. పులి దుష్టజంతు వరయఁగ, నలఘుం డాసుమతి సాధు వాయిద్దఱకుం
జెలి మెట్లు సత్య మేగతిఁ, బలికె న్భూసురుఁడు తెలుపు పంకజనాభా. 12

వ. అనిన యుధిష్ఠిరునకుఁ గృష్ణుం డిట్లనియె. 13

సీ. కృతయుగంబునఁ దొల్లి కీర్తనీయం బైన కావేరితటమున గరుడయక్ష
సిద్ధవిద్యాధరసేవితంబు మునీంద్రపూజితంబు కపిత్థపూగపనస
చంపకఖర్జూరసహకారబిల్వపున్నాగమలకతాళనారికేళ
జంబీరకదళికాశ్వత్థాదిభూరుహపూర్ణంబు బహుమృగాకీర్ణ మైన

ఆ. శంఖతీర్థ మొప్పు సతతంబు నాప్రోల, వెలయు సుమతి నాఁగ విప్రుఁ డతఁడు
కుశసమిత్ఫలములు గొనితేర నొక్కనాఁ, డడవి కరిగె శిష్యు లలమికొనఁగ. 14

వ. అరిగి యొక్కయెడ నిల్చి ప్రియశిష్యుల నొక్కచోట నిల్పి యి ట్లనియె. 15

చ. పులి గిలి పంది గింది మనుబోతులు గీతులు లేవు కానలో
వలసినయట్లు త్రిమ్మరఁగ వచ్చును గట్టెలుఁ గందమూలముల్
ఫలములుఁ గొంచు నొండొరులఁ బాయక వేచనుదెందు మీరు ద
ర్భలును విరు ల్సమిత్తులు నపారము దెచ్చెద నంతలోపలన్. 16

ఆ. వైళమరుగుఁ డిటకు వచ్చినపని సేయుఁ, డనుచు శిష్యజనుల ననిచి సూక
రాదిభీమ మైనయడవిలో విప్రుండు, మెలఁగుచుండె నన్నుఁ దలఁచికొనుచు. 17

క. అంతట నొకపులి యాఁకొని, గంతులిడుచుఁ బైకి రాఁగఁ గనుఁగొని చింతా
క్రాంతుం డై నలుదిక్కులు, పంతునఁ గలయంగఁ జూచి పరుగున రాఁగన్. 18

ఆ. పరుగువాఱుచున్న బ్రాహ్మణుఁ గని పులి, నిడుదతోఁక సాఁచి నేల గాలు
ద్రవ్వికొనుచు దీర్ఘదంష్ట్రలు గలపెద్ద, నోరుదెఱచి కూడఁ బాఱి కఱచె. 19

ఇట్లు తనదక్షిణకరంబుఁ గఱచిన పులిం జూచి సుమతి యి ట్లనియె. 20

పిలిచినను బల్కఁబోక యెండలను నెండి, వానఁ దడిసియుం బసివాళ్లు వాడుచున్న
నిరపరాధులఁ జంపంగ నీకు లాభ, మేమి గల దయ్య శార్దూల యెఱుఁగవైతి. 21

తోటకము. అపరాధము చేసినవైన నృపుల్, కృప యుంతురుగా నిటు గెర్లరు నే
నెపు డేమియుఁ జేయను నేరికి నా, కుపతాప మొనర్పక యుండఁదగున్. 22

గ్రీష్మంబునను బంచకీలిమధ్యంబున వర్షాభిగమమున వానలోన
హిమమున నీటను నింపుగా వసియించి తపము గావించుచు ధర్మబుద్ధి
వదలక కృచ్ఛ్రముల్ వ్రతముగా నడుపుచు విష్ణుపూజాసక్తి విడువలేక
కందమూలాదులఁ గాలంబు గడపుచు నపరాధ మేమియు నాచరింప
కూరకున్నట్టి నను జంపఁ గోరనేల, పరుల కపకార మొనరించు పాపకర్మ
నిజకులాచారములు మాను నీచుఁ బట్టి, వరుస బాధింతు రిటువంటి వార లెల్ల. 23

ఎండి యున్నది యొడ లెల్లఁ గండ లేదు, నెత్తు రొక బొట్టు పుట్టదు నిజము తెలియఁ
బులిగఱచి మూలపాలయి పోయెనన్న, జోలి యే గాని నీకింక మేలు లేదు. 24

అనిన విని బ్రాహ్మణునకు శార్దూలం బిట్లనియె. 25

ఎముకలుఁ [1]దోలుం గా నిం, క మఱేమియు లే దటంచుఁ గనిపించెనం
దముఁ గాచుకొనుట ధర్మ, క్రమ మఖిలప్రాణితతికి ఘనముగఁ దెలియన్. 26

అనిన నవ్విప్రుండు మేదోమాంసమూత్రపురీషరక్తాస్థినిచయపూర్ణంబై దుర్గంధనిందితంబై యనిత్యంబు నస్వతంత్రంబునుం గాన నీకళేబరంబు వ్యర్థంబు దీన నీకుఁ దృప్తి యయ్యెనేని కృతార్థుండనైతి నిచ్చెద నిచ్చుట పరులకు హితం బాచరించుటకొఱకె కాదె యైనను నాయాశ్రమంబునకుం బోయి తిరిగివచ్చెద ననుగ్రహింపు మనిన భూసురునకు శార్దూలం బిట్లనియె 27

వంటిలుసొచ్చిన కుందెలు, వంటిది నీబ్రదుకు నెనరువారికి నెరయై
యొంటిఁబడి మృత్యుముఖమున, నంటిన నీ కింటి కరుగ నవసర మేమీ. 28

అనిన విని హుతాగ్ని నాత్మారోపణంబు చేసి నిజగృహంబున నున్నశిష్యవర్గంబునకు బోధింపందగువాని బోధించి నీసమీపంబునకు వేగంబ వచ్చెద ననిన సుమతికి శార్దూలం బిట్లనియె. 29

పులివాతఁ బడఁగవత్తురె, యిల నెవ రే నీవు తాక యేగిన క్షుధచే
మలమల మాఁడఁగ నోడెదఁ, బలికినయ ట్లాచరింప బ్రహ్మకు వశమే. 30

---

1 ఎముకలుఁ దోలుం గానీ, నమలెద నీయొడలు చెడ్డ నడతలనైనన్

ఆ. మగిడి వత్తు నన్నమాటలకే నిన్ను, విడిచిపెట్ట నంత వెఱ్ఱి నయ్య
మొగులునీరు నమ్మి ముందరఁ జెఱువులో, నీరు వెళ్లఁ జల్లునే నరుండు. 31

వ. అనిన శార్దూలంబునకు సుమతి యి ట్లనియె. 32

క. నే మగిడి వత్తు దీనికి, నీమది సందేహ ముడిగి నిలువుము గాదే
నేమైన బాస యిచ్చెదఁ[1]గో మది దప్పమియపలుకు కొస రేమిటికిన్. 33

వ. పంచమహాపాతకులు మాతృపితృగర్వాత్ములు భ్రూణహత్యా గోవిప్రవైశ్యనృపస్త్రీ
పుత్రార్యభ్రాతృహంత లేగతిం బొందుదురు వ్యాధయుక్తపుత్రపత్నీవిధవాసంగమంబు
లొనరించినవార లేలోకంబున వసియింతురు పతి నొల్లక యితరులం జేరిననారియు
భర్తకుం బ్రతికూలం బాచరించు కాంతయు బహుభాషిణియు సదాకలహప్రి
యయు నిష్ఠురభాషిణియు దానవిఘ్నకారిణియు మలినవస్త్రయు గంధానులేపన
హీనయుఁ దాంబూలవర్జితయు రోదనశీలయుఁ దలవాకిట నుండువెలందియుఁ బు
త్రతాడనశీలయు నాత్మశ్వశ్రూపరనింద లొనరించు భామినియు బంధువుల కౌదాసీ
న్యంబు నేయు కామినియు వెలయాండ్రతోడి పొందువట్టినబోటియుఁ బాకం
బొనరించి యతిథి పితృదేవతార్చన కన్న మున్న భుజించు లేమయు నెక్కడ నుం
డుదురు సకల పాపంబుల కొడిగట్టినవారు స్నానదేవతానమస్కారప్రదక్షిణహీన
యు హరిసేవారహితయుఁ గేశధారిణియు సుతీర్థవిముఖియుఁ దిర్యగ్దృష్టిరతయు స
ల్లాపతత్పరయునైనవిధవ లెచ్చోటం బడుదు రట్టినరకంబులు నీకు దేహంబుఁ బ్రి
యంబుగా నీయనేని నాకగు నని శపథం బిచ్చిన బ్రాహ్మణునికి నమస్కారంబు చేసి
నీయాశ్రమంబునకుఁ జని నాకు హితంబుగాఁ బ్రాణంబులు రక్షించుకొని మగిడి
రమ్మని సెల విచ్చిన శార్దూలంబుశిరంబున దక్షిణకరం బిడి వెఱవకు మని సుమతి ని
జాశ్రమంబునకుం జనియెనని చెప్పినఁ గృష్ణునకుఁ గౌంతేయాగ్రజుం డిట్లనియె. 34

ఆ. ఇంటి కరిగి సుమతి యింతికి గొడుకుల, కిట్లుపలికెఁ బులికి నిచ్చినట్టి
మాట దప్పకుండ మగుడ నేకైవడిఁ, జనియె నెఱుఁగఁ బలుకు జలజనాభ. 35

వ. అనినఁ గృష్ణుం డి ట్లనియె. 36

సీ. నను సర్వలోకాధినాథుఁగా ధ్యానంబు సేయుచు నాశ్రమసీమఁ జేరి
యందున్నశిష్యుల నాప్తులఁ దనయుల భార్యను బిలిచి నాపలుకు వినుఁడు
వేదశాస్త్రంబులు వినుతించు నేధర్మ మాధర్మ మొనరింపుఁ డనుదినంబు
స్థావరజంగమాత్మక మైనవిశ్వంబు కమలేశురూపంబుగాఁ గనుండు

---

1 గోముడివల దెఱుఁగఁ బలుకు.

ప్రకరణంబుగఁ బరులకుఁ దృప్తి సలుపుఁ, డొరుల ధనముల కింతుల కాసరిల్లుఁ
అనుచు నుపదేశ మొనరించి యగ్ని వేల్చి, యాత్మ నారోపణ మొనర్చి యవనిసురుఁడు.
పగుడ ధర్మపత్నిం బిలిచి యి ట్లనియె. 38

డుకులను గావు ధర్మము, నడుపుము పాపంబు త్రోవ నడవకు హింసల్
నడుపుము కోరుకులుడుగుము, పడఁతీ హరిపూజసేయుము భద్రము గల్గున్. 39

అని నుడువు విభునిఁ గనుఁగొని, వనితయుఁ దుఃఖించి పలికె వల్లభ నీచే
మును వెన్నఁ డిట్టిమాటలు, వినరా విది యేమి వింత వెఱచిన పగిదిన్. 40

కన్నవాఁడ వి త్తెఱం గెఱింగింపవే యన్న ధర్మపత్నికి సుమతి యిట్లనియె. 41

వనమున కరిగి సమిత్తులు, కను దనియఁగఁ గోయుచుండఁ గని యొకపులి ప
ట్టిన బాస యిచ్చి వచ్చితి, వనితా మిముఁ జూచి వేగ వచ్చెద ననుచున్. 42

టకము. పోవలెఁ గావున బుద్ధులు నీకిం, తే వచియించితిఁ జెల్లమి గాఁగన్
భావములో నిడి పంక జనాభున్, శ్రీవిభుఁ గొల్వుము చింత దొలంగన్. 43

అనిన విని శోకాక్రాంతయై నేలం బడి పొరలుచున్న బ్రాహ్మణిం గనుంగొని యూ
ఱడించుచు బ్రాహ్మణుం డి ట్లనియె. 44

ఉ. ఉడుగ కెప్పుడుఁ జేయుఁ ధర్మము లోపినట్లు తపంబులు
న్నడుపు సత్యము పల్కుచుండుము నాథుఁ డాడిన వాక్యముల్
గడవకున్న లతాంగి నంటదు కామినీత్వము నాకు మే
లెడఁదఁ గోరి యొసంగు మించుక యేని యర్థికి భామినీ. 45

అనిన బతిమాటవిని యట్ల యగునటంచుఁ, బడుచులును దానుఁ జింతింపఁ బర్ణశాల
కరిగి ధ్యానంబు చేయుచు నంబుజాక్షు, భువనవందితు మాధవుఁ బొగడె నిట్లు. 46

చ. సుతులు బాలురు తాఁ దపస్విని జుట్ట మొక్కఁడు లేఁడు మా
కితర మెన్నఁడు గొల్వనేరన యీపదంబులు దక్క నా
పతి నొసంగి యనేకకాలము భాగ్యశాలిని జేయవే
నతి యొనర్చెద నీకు మాధవ నారదాది మునిస్తుతా. 47

ఈలాగునఁ గొనియాడుచు, బాలామణి యుండె శోకభార మడిగి శా
ర్దూలం బాఁకలిదీర్పఁగ, వేళయ్యె నటంచు సుమతి వేగమె కదలెన్. 48

ఇట్లు సత్యంబుఁ దప్పక మగిడి చనుచు వెంట వచ్చు శాస్త్రశిష్యుల దూరంబున
నిలిపి శాంతిసూక్తంబులు నివేదించి శార్దూలంబు సమీపంబునకుం జని శరీరంబు
మొడుంచుకొని యభిముఖం బై నిలిచె నాసమయంబున. 49

క. గురువులకొఱకై శిష్యులు, సురవల్లభుఁ దలఁచి పురుషసూక్తము పఠియిం
చిరి దిక్పతులను బ్రార్థిం, చిరి తత్తన్మహిమ నుతులు చేయుచు భక్తిన్. 50

వ. అంత. 51

క. బలరిపువహ్నియమాసుర, జలధీంద్రదిశేశశైలజాపతు లమరుల్
గొలువఁగ నచటికి వచ్చిరి, పులివాతం బడ్డ విప్రపుంగవుఁ బ్రోవన్. 52

గీ. వచ్చి భక్షింపు భక్షింపు వ్యాఘ్రనాథ, యూఁకటను జాలఁ జిక్కితి ననుచు నెఱయ
ముద్దయైయున్న భూసురముఖ్యుఁ జూచి, విస్మయాక్రాంతచిత్తులై వేల్పు లెల్ల. 53

మత్తకోకిల. సర్వశాస్త్రవిశారదుం డగు సత్యసంధుని భూసురున్
నిర్వహించి త్రివిష్టపంబున నిల్పి బెబ్బులి కెప్పుడుం
గర్వదీఱఁగఁ దృప్తి సేయుము గారవింపవె యోమరు
త్సార్వభౌమ యటంచు నొక్కట సన్నుతించిరి వాసవున్. 54

వ. వాసవుండును నట్లకాని మ్మని వేల్పుల మన్నించి నిస్పృహుం డైనసుమతిం బిలిచి
యిట్లనియె. 55

తరల. పుడమి సత్యము నిల్ప నేర్చిన పుణ్యశాలివి నీవ నీ
నడత వేల్పుల కింపు దెచ్చెను నవ్వగా దిది భోగముల్
తడవు గాఁగ భుజింపు స్వర్గము దక్కఁగైకొను మిష్టముల్
నొడువు మిచ్చెదఁ గొంకనేల మనోగతిన్ ధరణీసురా. 56

క. అనిన దివస్పతివాక్యము, విని వాచస్పతియుఁ బలికె విప్రుని భోగం
బునఁ దనిపి నిలువు శిష్యులు, వనితయుఁ సంతసముతోడ వర్తిల్ల దివిన్. 57

గీ. శత్రుమిత్రులు నీకొక్క సమమ యగుట, వ్యాఘ్రమిషమును దెలిసి దేవతలుగూడి
కోర్కులీవచ్చి యున్నారు కోరుకొమ్ము, వలసినవి యెల్ల బ్రాహ్మణవంశవర్య. 58

వ. అని పలికి యింద్రబృహస్పతు లంతర్ధానంబు చేసిరి. శార్దూలంబును విమానంబు నెక్కించుకొని దేవతలు దివంబునకుం జనిరి భూసురుండును విస్మయావిష్టచిత్తుండై యాశ్రమంబునకుం జని భార్యకు సకలంబెఱింగించి కర్మకాండంబు నడుపుచుండి యభీష్టభోగంబు లనుభవించి దివంబునకుం జనియెం గావున సత్యంబు దేవతలకును దుర్లభంబును స్వర్గప్రదంబునైన ధర్మంబని చెప్పుచుందురు. నీవును ధైర్యంబువదలక యదియు వ్రతంబుగాఁ జేయుచున్న నుత్తమలోకంబు సిద్ధించును. ఈయుపాఖ్యానంబు విన్నవారలు పాపంబులం బరిహరించి సత్యలోకంబున వసియింతు రని చెప్పినఁ గృష్ణునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 59

గీ. ప్రాణిరక్షణ మన్నింటఁ బరమపుణ్య, మండ్రు మునులెల్ల నందుల యతిశయంబు
కరుణ నెఱిఁగింపవే నాకుఁ గమలనాభ, యిందిరానాథ యిదె నీకు వందనంబు. 60
వ. అనిన విని కృష్ణుం డిట్లనియె. 61

## అభయదానమహిమ

చ. వెఱచినవాని లో భయము విప్పిన పుణ్యఫలంబు నెన్నఁగా
దరమె విధాతకైన ఘనదక్షిణ లిచ్చి సమస్తయాగముల్
సెఱపినవారు గంగ కడ నిచ్చలు నుండినవారు నీడుఁగా
రెఱుఁగు మొకింతయే నభయమిచ్చినవారలతో నరేశ్వరా. 62
క. విను మున్ను శిబి కపోతం, బనుపులఁగున కభయ మిచ్చి యఖిలోన్నత మై
తనరెడు వైష్ణవలోకం, బున కరిగె న్సురలు వొగడ భూపవరేణ్యా. 63
వ. అనిన విని శిబిచక్రవర్తి కపోతంబున కేచందంబున నభయం బిచ్చె నెఱింగింపవే
యనిన ధర్మరాజునకుం గృష్ణుం డిట్లనియె. 64
గీ. సత్యసంధుఁడు నైశ్వర్యశాలి యైన, శిబిమహారాజు యాగము ల్సేయఁ దొల్లి
యతనికీర్తులు గంధర్వపతులు పొగడ, విని పరీక్షింప మదిఁ గోరి వేల్పుఱేఁడు. 65
క. అనలునిఁ జేరి సహాయం, బొనరింపఁ, గపోతవేష మొగిఁ దాల్పుము నే
నును డేగ యగుచు వచ్చెద, మనకు న్శిబిచక్రవర్తిమహిమలు దెలియన్. 66
చ. వలయు నటంచు వేఁడుకొని వాసవుఁ డప్పుడు తాను డేగయై
జ్వలనుని గువ్వఁ జేసి వరుసం బదిదిక్కులఁ ద్రిప్పి యెక్కడ
న్నిలక శిబిక్షమావరుఁడు నిల్చినచోటికి వచ్చె నావిభుం
దలసియుం వెన్కదీయ వవురా యని రెంటిని జూచె వేడ్కతోన్. 67
వ. అప్పుడు శ్యేనంబునకు వెఱచి కపోతంబు శిబిశరణుచొచ్చి నమస్కరించి యి
ట్లనియె. 68
ఉత్సా. డేగ యొంపరాఁగ దానికేవి కోర్వ లేక నీ
లాగు భీతి యెక్కలాగు లాగ నీపదంబులన్
లాగులాడఁ గంటి నున్న లాగు మాని యింక నే
లా గెటైన నన్నుఁ గాచు లాగు జాగవే నృపా. 69
క. అని పలికి భీతి వణఁకుచు, వినయంబున శరణు చొచ్చి వేఁడినపులుఁగుం
గనుఁగొని దయ దళుకొత్తఁగ, జనపాలకచక్రవర్తి చయ్యనఁ బలికెన్. 70
గీ. రమ్ము శోకమ్ము భయము కంపమ్ము విడువు, మృత్యు వైనను నాయొద్ద మెదల వెఱచు

నొరులు నాకెంత గువ్వ నీవూరకుండు,మనిన విని డేగయును డాయఁజనుచుఁ బలికె.

ఉ. రాజవు ధర్మము ల్నడుప రాజవు నా నిటువంటి నీవు నీ
యోజ విరుద్ధకర్మముల కోడవు గువ్వఁ దినంగ డేగ నం
భోజభవుం డొనర్చెను గపోతము నిచ్చి మదీయభోజన
వ్యాజముఁ దీర్చి కావు మిపు డాఁకటఁ బ్రాణము లుండ నేర్చునే. 72

ఆ. ధర్మవర్తనంబు దప్పక నడిపించు, భారమెల్ల రాజుపాలి దందు
రతఁడె తప్పనడవ నాయత్తపడఁ బోరు, పరిహరింప వశమె బ్రహ్మకైన. 73

వ. అనిన శ్యేనంబునకు రాజిట్లనియె. 74

క. శరణాగతరక్షణమే, పరికింపఁగ ధర్మమందుఁ బరమాణువుతో
సరిగావు దానయాగ, స్ఫురణంబులు కోటి యైన బుద్ధిం దెలియన్. 75

వ. బ్రహ్మహత్యాదిపాతకంబుల కైన నొక్కచందంబునం బ్రాయశ్చిత్తంబు గలదుగాని శరణాగతఘాతుకునకు లేదు. అట్టివాఁ డుభయలోకంబులం బుట్టఁడు ప్రాణార్థియై రక్షింపవే యని శరణుచొచ్చిన యీకపోతంబు నెట్లు విడువనేర్తు వలయు నేని నీకు మాంసంబు యథేష్టంబు గావించెదఁ బుత్రపౌత్రులం గూడి సుఖంబుగా ననుభవింపు మనిన శిబికి శ్యేనం బిట్లనియె. 76

గీ. అన్యమెల్లను నాకు నాహార మౌవి, హాయసము డేగలకు గువ్వ నబ్జభవుఁడు
భక్ష్యముగఁ జేసెఁ గావునఁ బరమధర్మ, భక్తి రక్షింపు నన్ను సబాంధవముగ. 77

చ. పలువురఁ గొట్టి యొక్కరునిఁ బాలన సేతురు మాధు లొక్కనిం
గలఁచి యనేక జీవులను గావరె యుత్తము లట్లు గాన ని
ర్మలమతి గువ్వనిచ్చి సుతమాన్యసహోదరబంధుమిత్రులం
గలయఁగ నన్నుఁ బ్రోవు చిరకాలము కీర్తులు వర్తిలున్ ధరన్. 78

ఆ. ఒడలు విడిచి యైన నొరుఁ గాచుపుణ్యాత్ముఁ, డీవు తేరవారి కింత వెనఁకఁ
జెల్ల దిమ్ము గువ్వఁ జెఱువులో నీళ్ళన్ని, పాఱఁ జల్లి పరము పడయరాదె. 79

వ. అనిన శ్యేనంబునకు శిబి యిట్లనియె. 80

క. విడువంగరాని యొడలు, న్విడుతురుగా కరయ శరణు వేఁడినవారి
న్విడుతురె [1]యేపట్టునను, న్విడువు మనఁగ నహిత మరయ విడు మీమాటల్. 81

వ. అనిన శిబిచక్రవర్తికి శ్యేనం బిట్లనియె. 82

ఆ. గువ్వనిమ్ము నాకుఁ గోరికి సిద్ధించు, నీయవేని దీనియెత్తుఁ దూఁచి

---

1 యెవ్వరైనను నే, విడువఁ గపోతంబు నీవు విడు మీమాటల్.

నీశరీరమాంస మీవయ్య యాఁకట, మరుగుచున్నదాన మనుజనాథ. 83

వ. అనిన శ్యేనంబునకు శిబి యి ట్లనియె. 84

క. నమ్మినచో విడుచుట నీ, చమ్మని కా కేమి యొడలు శాశ్వతమే మాం
సమ్మెంత వలసె నేనియుఁ, గొమ్మాఁకలి దీఱఁ దీర్చికొమ్మా వేఁగన్. 85

క. అని చేత నిశితఖడ్గముఁ, గొని తనదేహంబుఁ గోసికొని మాంసముఁ ద్రా
సున నిడె డేగకు నొసఁగఁగ, ఘనులకుఁ గాయంబు తృణము గాదే తెలియన్. 86

గీ. గువ్వయున్నట్టితునుకయెక్కుడుగఁదూఁగ, మాంసఖండంబు గుడుకలోమఱియు నించి
మఱియు నట్లైన నీక్షించి మదిఁ జెలంగి, త్రాసుపై నిల్చెఁ దాన యద్ధరణివిభుఁడు.

వ. ఆక్షణంబునఁ ద్రాసును నొక్కచందంబునఁ దూఁగుచుండ దేవదుందుభులు మొరసెఁ
బుష్పవర్షంబు గురిసె శ్యేనకపోతవేషంబులు మాని యింద్రాగ్నులు ప్రత్యక్షంబై
రందు వాసవుం డి ట్లనియె. 88

గీ. శౌర యాధైర్య మితరులయందుఁ గలదె, వాసవుఁడ నేఁ గపోతంబు వహ్ని నీమ
హాత్మ్య మరయంగ వచ్చితి మడుగు వరము, సకలదిక్కుల నీకీర్తి సందడించె. 89

వ. అనిన సంక్రందనునకు శిబిచక్రవర్తి యి ట్లనియె. 90

క. యాగము నీకై కాదే, సాగించుట విఘ్న ముడుపు సఫలముగ నావి
ర్భాగముఁ గొను మీధర్మము, బాగుగ నొనరింప మీకు భారముగాదే. 91

వ. అని వాసవు నుతియించి విభావసున కి ట్లనియె. 92

ఆ. మొదలిమొగము గావె త్రిదశకులంబున, కీవు దనియ మున్నె యెల్లవారుఁ
దనియుదురు సుమంత్రధన్యంబు హవిరన్న, మనుభవించి కావు హవ్యవాహ. 93

వ. అని సన్నుతించిన మనోహరం బైన శిబివాక్యంబు విని యింద్రాగ్ను లాచంద్రతార
కంబుగా నీకీర్తి లోకంబునం జెలంగు దివ్యరూపధరుండ వై యభీష్టభోగంబు లను
భవించి తదనంతరంబున బ్రహ్మలోకంబున నుండు మని వరం బిచ్చి యంతర్ధా
నంబు నొంది రదిగాక యనేకమహీపతు లాపరమపురుషార్థం బొనరించి దివంబున
కుం జని రట్లుగావున నీవును మనోవాక్కాయకర్మంబుల దుఃఖితులకు సహాయం
బాచరింపుము శుభంబు చేకూరు నీయుపాఖ్యానంబు విన్నవారల కుత్తమలోకం
బులు సిద్ధించుననిన విని కృష్ణునకు యుధిష్ఠిరుం డి ట్లనియె. 94

సీ. వేదశాస్త్రపురాణవిద్య లేధర్మంబు వివరించు నీకది యవగతంబ
యధికసూక్ష్మము ననేకార్థంబు సర్వజంతువులకు సులభంబుఁ దుష్టికరము

తనయాభిలాషికిఁ దనుజాతవితతియుఁ స్వర్గకామికి సదా స్వర్గసుఖము
పుణ్యార్థులకు మహాపుణ్యంబును ముముక్షుజనములకును మోక్షసరణి యొసఁగఁ
గీ. జాలి తీర్థస్వరూప మై సప్తతంతు, శతఫలోన్నత మై పాపసమితి నణఁచు
దాన మెయ్యది యెఱిఁగింపు దయ దలిర్ప, నీకు వందన మొనరింతు నీరజాక్ష. 95
వ. అనినఁ గౌంతేయాగ్రజునకు గదాగ్రజుం డిట్లనియె. 96
గీ. దానములలోన నుత్తమదాన మరయ, భూమిదానంబ యది వేదములు పఠించి
దేవపూజాపరుం డయి తీర్థసేవ, సేయు విప్రున కీయ విశేష మరయ. 97
వ. విప్రులకు నిత్యంబును హిత మాచరించినవారలకు సకలయాగంబుల ఫలంబును గం
గాతీరంబున నశ్వమేధంబు లాచరించిన పుణ్యంబును సర్వతీర్థంబులస్నానం బొనరిం
చిన విశేషంబు నఖిలతపంబులఫలంబును సిద్ధించు నట్టిదానమ్ము నిమ్మని యొరుల కుప
దేశించిన నంతధర్మంబు దొరకు నండ్రు భూదానంబునకు సమం బగుదానంబు
మూఁడులోకంబుల లేదు భూదాత సర్వదాత యనంబడు నట్టివాఁ డెల్లపాపంబులఁ
బరిహరించి మోక్షంబున కధ్యక్షుం డగుం గావున నీవును వేదశాస్త్రపురాణంబు
లుపన్యసించుబ్రాహ్మణుల కీదానంబు గావింపుము. 98

## వాపీకూపారామాదినిర్మాణమహిమ.

గీ. చెఱువు వేయించునాతండుఁ జేతఁ దాను, వేయునాతండు నితరులు వినుతిసేయ
నుండు నాయొద్దఁ ద్రోవరి యొక్కఁ డైనఁ, దజ్జలము లాని వానిపాతక మణంచు.
క. నీరొక్కదివస మైనను, ధారుణి నిలువంగఁ జెఱువుఁ ద్రవ్వింపుము నీ
వా రెల్ల బ్రహ్మలోకం, బారూఢిగఁ జెంది యుండు రవనీనాథా. 100
ఆ. చెఱువు వేయ మొదలు చేసినఁ దదుపాయ, మెఱుఁగఁ జెప్పి రేని యెట్టివారి
కైన బ్రహ్మలోక మతిసులభం బని, ధర్మవేత్త లండ్రు ధర్మతనయ. 101
క. బరు వైనపాటిమృత్తిక, చెఱువులలోఁ దీసి పైలఁ జేర్చినపురుషుం
డరమరలు లేక వేల్పుల, యిరవున వసియించు నామహిమముం గాంచున్. 102
వ. చెఱువు ఫలంబులోనఁ గాసారంబు సగంబును గూపంబు పాతికయు నై యుండు.
క. ఊరుఁ దటాకము దేవా, గారముఁ బాలించువారి ఘనపుణ్యంబుల్
చేరును గర్తలకన్నను, నూఱుగుణంబులను మించి నూల్కొనుచుండున్. 104
క. గట్టిగ దేవాయతనముఁ, గట్టించిన యతఁడుఁ దాను కట్టినవాఁడు
న్నెట్టుకొని ఘనవిమానము, మెట్టుచు నాలోకమునను మెలఁగుచునుండున్. 105
క. గట్టిగఁ బేదలు మంటను, గట్టిన దేవాలయమును గలిగినవారల్

కట్టించి త్రాలచేతను, గట్టించినయిల్లు నొక్కగతి పుణ్యామగున్. 106

క. ఆరామ మనేకుల కుప, కారముగా వేయుంచట్టి ఘనులుఁ బితరులుం
దారు సుఖంబున నుందురు, సారసభవులోకమునను సౌభాగ్యములన్. 107

## తులసీమాహాత్మ్యము.

క. తులసీదళంబు బ్రాహ్మణ, కులున కొసంగినయతండు గురుతేజముతో
నలినాప్తసుతుఁడు పూజలు, సలుపఁగ నాయొద్దనుండు సంప్రీతలీలన్. 108

సీ. తులసిపూసల పేరు తుదిచేతఁ గొని దాన గాయత్రి జపియింపఁ బాయుఁ భయము
తులసీమణులు భుజంబుల గండసీమల ధరియింప ఘాతముల్ దరియ వెలుచుఁ
దులసిచే హరిపాదములు పూజ గావింప బ్రహ్మలోకంబు చేపడఁగఁ గలదు
తులసికిఁ బ్రాకారములు గట్టనేర్చిన యతఁడుండు నాయొద్ద నాప్తుఁ డగుచుఁ

గీ. దులసి గుత్తుల నర్చింప దొరకెనేని, పితరులెల్లను సంతతప్రేమ దనర
మునులు పొగడంగ సాలోక్యముక్తిఁ గంద్రు, తరమె తులసిని వర్ణింప ధర్మతనయ.

క. ఎక్కడఁ దులసియుఁ బద్మము, లెక్కడ వైష్ణవసమూహ మెడయాక కడుం
గ్రిక్కిరిసి యుండు నెప్పుడు, నక్కడఁ బ్రత్యక్ష మగుచు హరి తా నుండున్.

క. తులసిని గంగను నెప్పుడుఁ, దలఁచిన దుస్స్వప్నమణఁగుఁ దలఁకొను శుభముల్
తలచూప వెలుచుఁ బాపము, జలజాతభవాదిలోకజాలము గలుగున్. 111

ఉత్సాహ. ఆకసంబును భూమి వాయువు నగ్ని యంబువు లద్రులున్
లోకపాలురు సిద్ధసాధ్యులు లోకజాలము బ్రహ్మ నీ
రాకరంబులుఁ జంద్రసూర్యులు నర్కజాది మహానదుల్
నాకవాసులు నారదాదులు నాదుమూర్తులు పార్థివా. 112

క. జనమునకు నలికిఁ బూజకుఁ, దపమున కున్నతికిఁ దగిన దైవము నేనే
కపటంబు మాని కొల్చిన, నపరిమితసుఖంబు లిత్తు ననవరతంబున్. 113

క. దాఁచఁగ నేటికి నీమదిఁ, దోఁచినయర్థంబు వేఁడు దోడ్తో నేనుం
బ్రాఁచి వడకుండఁ బలికెదఁ, బూఁచినయది వెనుకఁ దీయఁ బోలునె పార్థా. 114

క. అని వాసుదేవుఁ డాడిన, విని తిరుగన్ ధర్మ మనుగ వేడుకపడియెన్
ఘనుఁడు యుధిష్ఠిరుఁ డీకథ, గొనియాడిన విన్న వారికోర్కులు గురియున్. 115

వ. అంత దయారసంబు దనపై వెల్లివిరియుటకు సంతసిల్లుచుఁ దిరుగ నొక్కధర్మం
బెఱుంగం దలంచి యుధిష్ఠిరుండు కృష్ణున కిట్లనియె. 116

## పూజాకాలద్రవ్యాభిషేకవిధివివరణము.

క. పూజాభిషేకధర్మము, లేజాడలు ద్రవ్య మేమి యెందుల మే లే
యోజ ఘటిల్లును దెలుపుము, రాజీవదళాక్ష కృష్ణ రామావరజా. 117

వ. అనిన యుధిష్ఠిరునకు మురహరుం డిట్లనియె. 118

క. పూజాద్రవ్యము ధర్మము, పూజాసమయంబు నిత్యమును దేవతలం
బూజించిన ఫలమును విను, రాజకులాభరణ పాండురాజతనూజా. 119

సీ. సంక్రాంతు లయనముల్ చంద్రసూర్యగ్రహణంబులు మాఘమాసంబు శని బు
ధాశ్వినుల్ ద్వాదశీ హరివాసరము శివరాత్రి పున్నమయుం శ్రీరామనవమి
పుష్యార్కమును మహాపుణ్యకాలము లిందు నిగమోక్తవైఖరి నీట నైనఁ
బంచామృతంబున ఫలపుష్పగంధోదకంబులఁ బురుషసూక్తక్రమంబు

గీ. వెలయ నభిషేక మొనరించి వివిధభక్ష్య, భోజ్యముఖమహానైవేద్యములు సమర్ప
ణంబు గావించి గీతవాద్యంబు లలరఁ, గీర్తనం బొనరిచి నమస్కృతులు చేసి. 120

గీ. వివిధనైవేద్యము లొసంగి శివునినైన, నన్ను నైనను బూజించునరులు దివ్య
మణిమయవిమానముల నెక్కి మత్పురమున, నెలవుకొనియుందు రెప్పుడాప్తులును దాము.

క. హరిహరుల భేదబుద్ధిం, బరికింపక పూజ సేయుభద్రాత్ముల కె
వ్వరిలోకమ్ముల నైనను, నిరుపమగతి నిలువవచ్చు నిత్యవిభూతిన్. 122

తోటకము. జాజుల మల్లెల సంపెంగల నా, పూజ యొనర్చిన పుణ్యశరీరుల్
తేజముఁ గందురు తెలిపితి నీకున్, రాజిలఁ జేయుము రాజకులేశా. 123

క. నూనెను దీపంబులు నా,కైనను శంకరుని కైన నర్పించినయా
మానవులు గాంతు రిష్టము, పూనిక చెల్లంగఁ బాండుభూపతనూజా. 124

క. ప్రీతి న్నానికటంబున, నేతను దీపంబు వెట్టు నేర్పరికి మహా
పాతకము లణఁగు నధ్వర, జాతం బొనరించుఫలము చయ్యనఁ గలుగున్. 125

క. తన కిష్టమైనభోజ్యం, బును నలవడ వారికి నమరముఖ్యుల కర్పిం
చినజనులు పాతకంబులఁ, దునుమాడి వికుంఠపురిని దుది నుందు రొగిన్. 126

గీ. మాఘమునఁ గార్తికంబున మత్సమీప, మునను దీపంబు వెట్టుచు భూసురులకు
భోజనము లిడువారలు పూర్ణు లేను, దనియుందును విన్ము మిక్కిలి ధర్మతనయ. 127

గీ. తమకుఁ బ్రియ మైనభోజ్యము ధరణిసురుల, కొసఁగువారలకును బ్రహ్మవసతి దొరకు
నన్నదానంబుచే భ్రూణహత్య యైనఁ, బాసి పోవును సత్యంబు పాండుపుత్ర. 128

క. అన్నోదకదానంబుల, కెన్న న్మఱి సాటిలేద యివి నేసినవా

రున్నతపాపము లణఁచుచు, నన్నిటఁ బరిశుద్ధు లగుదు రవనీనాథా. 129

క. అన్నమునఁ బుట్టు దేహం, బన్నమ్మున వృద్ధిఁ బొందు నన్నమె ప్రాణం
బెన్న నటుగానఁ బ్రాణం, బన్నప్రదుఁ డరయ సంశయము విడుము నృపా. 130

ఆ. అన్నదాతకులమునందుఁ బుట్టినవారు, వేయువత్సరములు వెళ్లదనుక
నరకలోక మొక్కనాఁ డైనఁ జూడరు, కాన నన్నదాత ఘనుఁడు ధాత్రి. 131

క. త్రోవనడిచి డస్సినభూ, దేవున కన్నంబు వెట్టి తేర్చినవారల్
ఠీవం జరియింతురు వాణీపరులోకంబునందు నిత్యవిభూతిన్. 132

## అన్నదానప్రశంస, బ్రాహ్మణపూజావిధి.

క. ఇంటికి వచ్చిన యతిథుల, వెంటం జనుదెంచు దివిజవిసరము వారల్
వంటకము గుడిచి తనిసినఁ, బంటింపక వారి జగము ప్రస్తుతిసేయున్. 133

క. ముందల దేవత లన్నము, పొందుగ నిడి సకలలోకపూజ్యత దివముం
జెంది సుఖించిరి కావున, నందఱిలో నన్నదాత యధికుం డరయన్. 134

క. విప్రుఁడ నై భుజియింతును, విప్రుఁడ నై పూజఁ గొందు వివిధార్థంబుల్
విప్రుఁడ నై సమకూర్తును, విప్రులకును సాటి లేదు వేఱింతైనన్. 135

సీ. బ్రాహ్మణులకుఁ బదాభ్యంగము చేసిన బహుళతీర్థస్నానఫలము దొరకు
ధరణిదేవతలకుఁ దలయంట నూఁటెండ్లు గంగనాడినయట్టిఘనత యబ్బు
నుర్వీసురేశుల కుష్ణోదకము వోయువంశంబునకు బ్రహ్మపదవి గల్గు
విప్రుల కామయవిసరంబు మాన్పిన దివిజనాయకుఁ గూడి తిరుగవచ్చుఁ

గీ. బుడమివేల్పుల కిండ్లిచ్చు పుణ్యశాలి
కశ్వమేధం బొనర్చినయట్టి సుకృత
మొదవుఁ బాఁపలకును బాఁడి మొదవు లీయ
సత్యలోకంబు కలుగు నిశ్చయము గాఁగ. 136

వ. కపిలదానంబు సేయువాఁడు రుద్రుం డగు నుభయతోముఖి నొసంగిన పుణ్యా
త్మునికులంబువా రెల్ల నాలోకంబున నుందురు మృత్యువాసన్నం బైనవార లావు
నిచ్చిన నీయఁజూచిన బ్రహ్మలోకంబుఁ గాంతురు గ్రహనక్షత్రంబులచేత సామ
యంబుచేతం బీడితుం డైనవాఁడు గోదానంబున నపమృత్యువును జయించి ధన
ధాన్యమణివస్త్రపుత్రపౌత్రాభివృద్ధుల నభినందితుం డై పాపంబులం బరిహ
రించి త్రిదివంబునం జేరుం గావున నీవును గోదానం బొనర్పుము. ఇందుచేత నభి
వృద్ధియుఁ స్వర్గమోక్షంబులునుం గలుగు నేతద్దానశీలుండు [illegible]ం బ్రియుండును

## విశ్వరూప వివరణము.

భక్తుండు నై సకలలోకంబులం బూజితుం డై ప్రసిద్ధుం డగు నిరంతరంబును శాస్త్ర ప్రసంగంబు సలుపుచు దానం బొనర్చుచు సాధువులకు హితంబు సలుపుచుండు వారలయందు నాకుఁ గారుణ్యం బుదయించు యోగీశ్వరుండును సర్వలోకేశ్వరుండును సర్వదాశ్రయుండును నుత్పత్తిస్థితిలయకర్తయు సంసారసంతారకుండును ధర్మశీలురకు ధర్మప్రదుండును దాపసులకుఁ దపఃఫలంబుగా నన్నెఱుంగు మీయుపాఖ్యానంబు విన్నవారలకు నాచంద్రతారార్కంబుగా స్వర్గంబు చేకూర్తు నన్ను మురహారునకు యుధిష్ఠిరుం డి ట్లనియె. 137

గీ. విడెము గందంబుఁ గోకలు విరులు మఱియు
నీయఁ దగినట్టి ద్రవ్యంబు లెన్నియేని
బొసఁగ నివి యెల్ల నెవ్వరి కొసఁగ వలయుఁ
గరుణ నెఱిఁగింపుమీ నాకుఁ గమలనాభ. 138

వ. అని యడిగిన కుంతీనందనునకు దేవకీనందనుం డి ట్లనియె. 139

## వస్త్రదానాదిప్రశంస.

క. దానములకెల్లఁ గర్తను, నేనే నారూపు ధారుణీసురుఁ డతని
స్నానావిధపూజల స, న్మానము గావించి యిమ్ము మహితవిచారా. 140

సీ. వస్త్రదానము చేయువారలు శతవంశకలితు లై శంభులోకంబునందుఁ
గౌశేయకంబళకంచుకాదు లొసంగు ఘను లెల్ల స్వర్గలోకంబునందు
వజ్రగోమేధికవైదూర్య పుష్యరాగప్రదు ల్విష్ణులోకంబునందు
నెద్దు నిచ్చిన ధన్యుఁ డింద్రాదు లభినుతు ల్గాపింప సత్యలోకంబునందు

గీ. విమలగంధాంబుపూర్ణ మౌ వెండిముంత, తామ్రపాత్ర సమర్పించు ధర్మవర్తు
లందముగ సూర్యలోకంబునందు నెపుడు, నతులమతులను విహరింతు రవనినాథ. 141

వ. ఛత్రచామరాందోళికాదు లిచ్చినవారు స్వర్గంబునఁ జరియింతురు గజాశ్వమహిషమేషంబుల నొసంగినవారలు మృత్యువు నిర్జించి సుఖం బనుభవింతురు కృష్ణాజినదానం బొనర్చినవార లాయుష్మంతు లగుదురు గంధోదకపూతంబు లైన కాంచనలోహదారుపాత్రంబుల దానంబు చేసినవారు బంగారుగిన్నెల నమృతపానంబు సేయుచు యక్షకిన్నరగంధర్వసిద్ధసాధ్యచారణాదులు నుతియింప విష్ణులోకంబున విహరింతురు వస్త్రద్వయసంయుతం బైన కాంస్యపాత్రంబు నర్పించువారు నామ

యగ్రస్తుం డైనయతనికి వస్త్రాజినాన్నాజ్యౌషధంబులు విచారించినవారు నుభయకులంబుల నుద్ధరించి సత్యలోకంబున నుందురు నిఱుపేదలకు మృణ్మయపాత్రంబు లొసంగిన ననంతపుణ్యంబు గలుగు రజతకాంచనప్రదాతలు ధనకనక వస్తువాహన సంపన్నులై పుత్రపౌత్రులం గూడి యభీష్టభోగంబు లనుభవించి పుణ్యలోకంబులు గాంతురు మునికులంబునకుఁ గాషాయకౌపీన భైక్షకంబళాదులచే సంతసం బాపాదించినవారు ముక్తు లగుదురు కార్తికంబు పున్నమనాఁడు వృషభోత్సర్జనంబు గావించినవారు సకలజన్మార్జితంబు లైన పాపంబులఁ బరిహరించి రుద్రరూపంబున డెబ్బదిరెండుకులంబులఁ గూడుకొని ప్రమోదం బొందుదురు వారలపితరులు నరకంబున నున్నవారు స్వర్గంబునను స్వర్గంబుననున్నవారు బ్రహ్మపదంబును బ్రహ్మపదంబున నున్నవారు విష్ణులోకంబునుం జెందుదురు అనేకకాలంబు దున్నిన యెద్దునైనను గనుపోతునైన శివలింగాంకితంబు చేసినవారు యాతనలు లేక రామునిచేతం బూజితులై సకలలోకవినోదంబుఁ గాంతురు అమావాస్యనాఁ డెనుమునైనను సావు నైనఁ ద్యాగంబు చేసినవా రపమృత్యుదారిద్ర్యంబులను దరియించి సకలసౌఖ్యంబు లనుభవింతురు మఱియుం దివంబున వసియింతురు నిత్యతాంబూలంబు లర్పించినవార లుత్తమస్త్రీలు సంపాదింతురు జ్యేష్ఠమాసంబున సర్వబీజకృషిక్షేత్రంబులకు జలంబులు సహాయంబు గావించినవారలు యాతనలు లేక పదికోట్ల మాతృపితృవంశంబులతోఁగూడి వైకుంఠపురంబున నుందురు. సదాచారసంపన్నుండు నహంకారవర్జితుండు నైనబ్రాహ్మణునిచేత స్థావరజంగమాత్మకం బైన జగంబు పవిత్రంబగు నతండు దానార్హుండు ఆయనం గొట్టినం బరుషంబు లాడిన దండంబు వెట్టకున్న నతండు పాపాత్ముండగు భూసురుని తెఱంగున నాకు లక్ష్మీవైకుంఠంబులు ప్రియంబులు గావు కావున నీవు బ్రాహ్మణభక్తుండవు గమ్ము విప్రుండు సంతుష్టుం డైనఁ గోరుకు లీడేఱు నివి మొదలైనధర్మంబు లనేకంబు లందు సారం బెఱింగించెద నాయందు భక్తిపూర్వకంబుగా నిచ్చినదానంబు సాత్త్వికంబు ననంతపుణ్యఫలదంబు నగు నీరహస్యంబు విన్నవారలకుఁ బాపంబులు నశించు సర్వదానఫలం బబ్బు ననినఁ గృష్ణునకు ధర్మరా జిట్లనియె. 142

గీ. పుండరీకాక్ష మాధవ పుణ్యపురుష, వరద వైకుంఠ వనమాలి వాసుదేవ
యచ్యుతానంత గోవింద హరి ముకుంద, శరణు బొందిన నన్నుఁ గావు జలజనాభ.

క. సాలగ్రామము లింగము, ఛేలీల ఫలమ్ము లొసఁగు నేపుణ్యం బా
నేలోక మొసఁగఁగ జాలును, వాలాయమ్ము దెలియఁ బల్కుము వనజదళాక్షా. 144

వ. మఱియుఁ దానార్థంబు లేమేమి యందులఫలం బెట్టిది యెఱింగింపవే యన్న యు
ధిష్ఠిరునకుఁ గృష్ణుం డిట్లనియె. 145

గీ. మాఘమాసంబు మొదలుగా మంచినీళ్లు, చల్ల యైనను బానీయశాలఁ గట్టి
పోయువారలపుణ్యంబుఁ బోల్పనరిది, యుంభయలోకంబులందున శుభముఁ గండ్రు.

వ. చతుష్పథంబులందుఁ ద్రోవలఁ జలిపందిరి వెట్టించి యంబలి శీతోదకంబులుఁ
బోయువారలపుణ్యంబు లెక్కింప శక్యం బగునె దేవదూతలు దివ్యమణివిమానంబు
లెక్కించుకొని హితంబులు పలుకుచుఁ దాళవృంతంబుల విసరుచు సురలోకవైభ
వంబులు సూపుచు వసులోకంబునకుఁ దోడ్కొని చని యచటి యబ్బురంబులు
కబ్బంబులుగాఁ దెలుపుచు బ్రహ్మలోకంబు చేర్చిన నచ్చటి రెండుకోట్ల స్వకులంబు
వారితోఁ గూడి కోటియుగంబు లుండి పదంపడి నాలోకంబునకు వచ్చి యమే
యసుఖంబు లందుచుండ్రు. 147

సీ. గంధకస్తూరికాకర్పూరము లొసంగు ఘనులెల్ల సోమలోకంబునందు
నారికేళకపిత్థనాగవల్లు లొసంగు ఘనులెల్ల స్వర్గలోకంబునందు
భక్ష్యభోజ్యంబులుఁ బానీయము లొసంగు ఘనులెల్ల ధ్రువునిలోకంబునందుఁ
దిల ముద్గ గోధూమ జలధాన్యము లొసంగు ఘనులెల్ల బ్రహ్మలోకంబునందుఁ

గీ. దవిలి విహరింతు రాచంద్రతారకముగ, జాతి కరవీర మల్లికా చంపకాది
కుసుమవిసరంబు లొసఁగెడి యసమయశుని, నిత్యకృత్యంబు లరయుందునే నిజంబు.

వ. సాలగ్రామంబున నాచక్రం బున్నయది తద్దానంబు చేసినవారల కన్నిఫలంబులును
సిద్ధించు నదియునుం గాక చతుస్సాగరపర్యంతభూవలయం బొసంగినపుణ్యంబు
చేకూరు నట్టిమహాత్ముల నాకుఁ బ్రియభక్తులుగా నెఱుంగుము. 149

క. ఎక్కడ సాలగ్రామం, బెక్కడను దపోవనంబు లెక్కడఁ దీర్థం
బక్కడను ముక్తి గలుగును, నిక్కము నను బూజచేయు నేర్పరుల కిలన్. 150

వ. సాలగ్రామలింగదానంబు లొనర్చువారు నాలోకంబున నుందురు తత్సమీపంబున
దీపంబు వెట్టిన యోగజ్ఞానసిద్ధులు సిద్ధించు. 151

సీ. ఆవులకును గడ్డి యం దిచ్చువారికి శివలోకవిహరణశ్రీ చెలంగు
మునిమఠంబుల దీపములు వెట్టువారికిఁ జేకూరు గంగాభిషేకఫలము
మఱియుక్త మైనహోమంబు దానము సేయువారికి వైకుంఠవసతి దక్కు
నాశ్రమాగారంబు లనువర్తన మొనర్చు నట్టివారికి దివం బధిగతంబు

గీ. అంతరరివర్గము జయించి యన్యదీయ, పాదపద్మార్చనాసక్తిఁ బరఁగువారి

గొరుల నిందింపఁ జనక పరోపకార, పరత వర్తింప సులభంబు బ్రహ్మపదవి. 152

గీ. గోవులకు విప్రులకు మేలు గోరువారు, యతుల గురువుల నగ్నిని వరసి సేవ
సలుపువారలు సత్యంబు క్షమయుఁ గల్గు, వారు చూడరు యమపురద్వారసరణి. 153

క. పూజ కెడ యైనహరునిం, బూజించినవారు నెపుడు భూలోకమునం
బూజితు లయి నారాయణుఁ, బూజించుచునుండు రధికపుణ్యాత్ములై. 154

ఆ. దేవతాలయంబు తెలియఁగొప్పఁ గట్టిన, నందు గోమయమున నలికిరేని
సకలపాపసమితి శకలంబులై పోవు, యశము గల్గుఁ బాండవాగ్రగణ్య. 155

క. కర్పూరసహితధూపము, లర్పించినవార లెల్ల నప్పత్పురిలోఁ
దీర్పరులై యుందురరా, నేర్పేర్పడ దండ మిడిన నేర్పరి కెల్లన్. 156

వ. ఒక్క ప్రదక్షిణంబునఁ బాపంబు దూలు రెంట దివంబు మూఁట నింద్రస్నేహంబు నాలుగింట వైకుంఠంబు నైదింట సర్వలోకంబు నారింట మహైశ్వర్యంబు నేడింట నాకైంకర్యంబు నెనిమిదింట సాలోక్యంబుఁ దొమ్మిదింట నాపూజనేయుంట పదింట సామీప్యంబుఁ బదునొకంట సారూప్యంబు పండ్రెంట సాయుజ్యంబుఁ గల్గు నింతకంటె నధికంబు లేదు 157

గీ. మేని జాడ్యంబుఁ బీడయు మృత్యుభయము,నణఁగు శంకరునకుఁ బ్రదక్షిణ మొనర్ప
సోమసూత్రంబు మేర యాచొప్పు నడువ,నయుతఫలమిచ్చుఁ గాకున్న నంతకంత.

వ. భూసురుండు రుద్రసూక్తంబునఁ బ్రాతస్స్నానంబు చేసి శివునకు నభిషేకనమస్కారంబులు చేసిన నేకకాలంబున ద్వికాలంబునఁ ద్రికాలంబున నైన నిత్యంబును దర్శనంబు గావించిన వృషాండంబు లంటుచు శృంగమధ్యంబునం జూచినఁ గైలాసంబున శివసన్నిధానంబు సిద్ధించు మృదంగ గీతవాద్య ఘంటికా కాహళ శంఖారావంబుల నన్ను సేవించినవారు ముక్తు లగుదురు సంశయంబు లేదు లోకంబుల గెల్చి కోటి వంశంబులతోఁ గూడి వైకుంఠపురంబున నుండుదురు గరుడకంబంబు నిల్పినవారు రాజు లయి జన్మింతురు ఆఖండదీపంబు వెట్టినవారికి దినదినంబు నశ్వమేధఫలంబు చేకూరు నీధర్మంబులలో నెవ్వరేధర్మంబు చేసినను సుఖంబు గందురు నీవు నొనర్పుము భద్రంబు లొండెదవు ధర్మంబువలన నర్థకామమోక్షంబులు లభించుం గావున నాయందు భక్తిని విడువక ధర్మంబు లొనర్పుము నీవు మహీరక్షకుండ వింకనేమి వలసిన నెఱింగించెద నడుగు మీయుపాఖ్యానంబు విన్నవార్లకు సకలధర్మంబుల ఫలంబు నగు ననిన విని వసుదేవనందనునకు ధర్మనందనుం డి ట్లనియె. 159

క. విన నీగలి ధర్మంబులు, వినిపింపుము నీను లలర వినియెద విశ్వం

బున నీపదపద్మముకన్నను గతి గలదే ముకుంద వారదవరదా. 160

వ. అని యడిగిన యుధిష్ఠిరునకుఁ దిరుగ నొకధర్మసారం బెఱింగించెద విను మని కృష్ణుం
డిట్లనియె. 161

## ప్రాతస్స్నాన గ్రాయత్రీజప బ్రహ్మయజ్ఞాది విధానము.

గీ. కమలబంధుని యుదయంబు గాకమున్న, నన్నుఁ దలఁచుచు లేచి స్నానంబు సేయు
వారు దివమున నుందు రవార్యమహిమ, నరకములు చూడఁ డనుదినస్నాయి యెందు.

వ. ప్రాతఃకాలంబున స్నానంబు చేసిన బాహ్యాభ్యంతరపాపంబు లణఁగు మధ్యాహ్నం
బున నాచరించిన దివంబు గలుగు స్నానం బొనర్పక భుజించినవాఁడు మాంసాశి
యగుఁ గావున స్నానం బాచరించి భుజించినవారు నాకు భక్తు లనంబడుదురు. శు
చిస్నాతులై దేవర్షిపితృతర్పణంబులు నివర్తించి మదీయదివ్యనామంబులు జపియిం
చిన మానవులు కిల్బిషంబులం బాయుదురు. శుభ్రవస్త్రంబు ధరియించి మానులై
యర్ఘ్య మర్పించి నన్ను ధ్యానంబు చేసినవారలు దేవతలచేతం బూజఁ గొందురు
సూర్యు నుద్దేశించి జపంబు చేసి స్తోత్రంబు గావించిన నాకుఁ బ్రీతి యగు గాయ
త్రీజపం బష్టోత్తరశతం బైన దినదినంబు జ్ఞానాజ్ఞానకృతపాపంబులు నశించుచుం
డు నష్టోత్తరశతసహస్రంబు జపియించిన సకలదురితంబులుం దొలంగు సంవత్సర
జపంబున నపత్యధనధాన్యధర్మపశుక్షేత్రంబులు మొదలైన కోరికలు సిద్ధించు
షట్కర్మంబులకును మూలంబు స్నానంబె కావునఁ గృతస్నానుండవై ధర్మంబులు
నడుపు మనినఁ గృష్ణునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 163

క. నీయెఱుకఁబడనియర్థం, బేయుగములయందు దొరక దిసుమంతైనన్
గాయత్రీజపపరులకు, నేయేలోకములు గలుగు నెఱిఁగింపు హరీ. 164

వ. అనినఁ బాండవాగ్రజునకు గదాగ్రజుం డిట్లనియె. 165

క. గాయత్రి శుభము లొసఁగును, గాయత్రి సమస్తదేవగతు లొనరించున్
గాయత్రికి సరిదొరకదు, గాయత్రీజపిత నన్నుఁ గనుఁగొనుచుండున్. 166

వ. అని గాయత్రీమాహాత్మ్యం బెఱింగించి 'బ్రహ్మయజ్ఞఫలంబు' వినుమని యిట్లనియె. 167

గీ. బ్రహ్మదేవుని రూపంబు బ్రహ్మయజ్ఞ
మెఱుఁగు ప్రణవంబు చేసి వ్యాహృతులు నొడివి
పాదపాదంబు గాయత్రి పఠికి పరుస
శ్రుతులు పఠియింపఁ దగు నిది హితము నాకు. 168

గీ. ఆగమోదిత మగు బ్రహ్మయజ్ఞ మాచరించువారల కెల్లను మించుఁ దపము
బ్రహ్మతేజంబు ధర్మంబు బలము యశము, పాపములు వోవు దేవతాపదవి దొరకు.

వ. వైశ్వదేవం బొనరించి శాస్త్రోక్తప్రకారంబున బలికర్మం బాచరించినఁ ద్రిదివంబు గలుగుఁ దద్విధానంబు వినుము. 170

గీ. పుడమిఁ గోరినఁ డెక్కెంబు పోల్కి సుతుల, మేలు వాంఛింప శూర్పవల్మీకరణి
వైభవముతోడ నన్నియుఁ వలయునేని, చక్రగతి మించు బల నాల్గుచందములను.

క. నీ కొనరింపఁగఁ దగుఁ జ, క్రాకారపు బలి మనోరథార్థము లెపుడుం
జేకూరుఁ గీర్తి యబ్బును, వైకుంఠపురంబు దక్కు వసుధాధీశా. 172

వ. నన్ను ధ్యానంబు సేయుచు భోజనసమయంబున మౌని యై సంస్కృతవచనుండునై ద్విజుండు భుజియించి యమృతత్వంబు నొందు ముప్పదిరెండు కబళంబులు గొన్నవాఁడు గంధర్వులు సేవింప సురలోకంబున నుండు మితాహారుండు నిరామయుండు నగుచు నపరసంధ్యను సావిత్రిం బ్రార్థించునతండు పుణ్యలోకంబుల నిచ్ఛావిహారంబులం బ్రవర్తిల్లుచుండు. 173

సీ. దైవతమునిపితృతర్పణము లొనర్చి కమలబాంధవుని కర్ఘ్యములు నుతులు
గావించువారలు కాలకాలంబుల దేవతాగృహయాత్రఁ దేలువారు
పురుషసూక్తవిధానమున మందిరంబున హరిహరపూజల నలరువారు
మదము మాత్సర్యంబు మాని యందఱపట్ల సము లౌచు హితములు సలుపువారు

గీ. పరధనస్త్రీల కెపు డాసపడనివారు, యోగ మభ్యస్తముగఁ జేయ నోపువారు
సకలలోకంబువారును సన్నుతింప, నాపురంబున నుందురు నరవరేణ్యా. 174

వ. అని కృష్ణుం డానతిచ్చిన సకలధర్మంబులు విని సంతుష్టాంతరంగుండై యుధిష్ఠిరుం డిట్లనియె. 175

గీ. అవని ద్విజాదివర్ణంబు లాశ్రమంబు, లెల్ల యాచారకర్మంబు లెట్లు నడువ
వలయుఁ గరుణారసంబునఁ దెలుపు మయ్య, పుండరీకాక్ష గోవింద పుణ్యపురుష.

వ. అనిన యుధిష్ఠిరునకుఁ గృష్ణుం డిట్లనియె. 177

సీ. తపమున జపమున ధర్మవర్తనమున నవనీసురుఁడు పూజ్యుఁ డఖిలవర్ణ
ములకెల్ల గురుఁ డగుఁ బుణ్యశీలురు సర్వశాస్త్రవిశారదుల్ సత్యమతులు
స్వాధ్యాయపరులును సన్మార్గనిరతులుఁ బౌరాణికులుఁ బితృభక్తు లతిథి
పూజానురక్తులు బోధానిధానులు ధర్మనిర్ణేతలు ధార్మికులును

గీ. సోమయాజులు ముక్తిని బూనిఁ గొందు, రెవ్వఁడు విద్యాముఖంబున నెప్పుడు వెలఁగు

నతఁడు గంగాది నిఖిలతీర్థాంబు సేచనం బొనర్చినవాఁ డగు నరవరేణ్య. 178

గీ. విద్యచేఁ గల్గు ద్రవ్యంబు విప్రులకును, రంజనార్జితవస్తువు రాజులకును
శేరమాడిన యర్థంబు లూరుజులకుఁ, గృషిధనంబు కాఁపులకును గీర్తికరము. 179

వ. క్షత్త్రియవైశ్యశూద్రులకు బ్రాహ్మణుండు గురువు అతనికిచ్చిన నతనిచేత దానంబు వట్టిన మే లగు శ్రోత్రియాన్నంబు భుజియించినవారలకు జన్మజన్మాంతరంబుల బ్రాహ్మణత్వంబ సిద్ధించు సర్వజ్ఞుండును విష్ణుభక్తుండును విద్వాంసుండును జ్ఞానియుఁ బురాణసంహితాపత్తియుం నై శ్రోత్రియుం డనం బరఁగు నట్టిఘనుండు పాపంబులఁ బరిహరించి సురలోకంబునం బ్రవర్తించు నేనట్టివారల యిష్టంబు చేకూర్చుచుండు.

గీ. పదపదంబును విభజించి తుదయుం మొదలు, నేరుపడ శబ్దభావంబు లెఱిఁగి రాగ
సమితి నైనను శ్రీరాగసరణి నైన, సభ నుతింపఁ బురాణముల్ చదువవలయుం.

క. వేదవ్యాసమునీంద్రుఁడు, వేదంబులు శాస్త్రములును విష్ణుబ్రహ్మాం
డాదిపురాణంబులు సం,పాదించెఁ దదీయకథలు భద్రము లొసఁగున్. 182

## పురాణశ్రవణఫలము.

గీ. విమలధర్మకథల్ పురాణములు పలుకుఁ, గాన సంసారవారిధిఁ గడవఁగోరు
వారు వినదగుఁ దత్కథావర్ణనమునఁ, బూర్వజన్మార్జితాఘము ల్వ్రాలియుంకతన. 183

వ. పురాణంబు విన్నమాత్రంబున జ్ఞానాజ్ఞానకృతంబులైన పాపంబు లణంగు గంగాదిస ర్వతీర్థస్నానఫలంబులు సమకూరుఁ బ్రభాతంబున వినిన రజనీకృతపాపంబులు నిశాస మయంబున నాకర్ణించిన దివారచితకిల్బిషంబులును దొలంగు నిత్యశ్రవణంబు గావించువారలు మహాభయంబులు వోకార్చి బ్రహ్మలోకంబు నొందుదురు నీవు పురాణంబులయందు బుద్ధి నిలుపు మిష్టార్థంబులు సిద్ధించు. 184

సీ. అపరాధముకొలంది నాజ్ఞ సేయుచును భుజాబలంబున మించుక్షత్త్రియులకు
సద్వర్తనంబున సత్యంబు దప్పక శేరమాడుచునున్న యూరుజులకు
వ్యవసాయములు చేసి యనిశంబు ధారుణీసురుల సేవలు సేయు శూద్రులకును
స్వాధ్యాయనిరతి భిక్షాశి యై గురునాజ్ఞ మీఱకుండెడి బ్రహ్మచారికిని

గీ. నతిథిపూజలు సలుపు గృహస్థులకును, భక్తిఁ ద్రిస్నాత లగువనప్రస్థులకును
ధ్యాననిష్ఠాగరిష్ఠు లౌ మానులకును, బరమపద మాటపట్టగుఁ బార్థివేంద్ర. 185

క. పతిమాట కడుగు దాఁటక, పతియే దైవమును గురువు బంధువునుం గాఁ
బతిఁ దలఁచుపతివ్రతకుక్, సతమా బ్రహ్మాదిలోకజాలము లెల్లన్. 186

గీ. విప్రవర్గంబు మొదలగు వివిధవర్ణ,ముల జనించిన స్త్రీలకుఁ బురుషులకును

ధర్మమేగతి యది నీవు తలఁచు నేయం,మెపుడు వినుము పురాణముల్ నృపవరేణ్యా.

వ. పురాణధర్మశాస్త్రంబులు కీర్తించినవారికి వినినవారికి నరకంబులు లేవు నాలోకంబు సిద్ధించు. 188

క. లోకంబులఁ బుట్టింపను, లోకంబులఁ బ్రోదిసేయ లోకము లణఁపన్
నాకొక్కనికే భారము, నాకన్యము లేదు కొలువు నన్ను మహీశా. 189

క. తెలిపితిని ధర్మసారము, తెలుపంగలయంత నీకుఁ దెల్లమ్మింకం
దెలియఁగల వేమి వలసినఁ, దెలిపెద నీతలఁపు నాకుఁ దెలుపు నృపాలా. 190

వ. ఈకథలు విన్నవారికి సకలపాపంబులుఁ దొలంగు గంగాస్నానఫలం బగు నని లోకరక్షకుం డైన పుండరీకాక్షుండు ధర్మరాజున కెఱింగించినచందంబు వైశంపాయనుండు జనమేజయునకుం దెలిపినట్టు సూతుండు శౌనకాదులకుం బలుకుటయును.

క. శాశ్వతజయ జనకసుతా, ధీశ్వర రాజాధిరాజ హిమవత్పుత్రీ
విశ్వాసభక్తవరద మహేశ్వరవినుతప్రతాప యినకులదీపా. 192

మ. శబరీపూజితపాద సాధుజనరక్షావీక్షణాప్తోద్భవ ఖ
ద్గబలిప్రాపితరావణాది నిఖలక్రవ్యాద సీతాసతీ
కబరీభార దరప్రసూన ఘటనాకల్యాణ పాణిద్వయా
విబుధార్థప్రతిపాదనాది పురుషావిర్భావ భాగ్యోదయా. 193

మాలిని. దినకరశతతేజా దీనమందారభూజా
ఘనసదృశశరీరా ఖండితారాతివీరా
ధనపతి సమదానా ధర్మచేతోనిదానా
కనకమృగవిరామా కాంతిసంపూర్ణసోమా. 194

గద్యము. ఇది శ్రీమన్మదనగోపాలలీలావలోకన పవిత్ర శరణయామాత్యపుత్ర సకల విద్యానిధాన తామరపల్లి తిమ్మయప్రధానప్రణీతం బైన హరివంశోదితం బైన యాశ్చర్యపర్వంబునందలి శేషధర్మంబున, సత్యప్రశంసయు నభయదానంబును భూదానంబును బథికదేవతాగృహారామ నిర్మాణంబును దులసీ పద్మవనంబుల మహిమయుఁ బూజాభిషేకఫలంబును దీపదానమాహాత్మ్యంబును బ్రాహ్మణప్రభావంబును గంధపుష్పతాంబూలదానవర్ణనంబును గాయత్రీలక్షణంబును వైశ్వదేవప్రకారంబును బురాణంబుల లక్షణంబును బతివ్రత యున్నతియు నను కథలం గల ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము.



క. కాకుత్స్థకులాబ్ధిసు
ధాకర బహుదానధర్మధర్మార్జికృతా
నేకనిరంతరపూజా
స్వీకరణమనస్సనాథ శ్రీరఘునాథా. 1

వ. విన నవధరింపు మఖిలపురాణవ్యాఖ్యానముద్రాసమేతుం డయినసూతుండు శౌన
కాది మహామునులకు మున్ను యుధిష్ఠిరునకుం గృష్ణుం డానతిచ్చిన ప్రకారంబున
జనమేజయునకు వైశంపాయనుం డెఱింగించె నని బోధించి మఱియు నిట్లనియె. 2

క. మురహరుఁ డీగతిఁ గరుణా, పరుఁడై ధర్మములు దెలియఁ బలుకంగ యుధి
ష్ఠిరుఁడు విని మఱియుఁ దత్పద, సరసిజముల కెరఁగి యడిగె సమ్మోదమునన్. 3

గీ. వలయుధర్మంబు లెల్లను దెలిపి తింకఁ, బాపములఁ బాపకర్ములు పాలువడిన
లోకముల యాతనల్ దయ నాకుఁ దెలుపు, వరద వైకుంఠ వనమాలి వాసుదేవ. 4

వ. అని యడిగిన యుధిష్ఠిరునకుఁ గృష్ణుం డిట్లనియె. 5

గీ. పాపభేదంబులకు నెల్లఁ బాలువడిన, నరకలోకంపుయాతనల్ కర మెఱుంగఁ
బలికెదను నీవు ధైర్యంబు పట్టువదల, కాలకింపుము కుంతీసుతాగ్రగణ్య. 6

## మహాపాతకలక్షణము.

వ. బ్రహ్మఘ్నుండును, సురాపానం బొనర్చినవాఁడును, సువర్ణంబు దొంగిలిన యతం
డును, గురుతల్పగుండును నను నీ నలువురు మహాపాతకులు వీరలతోడం గూడినవాఁ
డైదవవాఁ డగు వారలపాపంబులు లెక్కింప శక్యంబులు గావు. అయినను
దోఁచినచందంబునం బలికెద సావధానంబుతోడం జిత్తగింపుము. 7

సీ. కాలశూలంబులఁ గడుదవ్యమానుఁడై వ్యాఘ్రము ల్భక్షింప నయుతసంఖ్య
ములు కావరేయని మొఱ్ఱఁ బెట్టుచు నుండి యంత కుంభీపాక మనెడినరక
మునను మహాగ్నిలోఁ బొరలుచు దివ్యహాయనసహస్రంబులు విననుగనను
శక్యము గానట్టి సర్వదుఃఖంబులఁ బొంది యాతరువాత భూమిలోన

గీ. నఖిలచండాలయోనుల నవతరించు, బ్రహ్మహత్య యొనర్చిన పాపకర్ముఁ
డతని యిడుమలు లెక్కింప నలవి యగునె, లలితగుణగణ్య కౌరవకులవరేణ్య. 8

గీ. కన్నుఁగవ సూది గోరుల గసికఁ గొట్టి
మలము మూత్రంబుఁ ద్రావించి మాటిమాటి
కగ్నిఁ బడవైచి వేఁతు రాయమునిభటులు
మద్యపానంబు చేసిన మానవులను. 9

క. నిష్కత్రయము సువర్ణము, నిష్కారణ మపహరించు నీచున కెందున్
నిష్కృతి దుర్లభ మతఁడు బహిష్కృతి కర్హుండు ధారుణీశ్వరతిలకా. 10

వ. సువర్ణస్తేయంబున మూషకపరిపూర్ణం బైన కూపంబున శూలయంత్రంబున శునకంబులు భక్షించుచుండ నేనూఱుయుగంబు లుండి కిరాతయోనులం బుట్టుచుండు జ్యేష్ఠమాతయుం భ్రాతృపత్నియుం సోమయాజులబోటియు నధ్యాపకుని కాంతయుం మేనమామ కామినియు నత్తయుఁ దల్లితోఁ బుట్టినయువతియు నార్యపత్నీసుతలును గురుతల్పసమానులు వీరలం బొందిన పాపంబు మన్వాదిశాస్త్రచోదితంబైన ప్రాయశ్చిత్తంబు లొనర్చికొన్న నయినం బరిహారంబులు గావు గురుదారాభిగామి మహారౌరవంబులం బడి నూఱు యుగంబు లుండి తదనంతరంబ యసిపత్రవనంబున నేఁబదియుగంబులు నివసించి యంతట యమదూతలు సద్ద్రావణం బయిన మేహనంబుఁ గోసి దోసిటం బెట్టి తైలవస్త్రంబుల బంధించి వహ్నిజ్వాలల వేఁచుచుండ ననుభవించి యామీఁద రాక్షసుం డగు నంత శునకోలూక గార్దభయోనులఁ గ్రమంబున జన్మించి నపుంసకత్వంబునం జరించుచుండు. 11

సీ. ఋతుమతిఁ బొందిన మతిహీనుఁ డెంతయు రక్తకూపముల నిర్మగ్నుఁ డగును
శూద్రచాండాలాదిసతులఁ గూడినవాఁడు శునకమాంసాశియై సొదలుఁ జొచ్చు (?)
విశ్వసించినవాని వెలఁదిఁ బొందినఁ దుల్యపృథుశిలాపాతనపీడ నొందుఁ
బణ్యభామాసక్తిఁ బరఁగిన పాపుండు ఋష్యవ్రాదంబులో నెపుడు నిలుచుఁ

గీ. బరులకాంతల బలిమిని బట్టుకొన్న, వారిదుర్గతి లెక్కింప వశముగాదు
తన్ను నేలినభూపతితరుణిఁ గవయుం, నీచుఁ డుండును గడలేని నిరయమునను. 12

గీ. ఒక్కయేఁడాది వీరితో నున్నవాఁడు, నరకమార్గంబు లాయాతన ల్భజించి
పుల్కసాదికదుర్జాతిఁ బుట్టిపుట్టి, ఘోరదుఃఖంబుఁ గుడుచును గురువరేణ్య. 13

గీ. పఙ్క్తిభేద పృథక్పాకి బ్రహ్మనిందకుం డనాదేశి శ్రుతు లమ్ముకొన్నవాఁడు
నమితయుగములు కుంభిపాకమున నుండి, పుడమి సంకరజాతులఁ బుట్టుచుండు. 14

సీ. ఇచ్చెద నని పిల్చి హీనుఁడై బ్రాహ్మణజనులకు లేదు పొ మ్మనెడివాఁడు
హితవును ధర్మంబు నెఱిఁగించువారిఁ బూజింపక ద్వేషంబు సేయువారు
గోవృషద్విజవధూకులములయాహారములకు విఘ్నంబులు దలఁచువారు
తనువిశ్వసించిన జనములపట్లను వంచనతోఁ గీడుఁ గాంచువారు
గీ. బ్రహ్మహత్యాసమంబైన పాపమొంది, కఠినతరులైన కాలకింకరులచేత
బ్రహ్మకల్పాంతరంబు లాపదలఁ బడుచు, ఘోరనరకంబులం దుండ్రు కురువరేణ్య. 15
గీ. బ్రాహ్మణోపేక్షకారులుఁ బాపచింత, దెలుపువార లసత్యంబుఁ బలుకువారు
మర్మభేదు లసూయచే మలయువారు, బ్రహ్మహంతృసమానులు పార్థివేంద్ర! 16

వ. బ్రహ్మహత్యాసమంబు లయిన పాపంబు లాచరించినవార లందఱు శునకంబులచేత భక్షితులగుచు రౌరవాదినరకంబు లనేకయుగంబు లనుభవించి వరాహగార్దభచండాలాదియోనులం బుట్టుచుందు రిది యెఱింగి బుద్ధిమంతులు పాతకంబులు స్మరియింపరు. ఈయుపాఖ్యానంబు విన్నవారికి గంగాస్నానఫలంబు సిద్ధించు నింక సురాపానసమంబు లయిన కిల్బిషంబులు వివరింతు వినుమని యుధిష్ఠిరునకుం గృష్ణుం డిట్లనియె. 17

గీ. పతితసూతకదేవలయతిగణాన్నములు భుజించిన నెంగిలి ముట్టుకొనుచు
నైన ఋతుమతి వాక్యంబు లాలకించి, యైన నశనంబుగొన సురాపానసమము. 18
క. శూద్రుండు పిలిచె నేనియు, శూద్రుం డనుమతి యొసంగ శూద్రుఁడు చూడన్
శూద్రునియింట భుజించిన, శూద్రాదికనీచజాతి సుడిగొండ్రు ద్విజుల్. 19
గీ. జపము హోమంబు ధ్యానంబు సలుపుతఱిని, భక్ష్యపానీయచోష్యముల్ పాయసంబుఁ
బుచ్చుకొనువేళ శూద్రులఁ బొసఁగఁ బలుక, రించువారలపాపంబు లెంచ నరిది. 20
క. ఎంగిలి దాఁకుచు నన్నము, వెంగలియై మెసవునరుని వెంటంబడి స
ర్వాంగంబులు యమకింకరు, లంగారంబులను వేఁతు రనవరతంబున్. 21
గీ స్నేహమున నైన లోభంబుచేత నైన, నలసి యైనను బొత్తుల నారగించు
జనుఁడు శ్లేష్మంపుముద్దలో శతయుగములు, పొరలి కడపట శునకమై పుట్టుచుండు. 22
గీ. ద్విజుఁడు భుజియించుతఱి బహుదేశభాష
ణములు పలికిన లశునద్వయమును గృంజ
నంబు నింద్యము సూతకాన్నంబుఁ గొనిన
ఘోరనరకంబు పాలయి కుందుచుండు. 23
గీ. తల్లిదండ్రులు కొడుకులు దాత మనుమ, లాఁడుబిడ్డయుఁ దోఁబుట్టు పత్తమామ

లైనఁ బొత్తున భుజియింప నధిక పాప, మవనిసురునకు వచ్చునైనయంతమీఁద. 24

వ. ఇవి యన్నియును సురాపానసమంబు లింక సువర్ణస్తేయసమానంబులు వివరించెదం జిత్తగింపుము. 25

గీ. మణులుఁ గోకలుఁ గస్తూరి మలయజంబుఁ, గప్పురంబును హరియించు మొప్పెల్ల
నేకవింశతియుంగము లనేకనరకముల వసించియుఁ గాకులై పుట్టుచుండ్రు. 26

గీ. కంచు సీసంబు రాగి యిణంచుకొన్న, యతఁడు వైశ్వానరజ్వాల యనెడినరక
మునను వేఁగుచు యుంగముండి శునకయోని, జన్మశతమెత్తి మేఁకయై సంభవించు.

వ. కదళీపనసనారికేళామ్రతసారంగలికుచంబులు హరించినవాఁడు శిలావృష్టియను నరకంబునం గల్పపంచకంబు వసించి తదనంతరంబ పిశాచత్వంబు నొందు గృహక్షేత్ర గోధాన్యమహిషతురంగగజమేషంబుల దొంగిలినవాఁడు తప్తశిలయందు యమకింకరులు బాధింప యుగపర్యంతం బనుభవించుచుండి తప్తశంకుయశపిండభక్షణాధశ్శోణమరుత్పతనంబు లనునరకంబుల నూఱుయుగంబు లుండి దరిద్రుండు నామయగ్రస్తుండు మూఁగయునై భూలోకంబున సంభవించు. 28

గీ. అడవిలోనున్న తృణమైన నన్యధనముఁ, బట్టఁ దగ దెందు నరునకుఁ బట్టెనేని
గాంచనస్తేయదోషంబు గలుగు నతని, కిపుడు చెప్పిననరకంబు లెల్ల నిజము. 29

వ. సువర్ణస్తేయసమానంబులైనవి యెఱింగించి యింక నుపపాతకంబులు నరకంబులు వివరించెదఁ జిత్తగింపుము పితృయజ్ఞపరిత్యాగియుం నకాలకర్మకర్తయుం మాతాపితృవిరోధియుం నంగారశయనం బనునరకం బయిదుయుగంబు లనుభవించి క్రమంబున వాయసంబగు నిష్ఠురవచనుండు నాస్తికుండు ప్రాణిహింసకుండు దుర్జనుండు కాముకుండు నత్యుష్ణసికతాస్నానంబు కషాయోదకసేచనంబుఁ దప్తాయశ్శయనంబు మొదలయిన బహువిధఘోరనరకంబుల నిరువదియొక్కయుగం బనుభవించి రాక్షసులై జనియింతురు బ్రహ్మహత్యాదిపాతకంబుల కొక్కచందంబుల నిష్కృతి కలిగెనేని యుఁ గలుగుఁ బ్రాయశ్చిత్తంబు లేనిపాపంబులు చిత్తగింపుము. 30

గీ. బౌద్ధగృహవర్తి తచ్ఛాస్త్రపాఠకుండు, శూద్రకాంతానురక్తుండు శ్రుతుల నింద
నొనర వచియించువాఁడు నవనిసురులకుఁ, గీడుఁ గావించువాఁడు నిష్కృతులుగనరు.

గీ. కోపదృష్టిని బ్రాహ్మణకులము దుర్నిరీక్షణము సేయుం నాతనియక్షియుంగళి
నెడములేకుండఁ గ్రాఁగిన యినుపసూదు, లద్భుతముగాఁగ నింతురు యమునిభటులు.

వ. ఈచందంబున బహువిధపాపంబులు మునీంద్రులచేత నెఱింగింపఁబడియె నివి విన్నఁ భక్తియించినవార్కికి వీనియందు మతిపోడమ దని ధర్మరాజున కెఱింగించినం దృప్తి

చాలకయున్న పాండవుల నందఱం గనుంగొని సవిస్తరంబుగా నెఱింగించువాఁడై
కృష్ణుం డిట్లనియె. 33

గీ. అనృతవాదుల కొండెల యన్యమంది, రాన్నభోక్తల మర్యాద నడఁచువారి
విశ్వసించినచోఁ ద్రుంచివేయునట్టి, ఖలుల జిహ్వలు గోఁతురు కాలభటులు. 34

గీ. వేదనిగదితకర్మము ల్విడిచి తిరుగు, వారిఁ గొమ్ములఁ గోరాడు వారణమ్ము
లగ్రహారాధికారులు నధికనరక, పటలిఁ జెందుదు రైదుకల్పములదనుక. 35

గీ. అగ్రహారంబు కానుక లడుగఁదలఁచు, నతని కబ్బును బ్రహ్మహత్యాయుతంబు
లతిథిపూజలు వర్జించి యన్న మారగించువారికిఁ బాపంబు లెంచ నరిది. 36

వ. అయోనియందునియోనియందుం బుణ్యయోనులయం దేని నింద్రియస్ఖలనంబు సేయు
వాఁడు రేతో భోజనం బొనర్చుచు నస్థిచ్ఛేదమూత్రపానాదినరకంబులం బదివేల
యుగంబు లనుభవించి యంత వేశ్యాపుత్త్రుం డగు నుపవాసదినంబునం దంతధావ
నంబు చేసినవాఁడు వ్యాఘ్రభక్షుం బనుదుర్గతిం జతుర్యుగంబు లుండు నేకాదశీదినం
బున నుపవసింపని నరుండు డెబ్బదియేనుయుగంబులు యాతన లనుభవించుచుండు
స్వదత్తం బయిన క్షేత్త్రం బపహరించినవాఁడు కోటికులసంయుక్తుండై కల్పపర్యం
తంబు నిరయంబుం జెందు. 37

గీ. భూసురక్షేత్రము హరించు బుద్ధి నెవ్వఁ, డడ్డపెట్టును వానిని యమునిదూత
లినుపఱోళ్ళను బడవైచి యినుముగాఁగఁ, గ్రుమ్ముచుందురు సతతంబు గోడుగుడువ.

గీ. ఒరులు వేసిన తోఁపులో నున్నపూలు, దేవపూజావికల్పనఁ దెచ్చువారి
నగ్నిశిఖలందుఁ బడవైచి యమునిభటులు, వేఁతు రెంతయు యుగమెల్ల వెల్లదనుక.

ఆ. అంబులను సురాలయములను వనభూమిఁ, గూపవహ్నిధూమగోష్ఠములను
గోశిలామహీజకుశసస్యవల్మీకములను మలము విడువ మొనయు నఘము. 40

సీ. వమనంబు క్షుత మధోవాయువు శ్లేష్మాశ్రుపతనంబు కేశనిపాతనంబు
నమర గృహంబులయందుఁ జేయఁగరాదు సత్కథాశ్రవణము ల్సలుపువారు
కూటసాక్షులు సొమ్ముఁ గొనఁ బల్కఁ జెల్లదు కల్లలాడిన నంతకన్నఁ గీడు
ద్విజులవహ్నిని బాలవృద్ధుల నభ్యాగతుల మాని భుజియింప దోష మధిక

గీ. మన్యజలముల విత్తంబు లపహరించి, పరుల కొసఁగుట పాపంబు పాలుపడుట
గాని పుణ్యంబు ధనకర్తకడఁ జెలంగు, నితరనిందయు నాత్మసన్నుతియుఁ గీడు. 41

గీ. జన్మనక్షత్త్రములయందు సంధ్యవేళ, వైధృతినిఁ జతుర్దశిఁ బితృవాసరమునఁ
గాంతఁగూడెడుమూర్ఖు మొగమ్ము నిండి, పాములను బోలుజలగలు బాధపెట్టు. 42

క. ఋతుకాలము వచ్చినసతి, రతిసలుపక యున్నవాఁడు బ్రాహ్మణహత్యా
యుతుఁడౌచు రౌరవాదుల, నతిబాధలఁ బడుచునుండు యమదూతలచేన్. 43

వ. అష్టమి దివా సంక్రాంతి వ్యతీపాతచతుర్దశి వైధృతిపర్వంబుల ఋతుసమయంబుల నిశాత్రితయంబులఁ బితృదినసంధ్యాజన్మనక్షత్రంబుల నిజకాంత నైనం బొందుట యర్హంబుగాదు మోహంబునం గూడెనేని రౌరవంబులఁ బడుఁ బుత్రుండు గలిగిన దురాచారుండును మూర్ఖుండును వ్యాధిపీడితుండు నల్పాయుష్కుండుఁ గృతఘ్నుండు బ్రహ్మద్వేషియు నై జనించు. 44

సీ. శక్తుఁ డయ్యును దురాచారంబు మాన్పని యతని దద్దోషార్ధ మందియుండు
లేనిపాపము లెన్నుమానవాధము జిహ్వ యమభటుల్ చిదుముదు రనుదినంబుఁ
గన్యతో రమియించుకలుషాత్మకునిబట్టి భక్షింతు సతతంబుఁ బక్షివితతి
పూనినవ్రతమును బూర్ణంబుసేయని జను నొంతు రసిపత్రవనములోనఁ
గీ. దగవు దిద్దుచుఁ బక్షపాతమునఁ బల్కు, జడుని నత్యుష్ణసైకతస్థలమునందు
మిగుల వేఁతురు పదివేలయుగములెల్ల, నంతకంతకుఁ గుంతీసుతాగ్రగణ్య. 45

సీ. తల్లిని దండ్రిని దైవంబు నతిథుల నొగిఁ బూజసేయక యుండువారు
రేపును మాపును నోపిన కైవడి దినముఁ బురాణము ల్విననివారు
దేవతాభాషలు దిగఁద్రావి యన్యభాషలశాస్త్రము ల్గోని చదువువారు
ధర్మమార్గంబులు దప్పించువారలఁ దెలిసియుఁ వెంబడిఁ దిరుగువారు
గీ. వెంగిలికి రోఁతపడక మెసఁగువారు, గానవిద్యలపైఁ బ్రేమ గలుగువారు
విష్ణునామత్రయజపంబు విడుచువారు, నిరయమార్గానువర్తులు నిశ్చయంబు. 46

వ. అనినం గృష్ణునకుఁ యుధిష్ఠిరుం డిట్లనియె. 47

## నిమంత్రణబ్రాహ్మణనిరూపణము.

క. తెలిసెను ధర్మాధర్మంబులు పైతృకకర్మమునకుఁ బూజ్యు లపూజ్యుల్
గల రందు రట్టివారలఁ, బలుకం గదవయ్య కృష్ణ పంకజనాభా. 48

వ. అనిన ధర్మనందనునకు వాసుదేవుం డిట్లనియె. 49

క. పితరులదినమునను నిమంత్రితుఁడై భుజియించుధరణిదేవుని పితరుల్
హతపుణ్యు లౌచు నమరావతి నున్నను నరకమునను వ్రాలుదు రధిపా. 50

సీ. వేదశాస్త్రవిహీను విగతజపస్నాను గర్షకు మూర్ఖునిఁ గఠినుఁ బతితు
నామయగ్రస్తు మర్యాదవిడుచువాని వైశ్యవర్తను వైద్యు వస్త్రరహితు

దత్తవిక్రయుని గృతఘ్ను గాయకు మత్తు గురునిందకుని షండుఁ గుటిలు మూఁగ
శూద్రసంయుక్తుని సూతకు హీనాంగు వృషలీపతిని వృద్ధు వేషధారిఁ

గీ. గొండెగానిని జూదరిఁ గ్రూరకర్ముఁ, దల్లిదండ్రులచేఁ బరిత్యక్తుఁ డయిన
వాని బహ్వాశి సన్న్యాసి వాదనిరతుఁ, గవ్యభుక్తికిఁ బిలిచినఁ గలుష మొందు. 51

గీ. వేదశాస్త్రజ్ఞు శ్రోత్రియుఁ వీతరాగు, జపము స్నానంబు సంధ్యయుఁ సలుపువానిఁ
బంచయజ్ఞపరాయణుఁ బరమశాంతి, కలితుఁ బిలువంగఁదగుఁ బితృకర్మమునకు. 52

వ. అనిన విని వర్జనీయంబు నెఱింగింపవే యనిన యుధిష్ఠిరునకుఁ గృష్ణుం డిట్లనియె

ఉ. పాతకవర్తి పొత్తు సుతబంధుజనంబులతో విరోధమున్
సూతకు దర్శనంబుఁ బరసుందరితో సహవాసమున్ సదా
చేతులదాటిపోవుటయుఁ జివ్వన వృక్షశిఖాగ్ర మెక్కుటల్
నూతి జలంబు ద్రావుటయును న్సుశుభార్థికి వర్జనీయముల్. 54

గీ. అప్పునేయుట క్షేత్రంబు లమ్ముకొనుట, సంధ్యవేళల నిద్రయుఁ జదువు భోజ
నంబు నిజదారఁ గూడుట నాథభృత్య, బంధువులతోఁ గలహము శుభాన్యకాంక్షి
యెఱిఁగి యెఱిఁగియుఁ వీనిఁ బరిగ్రహించు. 55

గీ. తోఁటలోపల నడవుఁ ద్రోవ యాత్ర
దేవసన్నిధిఁ గొండల దీర్థములను
బర్వములయందు సంధ్యలఁ బణఁతి గవయఁ
గాదు శుభకాంక్షి కెందును గౌరవేంద్ర. 56

గీ. అన్న ముదకంబు విద్యంబు నంబరములు, శూద్రుఁ డిచ్చినఁ దత్కృతసుకృతపాద
మస్తకాభ్యంజనంబులు మానవలయు, సకలశుభములు వాంఛించు జనుల కెల్ల. 57

క. గురుకవిరవిభూమిజవాసరముల నభ్యంజనంబు సకలామయభీ
కర మాతెఱఁగు నిశీథినిఁ, బరిహరణీయంబు లెన్నిభంగుల నైనన్. 58

గీ. స్థండిలమునందు శయనంబు జపము భోజ, నంబు మైథునమును బూజనంబు ధ్యాన
మును నొనర్తురు శ్రేయంబు మొనయువారు, కాన ధర్మంబుఁ గావింపు కౌరవేంద్ర.

క. ఈకథ విన్నఁ బఠించినఁ, బ్రాకటధనధాన్యపుత్రపౌత్రసమృద్ధుల్
చేకూరుఁ గీర్తియబ్బును, వైకుంఠపురంబు చాల వశవర్తియగున్. 60

వ. అనిన విని సర్వంబు నెఱింగించితి వైన నింకొక్కటి తెలియ వేడుక యయ్యెడు
ననామయదేహు లబ్బునను నరకంబులు పాపకర్ములకు భయంకరంబును బుణ్యాత్ము

లకు సుఖప్రదంబును నైనయమమార్గంబు విస్తారం బెఱింగింపవే యని యడిగినయు
ధిష్ఠిరునకుం గృష్ణుం డిట్లనియె. 61

క. నరకంబులనామంబులు, పరికింపఁగ లెక్కపెట్టఁ బద్మజునకు గో
చర మైనవానిలోపలఁ, దిరము ల్వివరింతు వినుము దృఢతరబుద్ధిన్. 62

వ. పవనంబు వాలుకాభంబు మహారౌరవంబుఁ గాలసూత్రంబుఁ బ్రమర్దనంబు భీమో
త్కటంబు మహాశూలంబు మూషకకూపంబు పురీషమంత్రపానంబు వైతరణీ మహా
స్వనంబుఁ దప్తశూలంబుఁ దప్తశిలాపురీషభారంబు గజశోణితకూపంబు మలశోణిత
భోజనంబు శ్వమాంసభోజనంబు వహ్నిజ్వాలాప్రవేశంబు శిలావృష్టి శస్త్రవృష్టి
వహ్నివృష్టి మరుత్పతనంబు క్షారోదకంబు ఉష్ణతోయంబు తప్తాయఃపిండభక్ష
ణంబు తప్తాయుధశోషణంబు తప్తపాషాణగమనంబు పురీషలేపనంబు క్రకచధార
ణంబు రేతఃపాతనంబు మహానాదంబు సర్వసంధిదహనంబు అంగారశయనంబు కబం
ధగ్రామయంత్రంబు క్షణికచ్ఛేదనంబు పతనం బుత్పాదనంబు పాశబంధంబు
ధూమపానంబు శూలానురోహణంబు అస్థిచ్ఛేదనంబు విషస్నానంబు లవణభక్షణంబు
నాయుచ్ఛేదంబు శిలాక్రీడనంబు పాషాణధారణంబు శ్లేష్మమాంసాశనంబు యోగ్య
భారంబు వృక్షాగ్రపతనంబు జలాంతర్మజ్జనంబు కంటకోపరిశయనంబు తప్తశిలాంబు
సేచనంబు అత్యుష్ణసికతాన్నంబు వ్యాఘ్రరాక్షసపీడ తప్తపాషాణభక్షణంబు నివి మొ
దలైన నరకంబులు కోటికోటులు గలవు లెక్కింప శక్యంబులుగావు. యమమార్గంబు
విస్తారం బెనుబదియాఱుయోజనంబులు పుణ్యాత్ములకు సుఖకరంబును పాపకర్ములకు
దుఃఖప్రదంబును నై యుండు నందు ధర్మవర్తనులు గంధర్వులు నుతియింప నప్స
రోగణంబు సేవింప సుధాపానంబు నేయుచు స్వర్గమందిరంబున కరుగుదురు కిల్బిష
వర్తులు దుఃఖంబు లనుభవించుచు నుందురు వారి యాతనలు చిత్తగింపుము. 63

నరకమార్గప్రకారము.

ఉ. ఒక్కెడ బెబ్బులు ల్గవియ నొక్కెడ సింగములుం జరింపఁగా
నొక్కెడ నేనుఁగుల్ దఱుమ నొక్కెడ భీకరసూకరాళిపైఁ
ద్రొక్కఁగ రాఁగ నంతఁ దమదోసము తమ్ము నె ముంచెనంచు నే
దిక్కును లేక యేగుదురు దీనత నచ్చటఁ బాపవర్తనుల్. 64

క. సెలగోలల యమదూతలు, తలచూపఁగనిక త్రేయ దప్పివి బెదవుల్
సెలవులు సెండఁగ నాఁకట, మలఁగుచుఁ జనుచుంద్రు పాపమతు లాత్రోవన్. 65

మ. ఒకచో నిప్పులకుప్ప లొక్కతఱి ముం డ్లొక్కొక్కచో ధూమ మొ
క్కొక్కచక్కి న్నిబిడాంధకారపటలం బొక్కొక్కచో శైవలం
బొకపంక న్వడగండ్లవాన లొకచో నుష్ణాంబు లొక్కొక్కచో
నొకచో ఘోరసమీరముల్ దఱచుగా నుండుం దదీయస్థలిన్. 66

సీ. సారమేయోలూకజంబుకశబ్దంబు లొక్కొక్కచోటున నుప్పతిల్లుఁ
గంటకాంగారకకరకాదివర్షంబు లొక్కొక్కవంకను నుప్పతిల్లు
సంతప్తకర్దమసైకతగ్రావంబు లొక్కొక్కత్రోవన నుప్పతిల్లు
వాతశీతాతపవహ్నిసమూహంబు లొక్కొక్కయిక్కన నుప్పతిల్లు

గీ. ఒక్కచక్కిని చీఁకటు లొక్కత్రోవఁ, జటులవృశ్చికపన్నగసముదయమ్ము
లొక్కతఱి నాచుపెంచులు నుప్పతిల్లుఁ, బాపవర్తను లరిగెడిపద్ధతులను. 67

ఉ. కొందఱు ముక్కుఁ గుట్టుచును గొందఱు చేతుల నూలువోసియుం
గొందఱుఁ గంఠపాశములఁ గొందఱ నుగ్రగదాశరాహతిం
గొందఱి ముష్టిఘట్టనలఁ గొందఱ శూలములందు గ్రుచ్చుచుం
గొందల మందఁజేయుదురు క్రూరులు కాలునిదూత లచ్చటన్. 68

వ. కొందఱు కంఠపాశహస్తనాసాగ్రంబులు పాశంబులచేఁ గప్పంబడియుఁ గొందఱు సితాంకుశగదాఖడ్గతాడనంబుల కుందుచును గొందఱయోభారంబులు మోహనాంగంబుల వహించుచుఁ గొందఱు బాధితలోచనులై సంతప్తకర్దమసైకతంబుల నిలువంబడుచును గొందఱు కాకగృధ్రోలూకసారమేయజంబుకగార్దభసింహవ్యాఘ్ర వృశ్చికంబుల నెక్కియాడుచును గొందఱు మేదోమాంసరక్తమూత్రపురీషంబులు పానంబుసేయుచుఁ గొందఱు వృషభమహిషఖడ్గశాకినీకూష్మాండరాక్షసగణంబులచేత భక్షితులగుచు జనకపుత్రమాతృప్రియాసంగంబులఁ జేరుకొని పలువరించుచు నిజకర్మంబులు మఱచియుఁ గొంద ఱెఱుఁగనివారై మౌనంబునం దన్మార్గంబున యమాలయంబున కరుగుదు రనిన విని సోదరసహితుండై భయంబున వణంకుచు మూర్ఛితుండైన యుధిష్ఠిరు నెఱింగి వెఱపకు నీకుఁ బ్రియంబుగాఁ బుణ్యాత్ముల మార్గంబు వివరించెద వినుమని దేవకీనందనుం డిట్లనియె. 69

క. ధర్మంబు సేయనేర్చిన, నిర్మలమతు లెల్ల విబుధనికాయము పొగడన్
ధర్మమయాంబరధరులై, శర్మస్థితిఁ జనుదు రెపుడు శమనునిపురికిన్. 70

## పుణ్యలోకమార్గప్రకారము

ఉ. అన్నము పెట్టువారల కృతాన్నముఁ దించు జలంబు దప్పికిం
గన్న మహామహుల్ మరుగఁ గాఁచిన యావుల పాలు ద్రావుచున్

వెన్నయుఁ దేనెయున్ ఘృతము వెచ్చమొనర్చు నరు ల్సుధారసం
బున్నతిఁ గ్రోలుచుం జనుదు రుగ్రకరాత్మజుఁ డున్నచోటికిన్. 71

సీ. హయగజమందిరయానంబు లొసఁగెడినరు లెల్ల మణివిమానంబు లెక్కి
యజఫలపుష్పకృష్ణాజినభూదానకర్తలు ప్రమదంబు గడలుకొనఁగ
వస్త్రదాతల హేమవసనము ల్ధరియించి దీపము ల్దివిటీలుఁ దేజరిల్ల
శాకప్రదులు పాయసంబు భుజించుచు గోత్యాగనిపుణులు కోర్కు లలర

ఆ. సర్వభూతకరుణ సల్పెడువారలు, విద్యనేర్పఁ జాలు విమలమతులు
సకలదివిజపతులు సన్నుతుల్సేయంగ, యమునిపురికిఁ జనుదు రవనినాథ. 72

గీ. అనుదినంబుఁ బురాణము ల్వినెడువారుఁ, జదువువారలుఁ బూర్ణిమాచంద్రధవళ
దివ్యయానంబు లెక్కియు దీప్యమానులగుచుఁ గైకొండ్రు వైవస్వతాంకతలము. 73

క. కృతయుగమున జ్ఞానము సం,తతతపములుఁ ద్రేతయందు ద్వాపరవేళం
గ్రతువులుఁ గలిని బురాణ, శ్రుతిపఠనము లిహపరైకసుఖము లొసంగున్. 74

క. కలియుగమునను బురాణం,బులు చదివిన విన్న జనులుఁ బుత్రులుఁ బౌత్రుల్
వెలయఁగ నిహసౌఖ్యంబుల, బలిసి తుదిం జేరువారు పరమపదంబున్. 75

క. తనకైన నొరుల కొఱకై,నను బుణ్యకథ ల్పఠించు నరుఁ డధికసుఖం
బునఁ బొందు దేవలోకము, మునిదివిజస్తుతులు దిశల మ్రోయుచునుండన్. 76

ఉ. కొందఱు దేవత ల్పొగడఁ గొందఱు దివ్యవిమానయానులై
కొందఱు వారణోష్ట్రవృషఘోటకబృందము నెక్కి యేఁగుచుం
గొందఱు దివ్యవస్త్రసుమనోమణిగంధము లొప్పఁ దాల్చియుం
బొందుదు రాయమాలయ మపూర్వసుఖంబునఁ బుణ్యవర్తనుల్. 77

ఆ. నిత్యదానపరులు నెమ్మితోఁ బాదోద,కంబుఁ గొనుచు విప్రగణముఁ బూజ
సలుప నమరసిద్ధసాధ్యులు నుతియింప, నాటుకొందు రెపుడు నాపురమున. 78

క. ఈరీతినిఁ బుణ్యాత్ములు, చేరుదు రంతకపురంబు సిద్ధం బెపుడున్
ధారణి ధర్మమె చెలికాఁ, డారయ నిహపరములొసఁగ నదియే చాలున్. 79

వ. ఈయుపాఖ్యానంబు విన్నవారలకుఁ బాపంబులు దొలంగు ననిన విని యుధిష్ఠిరుండు
మురహరున కిట్లనియె. 80

గీ. పాపవర్తనుఁ డధికపాపములు జేసి, నరకములఁ బొంది తొలఁగు నే సరణి నంతఁ
బక్షిమృగకీటముఖ్యగర్భముల వెడలి, యెట్లు చరియించు నెఱిఁగింపు మిందిరేశ. 81

## పాపకర్ములు వర్తించుప్రకారము.

వ. అని యడిగిన యుధిష్ఠిరునకుఁ బాపకర్ములు కర్మంబులనుండి జనియించి యేమి వర్తించు తెఱం గెఱింగించెద సావధానంబుగా విను మని కృష్ణుం డిట్లనియె. 82

సీ. నరకకూపములఁ జిరకాలము వసించి తమరు చేసినదుష్కృతమ్ము లెల్లఁ
బలుమాఱుఁ దలఁచుచుఁ బలవించి పలవించి దైవయోగమున భూతములఁ జేరి
తరుగుల్మవల్లికాగిరితృణాదికమైన స్థావరమై పుట్టి దావవహ్నిఁ
బొగిలియు వానిచేఁ బొలియుచు నెండల నెండుచు వానచే నిగురువెట్టి

గీ. యింధనము గట్టంగ బండ్లకై యింధనార్థ మఖిలజనులును ద్రుంచఁగ నఖిలదుఃఖ
మనుభవించుచు నేవకులై జనించి, నీచవృత్తిఁ జరించుచు నృపులచేత. 83

వ. రజ్జుదండకశాదిఘట్టనల గుట్టుచెడి శీతాతపంబుల నాతురులయి క్రయవిక్రయంబుల స్వజనంబులఁ బాసి పరదేశంబులం దిరుగుచుఁ బ్రాణంబుల విడిచి తిరుగజన్మించుచు నూఱుకోట్లజన్మంబు లెత్తి యంత దైవయోగంబునఁ బూర్వజన్మఫలంబున మానుష త్వంబు భజియించి బహుయోనులఁ బుణ్యపాపమిశ్రత్వంబుల నుత్తమాధమకర్మం బులం బాపాత్ము లుదయింతురు వారలతెఱం గెఱింగించెద సావధానంబుగా విను మని యిట్లనియె. 84

గీ. వదనబాహూరుపదముల నుదయమైన, వారు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రు
లనఁగ నుత్తము లధ్యము లధము లధను, లమలు నయి విలసిల్లిరి ధరణినాథ. 85

సీ. శిల్పశాస్త్రజ్ఞులుఁ జిత్రకారులు రజకులు లోహకారకు లుక్కంఠకారు
లాంధ్రులు నావికు లాభీరకులుఁ గిరాతులుఁ బుల్కసులు పుళిందులు నటులు
మరవలు మొదలైన మనుజులు కర్మశేషముల జనించి దుష్కర్ములను
జడులును నంధులు షండులు బధిరులు నతిసూక్ష్మదేహులు నగుచు నందు

గీ. ధర్మశీలురు గొందఱు దానపరులు, వేదవేదాంగవేత్తలు వివిధకావ్య
కరణదక్షులు జ్ఞానులు కలితకీర్తిధనులు శాంతులు నయి యుందురు ధర్మతనయ. 86

## గర్భస్థజీవలక్షణము.

వ. అనిన విని ధర్మతనయుండు జీవులు మృగమీనాహిపక్షిమనుష్యజన్మంబుల గర్భంబు లనుండి యెు జనించి యెుం దాపత్రయంబుల నెట్లు వర్తిల్లుదు రెఱింగింపవే యని యడిగిన జీవుల కర్థంబు లాజన్మమరణంబులుగా నెఱింగించెద సావధానంబుగ విను మని కృష్ణుం డిట్లనియె. 87

క. మనుజులుఁ బశుసంఘంబును, మనసిజశరపీడ్యమానమానసులై పై

ఘనకర్మంబులు గైకొని, యనుదినముం గ్రీడసేతు రధికప్రీతిన్. 88

సీ. అతివలవక్షోరుహంబులయందున్న రక్తంబు శుక్లంబుఁ బ్రబలఁజేయఁ
బురుషబీజంబులఁ బొల్పొందు శుక్లంబు వెలఁదులసంగతి వృద్ధిఁబొందు
శుక్ల మెక్కువయైన సొగసైన పురుషుఁ డౌ నెత్తురు మించిన నెలఁతపుట్టు
శుక్లంబు పడువేళ సుదతిగర్భంబున మగనిజీవాంశంబు తగిలి శోణి
ఆ. తంబు వృద్ధిఁబొందుఁ దదనంతరంబున, నెలకు నెమిలిగ్రుడ్డు చెలువుఁదాల్చు
రెండునెలలు మిగుల నిండంగఁ బాఱిన, మీనుచందమొంది మెఱయుచుండు. 89

వ. మూఁడవనెల నిండిన గర్భంబు వ్యస్తపాదంబులం గానఁబడు నాలవనెలను బితపిత యయి యుండు నైదవనెలను సర్వాంగనిర్ణయం బయియుండు నాఱవనెలనుజీవప్రవేశంబగు నేడవనెలను రోమంబులు మొలుచు నెనిమిదవనెలను వృద్ధిఁబొంది మలమూత్రంబులం బొదిగి యుండుఁ దొమ్మిదవనెలను సర్వాంగపరిపూర్ణంబై రోదనంబు సేయుచు నిజకర్మంబుల నిందించుకొనుచు నుండు నని పలికిన మురహారునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 90

క. అర్భకుఁడు మున్నొనర్చిన, దౌర్భాగ్యము లెన్నుకొనుచుఁ దడఁబడ నొడలన్
గర్భమున నుండు గతిఁ దా, నిర్భరగతిఁ దెలుపుమయ్య నీరజనాభా. 91

వ. అనిన యుధిష్ఠిరునకు మురహారుం డిట్లనియె. 92

క. మలమూత్రంబులు చుట్టున్, బలియఁగ గర్భముననుండి బాలుఁడు పలికే
పలుకులు నీకుం దెలియఁగఁ, బలికెద విను మేకనిష్ఠఁ బాండుకుమారా. 93

వ. అనిపలికి కృష్ణుం డిట్లనియె. 94

## గర్భస్థుండైన బాలుండు విలపించుట.

మ. సుతకాంతాదులఁ బ్రోవఁ గోరి సుజనక్షోభంబుఁ గావించియున్
రతిలోభంబున నన్యకాంతలఁ బరీరంభక్రియం దెచ్చి యే
నతివృద్ధాతురబాల్యవారము నుపేక్షాపత్తి వీక్షించుచున్
మతిహైన్యంబున గర్భవేదనలకుం బట్టైతి నెట్లోకదే. 95

మ. మునుపోషించిన పుత్రమిత్రవనితాముఖ్యు ల్స్వకర్మంబులన్
జని యెందేఁ జన వారికై జపతపస్స్వాధ్యాయము ల్వాసి దు
ర్జనులం గూడి పరోపకారనియతిం బ్రాభవ్యముల్వాప నా
పెనుబాపంబున గర్భవేదనల పైఁ బెల్లయ్యె నెట్లోగుదున్. 96

క. అని వేదనలం బొరలుచుఁ, దనలోఁ దా నూఱడిల్లి ధర్మం బిఁక స

జ్జనసంగతి నొనరించెద, ననవరతము సుగతి కరతలామలకముగన్. 97

సీ. కరుణారసవిహార కౌస్తుభాలంకార వినుతభుజాటోప విశ్వరూప
హరినీలమణిదేహ యబ్ధికన్యామోహ సకలాగమస్తోత్ర జలజనేత్ర
దర్వీకరశయాన దళితదానవసేన యఖిలసురాధ్యక్ష హతవిపక్షఁ
బరమయోగిశరణ్య భక్తామరవరేణ్య వివిధలోకారాధ్య వినుతసాధ్య

గీ. భక్తి నుతియించి వేగ గర్భంబు వెడలి, కలుషసంసారవారిధి గడవనీఁది
సుగతిఁ గాంతు మనోరథస్ఫూర్తిఁ దేర్తు, భయములే కెందు సుగతిని బడయనింక.

వ. అని గర్భగతబాలుండు విచారించుచుఁ బ్రాజాపత్యం బను ప్రసూతిమారుతంబుచే
దీయంబడి తల్లికి నధికదుఃఖంబుగా యోనిమార్గంబున వెడలి నిస్సంగుండై యుం
డియు బాహ్యవాయుస్పర్శనంబున నుజ్జీవితుండై జాతిస్మరత్వంబు మఱచి యేమియు
నెఱుంగక మలమూత్రావిష్టాంగుండై తాపత్రయదుఃఖంబులం బొరలుచు క్షుత్పిపా
సాకులుండై రోదనం బొనర్చుచు బంధువర్గంబు స్తన్యౌషధాదిక్రియలఁ దేర్ప
నన్యాధిపత్యంబున బాల్యభావంబు బొందుననిన విని ధర్మనందనుండు వసుదేవనం
దనున కిట్లనియె. 99

క. కుంతీపాండుస్త్రావరు, సంతానము ద్రుపదపుత్రిసంతతి దయర
క్షింతునటంటివి మున్నా, పంతం బిడేర్చుకొనుము పంకజనాభా. 100

గీ. పిన్నవాఁడును వయసునం బెద్దతనము, నందుఁ గడపట నెవ్వార లధికదుఃఖ
సౌఖ్యములు గాంతు రెఱిఁగింపు సత్కటాక్ష, వీక్షణంబులఁ బుండరీకాక్ష కృష్ణ.

వ. అని యడిగిన యుధిష్ఠిరునకుఁ గరుణించి పాపాత్ములు బాల్యయౌవనవార్ధక్య చరమ
కాలంబుల వర్తించు తెఱంగు వినుమని మురహరుం డిట్లనియె. 102

ఆ. బాల్యమునను దల్లిపజ్జకుఁ జనుదెంచి, ఫలము మొదలు దృష్టిఁ బడ్డవేడ్కఁ
దెమ్మటంచు వగచి తేకున్నఁ బుడమిపైఁ, బొరలుచుండు జగము బోరగిల్ల. 103

క. కొడుకులు వేఁడిన యర్థము, లిడ దొరకక యున్నఁ దల్లి యెంతయు వగతో
నడఁకుచు మస్తక మడుకుచు, నడలుం బతిదూఱి పల్కు చతిదైన్యమునన్. 104

క. దారిద్ర్యం బతిదుఃఖం, బారయఁ బెక్కండ్రు తనయు లంతకుఁ గీడా
తీరున దయసేయని పతి, నారికి మరణంబు మేలు నానాగతులన్. 105

ఆ. కలిమి గలుగకున్నఁ బలువురు సుతులేల, పంతమొదవకున్న బలిమియేల
భాగ్యరహితమయిన బ్రతుకేల సత్కీర్తి, లేని జన్మమేల మానవులకు. 106

క. అని పలుకుచు నతిదుఃఖం, బొనరించుచుఁ జదువుకొనఁగ నొజ్జలయెడఁ జే

ర్చిన నాతండును వానిని, బెనుబాధలఁ బెట్ట వెఱచి భీతిల్లి చనున్. 107

వ. పాఱిపోయినం దల్లిదండ్రు లంతస్తాపంబునం బొక్కుచు. 108

క. ఇంటికిని శిశువు రాఁడే, వెంటం జనె నెఱుఁగరాదు విధి యెక్కడకుం
గెంటించె నో గృహా మేలా, వంటక మేమిటికి బ్రదుకవశమే మాకున్. 109

మ. కొడుకా యెక్కడి కేగితే మొగము నాకుం జూపి డెందంబులో
నడలుం బాపుము నిన్నుఁ బాసిన మఱల్ హర్మ్యంబులుం దోఁటలుం
గుడుముల్ శర్కర కోక లాభరణముల్ కోటానకోట్లున్న నీ
నొడువు ల్వోలె మనోరథార్థవితతు ల్వాల్కాల్పలే వెవ్వియున్. 110

మ. అనుచుం బంధుజనంబుఁ గూడుకొని నిద్రాహారము ల్లేక తూ
పనదీపర్వత కాననాంతరములం బల్మాఱు గాలించి చ
క్కని త్రోవం గని తెచ్చి వేగ నగలం గైనేసి యిష్టార్థముల్
దనియం బెట్టుచుఁ గొంద ఱుందురు మహోత్సాహంబు రెట్టింపఁగన్. 111

క. కొందఱు మణిభూషాంబర, చందన తాంబూలకుసుమసముదాయం బిం
పొందఁగ నిడి చదివింపఁగ, నుందురు తత్పరత గురువు లుచితము దెలుపన్. 112

క. అక్షరము వ్రాయుచోఁ దన, పక్షముతోఁ గూడి సచివపార్థివభృత్యా
ధ్యక్షతలు చూపి యాడుచు, నక్షయ సుఖవృత్తి నుందు రనవరతంబున్. 113

సీ. బాల్యవేళల నిట్లు బహుదుఃఖసౌఖ్యంబు లనుభవించుచు నంత యౌవనంబు
చనుదేర నడిగియు జలధి దాఁటియు వ్యవసాయము ల్చేసియుఁ జదువుచెప్పి
యధికారము లొనర్చి యన్యుల వంచించి యైనను బహుధనం బార్జనంబు
గావించి పదిలంబు గావించి యాసొమ్ము నృప చోర పావకు లపహరింప
ఆ. వానలేదు రాజవర్తనల్ తబ్బిబ్బు, బంధువర్గ మాసపడనె గాని
తన్నుఁ జేరనీదు దైవకటాక్షంబు, పలుచనయ్యె నంచుఁ బలవరించు. 114

వ. అంత. 115

క. స్వరము కడు సన్నగిల్లున్, శిర మెంతయుఁ వణఁకు దృష్టిచే యాసపడుం
గర మూఁతకోలఁ గైకొను, నురుముం బొమ్మలును నరయ నొగి ముసలి యగున్. 116

ఉ. ఎవ్వరిఁ గానకుండ ధన మేటికి దొంగిలి దాఁచె దీవు నీ
క్రొవ్వణఁగించు నింతకును గోడలు చూచినఁ జేఁటెఁడేసియున్
బువ్వయుఁ గూర రైన నొకబుగ్గకుఁ జాలవు తే వశంబె నీ
కెవ్వల నైనఁ జేరు మది యిష్టము చుంచు సుతుండు పల్కెడున్. 117

క. అని పలికెను తనయాదుల, ఘననిష్ఠురభాషణములు కర్ణంబులకుం
బెనువాఁడి సూదులుం బలె, మొనయఁగ విలపించి కరుణ మొలవం బలుకున్. 118

ఆ. ముసలివాని బ్రదుకు మోఁకాళ్లమీఁదటి, పెఱికె యుంతె యంత పెట్టు వెట్టి
కొట్టనేల నీవు కొడుకులఁ గన్నాఁడ, విధియు నీకు రాఁగ నేనె చూతు. 119

క. పిలిచినను మందుఁ గామిని, బలికినఁ దిట్టుదురు పుత్రపౌత్రులుఁ మిత్రుల్
తలఁచూప రెంతపాపము, వలదుసుమీ ముసలితనము వైరుల కైనన్. 120

వ. అని యనేకప్రకారంబుల విలపించుచు నజ్ఞానమోహంబు ముడిగొన్న దనూపరుం
డై యిట్లని పలుకుచుండు. 121

ఉ. వృత్తులు హెచ్చు లేవు పృథివీపతు లీయరు మూలవిత్తము
వ్రేత్తుగ వెచ్చపెట్టితిని నెక్కడఁ జూచినఁ గాసు గానరా
దిత్తడి రాగి బంగరువు నిప్పటి యప్పులకైనఁ జాల వీ
సెత్తురుఁగందు లేమి గొని నిల్వుదురో తమప్రాణవాయువుల్. 122

వ. కలకాలంబు దుఃఖంబులే యనుభవించి నింక సుగతి గలుగునే యని విలపించుచుఁ
గాలవశంబున మృత్యువాసన్నుం డైన మోహంబునఁ దనజననీజనకకాంతాదులం
జేరుకొని యుపార్జితధనంబుఁ దెచ్చి కరతలవదనభుజామధ్యంబుల నిలుపుఁడని
మొఱలువెట్టుచు క్షుత్పిపాసాకులుండై యన్నోదకంబులు వేఁడి బంధుజనంబులచే
నదల్పంబడి కర్మసంచయంబున వివశుండై ప్రాణంబులఁ బాసి యమకింకరులవెంట
శునకకాకగృధ్రరాక్షసగణంబులు భక్షించుచుండఁ దప్తపాషాణ సైకత కర్ద
మంబులైనఘోరమార్గంబుల యమాలయంబునకుం జని మున్నెఱింగించిన మహారౌ
రవాది నరకంబులం బడి నన్నెఱుంగనిమూఢులు జన్మమరణంబులకడఁ గానకుం
దురు. సంసారచ్ఛేదనంబును బాశవిభేదకారణంబును నైన నన్ను సేవించినవారు పున
రావృత్తివర్జితం బైన యుత్తమలోకంబున నుందురు గావున సకలపాపహరం
బైన యోగం బభ్యసింపవలయు యోగంబున జ్ఞానంబును జ్ఞానంబున మోక్షం
బును సిద్ధించు. మనుష్యజన్మంబును నొందియు నాసర్వకర్మప్రసాధనం బైన
జ్ఞానంబు లేనివాఁడు పశువు నచేతనంబు ననంబడు. భక్తిముక్తి ప్రదాయకం
బైన యీమానవత్వంబున నయిన నాలోకంబు గలుగు నచ్యుతుం డైన నన్నుఁ గొలువు
నాభజనంబున భయంబు దొలంగు ననిన విని యుధిష్ఠిరుండు సంతుష్టాంతరంగుం
డై మురహారున కిట్లనియె. 123

## గంగాదిపుణ్యతీర్థమహిమ.

గీ. మనిచితివి ధర్మశాస్త్రక్రమంబుఁ దెలిపి, యానతిచ్చినయవి యెల్ల నస్మదీయ

దేశమున నిల్చి యొనరింతు దేహమాత్ర, జనుల నందాఁక రక్షింపు జలజనాభ. 124
క. వ్రత మొనరింతునొ తీర్థ, వ్రతతులు సేవింతునో కృపామతి వెలయన్
హితవుగ నిప్పటి కుచిత, స్థితి యెయ్యది తెలుపు మయ్య శ్రీకృష్ణహరీ. 125
గీ. క్షేత్రములలోన నుత్తమక్షేత్ర మగుచుఁ, దీర్థములకెల్ల రాజనఁ దేజరిల్లు
దాని నెఱిఁగించి నాకోర్కిఁ దనుపుమయ్య, భక్తవత్సల గోవింద పద్మనాభ. 126
వ. అని ధర్మసూనుఁ డడిగిన వసుదేవనందనుండు మనంబున విచారించి భాగీరథిం గొని
యాడి యిట్లనియె. 127
గీ. క్షేత్రములలోన నుత్తమక్షేత్ర మగుచుఁ, దీర్థముల కెల్ల రాజన దేజరిల్లు
గరిమ గంగయుం యమునయుఁ గలసినట్టి, చక్కియందురు సురసిద్ధసాధ్యమునులు.
ఆ. తెలుపు నలుపు నైన జలములు గలతీర్థ, మునకు భవవిరించి ముఖ్యసురలు
నారదాదిమునులుఁ జేరి సేవింతురు, సకలపుణ్యదేశసార మనుచు. 129
గీ. అఖిలపాపక్షయ మొనర్చు యమున విష్ణు, పాదసంభూత యగుగంగ పరమపుణ్య
మొసఁగు నీరెండుఁ గూడిన నుత్తమంబు, తీర్థములలోన సరిలేవు దీని కెందు. 130
క. జలనిధిపరీతధాత్రిం, గలతీర్థంబులకు రాజు కామితఫలముల్
వెలయఁగఁ జేయుఁ బ్రయాగను, దలఁపం గొనియాడ వశమె ధర్మతనూజా. 131
ఆ. అయంతయోజనములయంతదూరంబున, నున్ననైనఁ గలుగు మున్నుగానె
గంగయనుచు నిచ్చఁ గడుభక్తిఁ దలఁచినఁ, దజ్జలాభిషేకతతఫలంబు 132
వ. నాచరణంబునం బొడమి విశ్వేశ్వరసన్నిధానంబునం బాఱి సకలామరసంఘంబుచేఁ
బూజఁ గొన్నగంగ ముక్తికాములకు సేవింపఁ దగు తదీయసైకతంబు లలాటంబున
ధరియించినవా రిందుఖండంబు నధికనేత్రంబుం దాల్తురు స్నానం బొనరించినఁ
బాపాత్ము లైనను బితృమాతృకుల సహితంబుగా వైకుంఠంబున నుందురు స్మరి
యించినవా రనవరతంబు సకలపుణ్యక్షేత్రంబులను వసియించినవా రగుదురు మజ్జనం
బొనర్చినవారి నీక్షించినవారు సకలాఘంబులఁ బరిహరింతురు సందేహంబు లేదు.
మృత్తికాలేపనంబు చేసికొన్న దేహబంధంబులు దొలంగు. మేషాదిమాసంబుల గోదా
వరీభీమరథీ కృష్ణారేవా సరస్వతీ తుంగభద్రా యమునా సరయూ వేత్రవతీ తామ్ర
పర్ణీ శతద్రూ ప్రముఖంబు లైన సకలపుణ్యనదులం బ్రవేశించియుఁ సూర్యుండు
మకరస్థుం డైయుండ జలమాత్రంబునం దెల్లవసియించియుఁ జగంబుఁ బవిత్రంబు
సేయుచుండు. 133

1 బొకఁ దజ్జలాభిషేకఫలము.

ఉ. ఎప్పుడు గంగకుం జనుదు నెప్పుడు మానులపాదపద్మముల్
చొప్పరికింతు నెప్పు డతిశుద్ధత దీయపయఃకణంబులం
దొప్పఁగఁ దోఁగి పాపములఁ దోలఁగ నెమ్మది నాకు నబ్బు నం
చెప్పుడు లోఁ దపించు నరుఁ డేలఁగఁజాలు వికుంఠధామమున్. 134

క. గంగాపయఃకణంబుల, నంగంబులు దోఁచుకొన్నయట్టి మహాత్ముం
డంగజగురుపట్టణసౌ,ధాంగణకేళీకుళిలో విహారము గాంచున్. 135

క. ఆకల్పజన్మవితతిం, బైకొని పఠియించుచున్నఁ బాపము లణఁగున్
లోకమున మాఘమున నభి,షేకంబు ప్రయాగమునను జేసినయంతన్. 136

సీ. హరినారబ్రహ్మలు పురుహూతపావకభానుసుతాది దిక్పాలవరులు
తక్కినసురలు విద్యాధరు ల్కిన్నరు ల్చారణు ల్గంధర్వసాధ్యజనులు
తుంబురునారదు ల్దుగ్ధాబ్ధికన్య దాక్షాయణి శారద శచియు నదితి
రంభాతిలోత్తమోర్వసులు నానావిధ నిర్జరాధిపభామినీచయంబు

గీ. గ్రహణసంక్రాంతిముఖపుణ్యకాలములను
స్నాన మొనరింప వత్తురు సకలయాగ
ఫలము చేకూరు నొకనాఁడు జలకమాడ
గంగఁ గొనియాడ శక్యమే కౌరవేంద్ర. 137

వ. అనినఁ బురుషోత్తమునకుఁ బాండవోత్తముం డి ట్లనియె. 138

గీ. గంగ కరుగంగ శక్తులు గాక యున్న, జనుల కేగతి పాతకక్షయకరంబు
పుణ్యసద్వర్తనము సర్వపూజ్యమైన, తీర్థ మెఱిఁగింపుమీ వసుదేవపుత్ర. 139

వ. అనిన భగవంతుం డి ట్లనియె. 140

## సాలగ్రామశిలామహిమ.

క. సాలగ్రామముతీర్థము, చాలుం బాతకము లణఁప సకలోన్నతమా
నాలోకం బేలింపఁగఁ, గాలుని దనదాసుఁ జేయఁ గలకాలంబున్. 141

శా. సాలగ్రామశిలార్చనాయతమతు ల్సర్వాఘముల్ ద్రుంచి ది
క్పాలు ల్మెచ్చ విమానయానములతో గంధర్వవిద్యాధరుల్
చాలై పాడుచు నాడుచుం గొలువ భూషాగంధచేలాఢ్యులై
నాలోకంబున వచ్చి నిల్తురు మహానందంబు రెట్టింపఁగన్. 142

క. సాలగ్రామము పసిఁడి, న్వాలాయముగాపు నాకు వైకుంఠము ల
క్ష్మీలోలాక్షియఁ దత్పా,జాలోలున కబ్బు సకల సవనఫలంబుల్. 143

ప. వజ్రకీటవినిర్మితం బైన సాలగ్రామ చక్రంబున నన్నుం బూజించువారు ధర్మకార్యంబులు నిందించి పాపంబు లాచరించిరేనియు యమాలయంబు జొరరు. సాగరాంతం బైనధరాతలంబు దానం బొసంగినం జేకూరుపుణ్యంబు నొందుదురు. పండ్రెండేని యిరువది నాల్గేని సాలగ్రామంబు లర్చించువారలు శతకోటి మాతృపితృవంశంబులతోం బునరావృత్తిరహితం బైన నాలోకంబు చేకొందురు. సాలగ్రామశిలోద్భవం బైన తీర్థంబున గంగాగోదావరీరేవాప్రముఖ పుణ్యనదులు సంతతంబు నుండు. సాలగ్రామశిలాచక్రం బున్నవారియింటికి నరుగుదెంచుజనంబులును దత్తీర్థంబు బిందుమాత్రంబు గొన్నవారు పాపంబులం బరిహరించి దేవతలకును సేవ్యు లగుదురు. చక్రపాణితోంగూడం బురుషసూక్తవిధానంబునం దులసిశంఖజలంబుల నభిషేకంబు గావించినజనంబులకు ముక్తి సిద్ధించు. యక్షకిన్నరగంధర్వవిద్యాధరాప్సరోగణంబులు నింద్రాది దిక్పాలకులు హరవిరించిప్రముఖులు భూలోకంబున సాలగ్రామశిలాపూజనంబు వాంఛింతు రితరంబు లేమి లెక్కింప ననిన మురహారునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 144

## వ్రతవిశేషములమహిమ.

క. గంగాసాలగ్రామమ్ములం గలుగు విశేషతీర్థలక్షణములు నా
కుం గఱపి యింక నిలలో, రంగగు వ్రత మెద్ది పలుకు రాజీవాక్షా. 145

వ. అని యడిగినం బాండవాగ్రజునకు గదాగ్రజుం డిట్లనియె. 146

గీ. మేలు నీబుద్ధి ధర్మంబు పాలుపడియె, వ్రతముమాత్రంబె శ్రీహరివ్రతదినంబు
వీరు వా రనకుండ నవ్వారి గాంగ, ముక్తి నొసంగును బాపము ల్మాలపనీదు. 147

క. ఏకాదశి పాపంబులం, బోకార్చును పుణ్యఫలము ప్రోవులు సేయుం
జేకూర్చు సర్వసంపద, లాకల్పము ముక్తి యొసంగు నలవియె పొగడన్. 148

గీ. బ్రహ్మహత్యాది పాతక పటల మన్న, మాశ్రయము చేసికొనియుండు హరిదినమున
నందు నెవ్వండు దా నిరాహారనిష్ఠ, వ్రతము గావించుం గైవల్య మతనిసొమ్ము. 149

వ. హరివాసరంబున నుభయపక్షంబుల నన్నంబు వర్జనీయంబు. భుజించిన నతండు రౌరవాదినరకంబులం బడు నుపవాసఫలం బిచ్చగించినవారికి దశమీద్వాదశీదినంబుల నిశాసమయంబుల మధ్యమదివసంబుల నహోరాత్రంబులును నుపవసింపవలయు నిహపరైకసాధనం బేకాదశీవ్రతంబు. నీవు నాచరింపుము మనోరథంబు లీడేఱు నీకథ విన్నవారికిం బాపంబు లణంగుం బుత్రపౌత్రాభివృద్ధి యగు ననిపలుకుచున్నసమయంబున బలభద్రుం డంపినదూత యేతెంచి దండప్రణామంబు లాచరించి యిట్లనియె. 150

### శ్రీకృష్ణునికడకు బలరాముఁడు దూతను బంపుట.

ఉ. దండము క్షేమకారికిని దండము కాంచనవస్త్రధారికిన్
దండము పాపహారికిని దండము భక్తగణానుసారికిన్
దండము వైరిహారికిని దండము మానిమనోవిహారికిన్
దండము కంసవైరికిని దండము వార్ధిసుతావిహారికిన్. 151

గీ. ఏడులక్షలనూర్గురు నీడెఱుంగ, నరిది బలియుండు పౌండ్రకుఁ డంపవచ్చి
ద్వారవతి చుట్టు ముట్టడి దాఁకియున్న, వారు వారితోఁ బోట్లాడవలయు మనము.

క. వడి నేనె గెలువంతునో, వడి గలతన మిచటఁ జూపవచ్చెదవో ని
న్నడుగు మని పంపె నను మీ, కడకుం బలదేవుఁ డిపుడు కమలదళాక్షా. 153

ఉ. అక్కడ నున్న బంధుజను లందఱు మీ రరుదేరఁ బ్రాణము
ల్దక్కెడు నందు రిక్కడను ధర్మతనూభవుమానసంబు పెం
పెక్కఁగఁ జేయఁగావలయు నేయది కార్యమొ నిశ్చయించి మీ
రొక్కటి యానతిండు భవదుక్తి శిరంబునఁ దాల్చి యేగెదన్. 154

క. అని విన్నవించు దూతం, గనుఁగొని సైరింపు మనుచు గంగాతనయున్
వినుతించి నాదువాక్యము, విను మని కృష్ణుండు మిగుల వినయాతురతన్. 155

చ. అమరనదీతటంబున విహారము సేయుచు నన్ను వేఁడి యు
త్తమతరధర్మము ల్దెలిసి తా నెఱిఁగించెను నీకు నారదుం
డమలవిచార నీవు నవి యన్నియుఁ బాండుసుతు ల్చెలంగఁ జె
ల్పుము భవదీయకీర్తి పరిపూర్ణత నొందు ధరాతలంబునన్. 156

క. అని పలికి ధర్మనందనుఁ, గనుఁగొని యీశేషధర్మకాండం బెల్ల
న్వినిపించు భీష్ముఁ డీయన, ఘనచరితము నీకుఁ దెలియఁ గౌతుకమొసఁగున్. 157

క. భక్తుండు నాకు మీ కనురక్తుండు సమస్తధర్మరక్షణవిధులన్
శక్తుం డేతత్కార్యో, ద్యుక్తుం డీభీష్ముఁ డితనితో సరి యేరీ. 158

క. భీష్ముండు నేను నేనే, భీష్ముం డితనికిని నాకు భేదము లేదా
గ్రీష్మోగ్రభాను బర్హి, శ్శుష్మాంశులు చల్లనైన శుద్ధచరిత్రా. 159

ఉ. దానము లేనిసంపదలు ధాన్యము లేనిగృహంబు లిష్టసం
తానము లేనివంశమును దాలిమి లేనితపంబు లాత్మవి
జ్ఞానము లేనివిద్యలు ప్రసన్నత లేనినృపాలు సేవయున్
వానలు లేనిసస్యములు వన్నెకు నెక్కవు ధర్మనందనా. 160

ఉ. ఆపదవేళ ధైర్య మధికాభ్యుదయంబునఁ దాల్మి యుద్ధమున్
జేపడుచోఁ బరాక్రమము శిష్టజనంబులకు న్విధేయత
ల్పాపముచోట నోటమియు బంధుసమూహమునొద్దఁ బ్రేమయుం
జూపఁగఁ జాలునట్టిపరిశుద్ధచరిత్రులు గాంతు రిష్టముల్. 161

ఉ. కావున ధర్మము ల్నడుపు కౌరవవంశవరేణ్య తమ్ములా
జ్ఞావశవర్తులై మెలఁగ సర్వజనంబులు నిన్నె కోర నీ
భావము శాంతి దాంతి గుణబంధురమై కనుపట్టె నెంత దో
ర్ద్వీవసుధాతలంబు విను మెన్నివిధంబుల నీకుఁ దక్కెడున్. 162

క. ధర్మంబు చెఱుపఁ జెఱచును, ధర్మము మనుపంగ మనుచు ధరణీస్థలిలో
ధర్మంబె కర్త యంతకు, ధర్మం బొనరింపు నీవు ధర్మతనూజా, 163

గీ. సాధుజనముల రక్షింప సకలదుష్ట, కోటిఁ బరిమార్ప నెమ్మదిఁ గోరి యుగయుగమున జనియించి యెవ్వరుఁ గానకుండ, ధర్మరూపంబున నొనర్తుఁ దలఁచినట్లు.

క. అని పలుకుకృష్ణువాక్యము, విని కుంతీవరసుతుండు వినుతించి పునః
పునరాలింగనకృత్యము, లొనరించుచుఁ బలికె హర్ష మున్నతి కెక్కన్. 165

గీ. కౌరవులు నేము నీకొక్కకరణి తెలియ, సర్వసాక్షివి నీవు నీచరణయుగము
నెమ్మనమ్మున నిడికొని నిలిచియున్న, భక్తజనులము మముఁ గావు పద్మనాభ. 166

వ. అని ధర్మనందనుండు వేఁడిన నట్ల కావింతు నని లేచి భీమార్జున నకుల సహదేవ ద్రుపదరాజకన్యకల నూఱడించి గంగానందనునకు వేదవిదు లైనబ్రాహ్మణులకు మునిగణంబులకు నమస్కరించి ద్వారవతీనగరంబునకు యదువల్లభుండు చనియె నంత.

ఉ. ఎక్కడిపాండ్రకుండు పురి కెక్కడిముట్టడి వచ్చె నేఁడు మా
కెక్కడిదూతఁ బంపె హరి యెక్కడ నుండెనొ యిప్డు మాధవుం
డెక్కడిదైవయత్న మిఁక నెక్కడికేఁగుద మంచుఁ జింతకుం
దక్కరి పాండునందనులు ద్వారకకున్ హరి పోవుచుండఁగన్. 168

ఆ. రాజు లేకయున్నరాష్ట్రంబు కైవడి, విభుఁడు వాసి చనినవెలఁదిమాడ్కిఁ
బద్మనాభుఁ డరుగఁ బ్రభ యంత విడిచిరి, పశుమృగాదు లైనప్రాణులెల్ల. 169

ఆ. దేవదేవ కృష్ణ దేవకీనందన, యఖిలలోకనాథ హరి ముకుంద
కన్ను లలర నిన్నుఁ గనుఁగొనుభాగ్యంబు, సంతతమ్ము నిమ్ము జలజనాభ. 170

ఉ. అకనకాంబరప్రభలు నాభిజమధ్యవిలాసకౌస్తుభం
బాకరుణాకటాక్షములు నామణికుండల దివ్యకాంతు లా

హా కలగన్నరీతి మన కయ్యో నిజకన్ హాఁ జూచుటెన్నఁడో
కా కని పాండునందనులు గాఢవిచారముఁ జెంది రందఱున్. 171

గీ. అంత నాకాశమున నిల్చి యమరవరులు, ధర్మనందనుతలమీఁద ద్వారవతిని
మురవిభేదనుశిరముపై ముసురుపట్టి, కురియఁజేసిరి మందారకుసుమములను. 172

వ. అంత ధర్మనందనుండు పుండరీకాక్షునర్వావయవంబులు ధ్యానంబుసేయుచు గం
గానందనునకు వందనం బాచరించి యిట్లనియె. 173

శా. గంగానందన నీకతంబున జగత్కల్యాణదాతన్ దయా
రంగల్లోచనుఁ గృష్ణు ముచ్చటలు దీరం జూడఁగా నబ్బె మా
కుం గామ్యార్థము లెల్లఁ గాంచితిమి యీ గోవిందుచందంబునన్
పొంగం బైకనుపట్టు ధర్మము లుపన్యాసంబు గావింపవే. 174

కృష్ణుఁడు చనిన భీష్ముఁడు ధర్మంబులు దెలుపుట

వ. అనిన యుధిష్ఠిరునకు భీష్ముం డిట్లనియె. 175

క. శ్రీకృష్ణుఁడు పరమాత్ముం, డాకౌస్తుభవక్షు సేవ నలరించుజను
ల్పోకార్తురు పాపంబులు, చేకొందురు పరమపదము చిరకాలంబున్. 176

మత్తకోకిల. చంద్రసూర్యులు ధారుణీస్థలి సర్వదిక్కులు నంబరం
బింద్రవహ్నియమాసురాంబునిధీశమారుతయక్షరా
ట్చంద్రశేఖరు లబ్జగర్భుఁడు సాధ్యచారణులున్ హరి
శ్చంద్రముఖ్య నృపాలురున్ హరి సత్య మింత యుఁ భూవరా. 177

వ. అని యానతిచ్చిన గంగానందనునకుఁ గుంతీనందనుం డిట్లనియె. 178

క జలజాక్షుని దేహంబునఁ, గలిగినవా రెవ్వ రెవరు ఘనులు ధరిత్రీ
శులు మునులును నిర్జరులును, దెలియంగాఁ బలుకుమయ్య ధీరవిచారా. 179

వ. అని యడిగిన శ్రీకృష్ణుని శరీరంబువలన నుదయించిన పుణ్యశ్లోకులం బేరుకొందు
వారల స్మరించినఁ బాపంబు లణంగు నని భీష్ముం డిట్లనియె. 180

గీ. అత్రి భృగు కణ్వ ధౌమ్య బృహస్పతులును, వ్యాస నారద భరద్వాజ దాల్భ్య శుక
గౌతమాగస్త్య గాలవ కశ్యపాది, మునులు స్మృతికర్తలును గృష్ణుమూర్తు లరయ.

సీ. చుక్కలు చంద్రుండు సూర్యుండు దిక్కులు [1]దిక్పాలకులును బృథ్వియు నభంబు

1 అమృతంబు ధరణి ధరాధిపతులు, బలరూపసుఖధనప్రాభవవిద్యలు ధర్మంబు మానులుఁ దాల్మి నీతి, అప్సరోగణములు యక్షకిన్నరవరుల్ సిద్ధవిద్యాధరచారణులును, దిక్పాలకులుఁ బుణ్యతీర్థములుఁ బలిప్రశ్నలుఁ బురాణమ్ములు దానరతులు, ద్రోణకృపకర్ణ శల్యులు ద్రుపదపుత్త్ర, యుద్ధవారాగ్రముఖయాదవోత్తములును, నీవుఁదమ్ములుఁగుంతియుం.

గరుడగంధర్వకింపురుషకిన్నరసిద్ధసాధ్యవిద్యాధరచారణులును
దివ్యమానులుఁ బుణ్యతీర్థముల్ వ్రతసత్పురాణంబులును మఱి దానరతులు
ద్రోణద్రుపదులును ద్రుపదజుఁ డక్రూర యుద్ధవముఖయాదవోత్తములును
గీ. వేదవేదాంగవేత్తలు విమలధర్మ, తత్పరులు యోగనిష్ఠులుఁ దత్త్వవిదులు
నీవుఁ దమ్ములుఁ గుంతియు నేను మనకుఁ, దగినవారెల్లఁ గృష్ణుండు ధర్మతనయ. 182
ఉ. సంశయ మింత లేదు సురసంఘము వేఁడిన ధాత్రిఁ గావ నై
జాంశముచేత నీనరవరాధిపులన్ జనియింపఁ జేసి శ్రీ
తాంశుకులంబున న్మొలిచె నాగరుడధ్వజుఁ డిట్లుఁ గృష్ణుఁడై
భ్రంశము లేక త్రుంచుధృతరాష్ట్రతనూజుల నీవిభుం డిఁకన్. 183
వ. మహాభారతం బనుపేర నధికయుద్ధం బగు నీకై కృష్ణుండు గాంధారేయుల సైంధవా
దిబంధుజనంబులఁ దక్కిన దుష్టరాజలోకంబును నణంచు రాజ్యలాభంబునకై య
తనిం బూజింపు మనిన విని సంతుష్టాంతరంగుం డై సమరవాదు లైనభీమాదులం గూ
డుకొని యుధిష్ఠిరుండు భీష్మున కిట్లనియె. 184
ఆ. కపట వేషధారి కంసారి యాయన, చిత్తవృత్తి నీకుఁ జేతిలోది
మనుచునొక్క మమ్ము మఱి యొందు దలఁచునో, తెలియఁ బలుకు తాత ధీసమేత.
వ. అనిన భీష్ముం డిట్లనియె. 186
గీ. ధర్మమార్జించు సద్గోష్ఠిఁ దగిలి చేయు, మితరకృత్యంబు లన్నియు నే వడంచి
వాసుదేవునిఁ బూజించు వలసినట్టు, లఖిల విభవంబు లొసఁగు నాయదువిభుండు.
వ. అనిన గంగానందనునకుఁ గుంతీనందనుం డిట్లనియె. 188
క. ధరణీతలంబునం గల, నిరుపమతీర్థములు క్షేత్రనిధులును నియమో
త్కరములు నా కెఱిఁగింపుము, కరుణావీక్షణము మెఱయ గంగాతనయా. 189
వ. అనిన భీష్ముం డిట్లనియె. 190
గీ. విదురునకు నాకు ధృతరాష్ట్రవిభుని కతని, నాతికిని ద్రోణునకును సనత్కుమార
మౌని మున్నానతిచ్చిన మహితధర్మ, మెఱుఁగఁ బలికెద శ్రీకృష్ణుఁ డింపుతోడ.
క. అది నీకుఁ దెలియఁ బలికెద, యదువల్లభునాజ్ఞ యుత్తమాంగమునందున్
సదమలభూషణమై యిం, పొదవంగాఁ దాల్చి కురుకులోత్తమతిలకా. 192
క. అని యిట్లు విమలధర్మము, వినిపింపం బూనియున్న విబుధనదీనం
దనుఁ గొనియాడి ప్రమోదం, బున నుండిరి పాండురాజపుత్త్రులు మునులున్.
గీ. విమలధర్మంబుఁ జేసిన విన్నఁ గన్న, సంతసింప నుతించిన సకలపాత

కంబు లణఁగించి కోరుకు ల్గలుగఁ జేయుం, వృష్ణివల్లభుఁ డైన శ్రీకృష్ణుఁరీతి. 194

వ. అంత వసుదేవుని సర్వాంగంబులు ధ్యానంబు సేయుచు ధర్మకథాశ్రవణతత్పరులై యున్న మనులయనుమతంబున ధనప్రదాతయు బుణస్థుండు నేగతి వర్తింతు రెఱిఁగింపవే యని యంధిష్ఠిరుం డడిగిన నందు కుత్తరంబుగా భద్రకగోవృషసంవాదంబను నొక్క యితిహాసంబు గల దెఱింగించెద వినుమని భీష్ముం డిట్లనియె. 195

భద్రకగోవృషసంవాదము.

సీ. అఖిల సంపదలకు నాలవాలంబు నాఁ దిలకించు కాశ్మీరదేశమునను
గామునుం డత్యంతగర్వి దురాచారి వేదదూషి కలండు విప్రుఁ డొకఁడు
భద్రకుం డనువాఁడు పాతకం బొనరించి తల్లిదండ్రులచేతఁ ద్యక్తుఁ డగుచు
శూద్రాన్నభోజియై క్షోణీశదండభయంబునఁ బరసీమ కరిగి యందుఁ

గీ. బెక్కుకాలంబు వసియించి పెద్దకటియ
యొద్దు నెనుపోతు దొంగిలి యెవ రెఱుంగ
కుండ నారాత్రి తనయూరి కేగఁబోఁగఁ (?)
బలికె నీరీతి బాంధవప్రతతి చూచి. 196

క. కఱవునఁ గాచినవారిని, పరువునఁ బరిమార్పఁ గోరు తగవరి వీఁక నీ
పోరువున నుందురె మనుజులు, పరువునఁ జను మరలి భద్ర పాపసముద్రా. 197

గీ. చుట్టములకెల్ల పళుకులు గట్టి నెఱయఁ, బ్రజకు బందెలు గొల్వంగ బ్రోవుఁ డీవు
పామునకుఁ బాలువోసిన పగిది నీకు, మేలు చేసినఁ బో మ్మింకఁ జాలు భద్ర. 198

వ. అని కొంచక పలుకు బంధుజనంబుల వంచించుచు భద్రుం డిట్లనియె. 199

చ. ఎఱుఁగక ము న్నొనర్చితి ననేకము లైన యఘంబు లంత మీ
రెఱిఁగి యదల్చి నం దలఁగి యేగితి గంగకు నందు విప్రులే
మెఱిఁగియొ నన్నుఁ బిల్చి యిదె యిచ్చిరి యోగ్యము లిత్తెఱంగు మీ
రెఱుఁగఁగ విన్నవింతు నని యేఁ జనుదెంచితి సత్య మింతయున్. 200

ఆ. తిరిగినాఁడ దివ్యదేశంబు లన్నియు, విఱిగినాఁడ దుష్టవితతిమీఁద
మరగినాఁడఁ బుణ్యమార్గంబు మీదివ్య, పదములాన వినుఁడు బంధులార. 201

వ. అనిన సకలబంధుజనంబు లొక్కచందంబునఁ బ్రమోదాయత్తచిత్తులై యిట్లనిరి.

గీ. తొల్లివలెఁ గాక గార్హస్థ్య మెల్లవారు
వొగడ నొనరించి సౌఖ్యము లొందు మయ్య

ధర్మవర్తన మఖిలభద్రము లొసంగు
దిరిగి విఱిగినవాఁడె పో దేవుఁ డరయ. 203

క. అని బుద్ధి గఱపు బాంధవ, జనముల వంచించి మధురసంభాషణముల్
వినయంబు దోఁప నాఁడుచుఁ, జనియె న్భద్రకుఁడు తనదుసదనంబునకున్. 204

వ. ఇట్లు తాఁ దెచ్చిన యెద్దు నెనుపోతును మెడఁ గాఁడిఁ గీలించి ప్రచ్ఛన్నరూపంబునం బాదరక్షలు తోలుమోకు మునికోలయుఁ నంటఁగట్టి పెద్ద యేఁడికోల యమర్చి నాఁగలి భుజాగ్రంబునం దాల్చి కౌపీనధరుం డై మార్గంబున దప్పితీర్చికొందు నని యుంగ్యంబులకు భయంబు జూపుచుఁ గృషిక్షేత్రంబున కరిగి యందు మధ్యాహ్నసమయంబున నుగ్రకరకిరణంబులు సోఁకి యలసి నాలుక చాఁచి నేలం బడి పొరలుచున్న మహిషంబును దండంబున ఘట్టించియుఁ రజ్జుపరంపరల బాఁదియుఁ గాల బువ్వియుఁ బెడకల ప్రేసియుఁ గొమ్ముల మొత్తియుఁ బాదంబులఁ దన్నియుఁ హస్తంబులఁ జఱచియుఁ దోఁక గఱచియుఁ బహువిధంబుల నొప్పించి యుం నెందును గడ గానక విసిగి దుఃఖించి కోపసంరక్తలోచనుం డై గోవల్లభున కిట్లనియె. 205

క. ఎనుపోతు నీసమానమె, యినుకిరణము సోఁకి నేని యిగిలించుచుఁ దాఁ
జనలేక నిలుచు నీవే, ఘనుఁడవు వద గోవృషంబ కాలాభ్రనిభా. 206

వ. అని యిట్లు. 207

ఆ. ప్రజ్ఞలేక పలుకు బ్రాహ్మణాధముమాట, మానసమ్ముఁ గలఁప మగిడి మగిడి
యదలి యెల్లఁ జూచి యధికరోషంబున, గోవృషంబు పలికెఁ గొంకు విడిచి. 208

శా. ఓరా విప్రకులాధమా యెపు డనిత్యం బైనదేహంబు నీ
వేరూపంబున నమ్మి చేసెదవు రా యీపాపము ల్మానరా
నీరూపంబున దుర్గతిం బడిరిరా నీవారు వారింపరా
పోరా ధర్మము నేయరా బ్రదికి వేడ్కూరింపరా కోరికల్. 209

క. అని పలుకు నెద్దువచనము, విని మది సందియము భయము వెంబడి నేయం
దనువునఁ బులకోద్గమముగ, వినతుం డై భద్రకుండు వినయము దోఁపన్. 210

వ. ఇట్లనియె. 211

గీ. పాపకర్ముండ నేఁ జేయుపాపములకు, మేర లే దెందు నితర మేమియుఁ నెఱుంగ
ధర్మ మేరూపమో నాకు దయ నెఱుంగఁ, బలికి రక్షింపవయ్య గోపతివరేణ్య. 212

వ. అని యిత్తెఱంగున నతిదైన్యంబు దోఁప భద్రకుం డడిగిన మేఘగంభీరరవంబున

ధర్మాధర్మంబు లెఱింగించెద సావధానంబుగా వినుమని గోవల్లభుం డిట్లనియె. 213

## వృషభము భద్రకునకు ధర్మములు చెప్పుట.

గీ. అఖిలదానంబు లెన్నంగ నన్నదాన, మధికముగ లెక్కవెట్టుదు రార్యజనము
లట్లు గావున సతతంబు నన్నదాత, విష్ణుసాయుజ్యమును బొంది వినుతిఁ జెందు. 214

క. సాలగ్రామము లింగము, బాలిక గోభూమి తిలలు బంగారము నీఁ
జాలు మహాత్ములు గాంతురు, వాలాయము విష్ణులోకవాససుఖంబుల్. 215

వ. అనిన భద్రకుం డిట్లనియె. 216

క. దానము సేయఁగ నొకకా, సైనను గన నాకు లేదుగా యది నోడువ
స్థాని యిఁక నొక్కధర్మము, నే నెలవునఁ గలిగెనేని యెఱిఁగింపు దయన్. 217

వ. అనిన భద్రునకు గోవల్లభుం డిట్లనియె. 218

శా. ప్రాతఃకాలమునందు లేచి కరుణాపారీణు నారాయణుం
జేతోజాతగురున్ గజేంద్రవరదున్ శీతాంశుబింబాననున్
సీతానాయకు భక్తవత్సలు హరి న్సేవించువారెల్ల నే
యాతంకంబును లేక కాంతురు వికుంఠావాససౌఖ్యోన్నతుల్. 219

సీ. స్నానభోజనహోమజపదేవపూజావసరముల మౌనంబు సలుపువారు
జననీజనకతీర్థసారరక్షకగురు శివవిష్ణువుల భక్తి సేయువారు
వేదశాస్త్రంబులు వివిధపురాణేతిహాసంబు లర్థంబు లరయువారు
మనములఁ జెయ్యల మాటల నొరులకుఁ గొంచక హిత మాచరించువారు

గీ. నఖిలజనములయెడ సములైనవారు, పరధనాంగనలకు నాసపడనివారు
సత్యవాక్యంబు వ్రతముగా జరపువారు, బ్రహ్మలోకంబు గాంతురు బ్రాహ్మణుండ.

వ. అనిన విని యెవ్వ రెవ్వరు నరకంబును బొందుదురు నా కెఱిఁగింపవేయని యడిగిన
గోవల్లభుం డిట్లనియె. 221

మ. కులదేవద్విజబంధువహ్నిగురురాడ్గోధర్మశాస్త్రాగమం
బుల నిందించినవారు నిర్దయమతు ల్మార్గ ప్రజాపస్నానహీ
నులుఁ గొండీలు పరార్థదారనిరతు ల్నానృత టంకంబులుం
గొలకు ల్వ్యాడ్భవతుల్యాలుం బడుదు రాక్రోశించుచున్ దుర్గతిన్. 222

గీ. అన్న ముదకంబుఁ దాంబూల మగ్ని తృణము, కూర కట్టెలు లవణంబుఁ గోరినట్టి
యతిథి కీయక లేదు లే దనెడివారి, నాలుకలు గోసి యుంతురు నరకమునను. 223

గీ. ధనము మొదలైన వేవైన ధరణిదేవతలకు నిచ్చెద నని మున్ను వలికి యీక

వట్టి యాసలు గొల్పినవాఁడు చెందు, బ్రహ్మహత్యాసమం బైన పాతకంబు. 224

ఉ. ఇన్నిటిలోఁ హాలాకలన మెక్కుడు పాపము మున్ను భూసురుల్
దున్నఁగఁ జూచి విష్ణుశివ తోయజగర్భ పురందరాదులుం
గిన్నరసిద్ధసాధ్యులును గింపురుషు ల్పితరు ల్మును ల్ఋభా
భ్యున్నతిఁ దక్క దుర్గతికిఁ బొందనుచు న్శపియించి రంతయున్. 225

ఉ. కావునఁ బుణ్యవర్తను లొకానొకవేళను బాప మన్నయా
త్రోవలఁ బోక సజ్జనులతోడుతఁ బొం దొనరించి వేదవి
ద్యావశవర్తులై మిగుల శాంతియు దాంతియుఁ గల్గి చిత్త మా
శ్రీవిభుపాదపద్మములఁ జేర్చి వరింతురు ముక్తికామినిన్. 226

గీ. చెవుల కీమాట సోఁకినఁ జింత నొంది, పాపవర్తన మంతయుఁ బరిహరించి
నీకటాక్షంబు గల్గుట నేఁ గృతార్థి, నైతిఁ బొమ్మనె గోపతి నవనిసురుఁడు. 227

వ. అదివిని భద్రకునకు గోవల్లభుం డిట్లనియె. 228

క. ఇచ్చితి వప్పుగ మును ధన, మచ్చిన యాసొమ్ము దీర్ప కయ్యో చనఁగా
వచ్చునె యది నీచేతికి, వచ్చిన విహరింతు నిచ్చవచ్చినభంగిన్. 229

వ. అనిన గోవృషంబునకు భద్రకుం డిట్లనియె. 230

క. అప్పెంత పుచ్చుకొంటివి, యెప్పగిదిన్ గోపతిత్వ మేతెంచెను నీ
విప్పుడు తీర్పం గలవే, తప్పక యెఱిఁగింపు కరుణ దళుకొత్తంగన్. 231

వ. అనిన భద్రునకు గోవృషం బిట్లనియె. 232

గీ. మూఁడు నిష్కంబు లందితి మొదల నదియుఁ, గారణంబుగ నాకిట్టి కర్మ వచ్చె
నే తెఱంగునఁ దీరుతు నీఋణంబు, వేగ వివరింపవే దయ విప్రవర్య. 233

వ. అనిన భద్రకుం డిట్లనియె. 234

క. ఈచెప్పిన ధన మంతయు, నాచేతికిఁ దెచ్చి యిచ్చి నడువుము పోతు
న్నీచెంతరాఁగ ఋణమగు, నేచిక్కులఁ బడక గోవృషేశ్వర యింకన్. 235

వ. అనిన భూసురునకు గోపతి యిట్లనియె. 236

గీ. వినుము నామాట సత్యంబు విన్నవింతు, నచ్చు మాకిద్దఱకు నిదె వచ్చు కాఁపు
వానికిప్పుడె మమ్మును వరుసనమ్ము, నిష్కములు మూఁట నీయప్పు నేఁడె తీఱు. 237

వ. అని సాష్టాంగ నమస్కారంబుచేసి గోపతి యూరకుండె బ్రాహ్మణుండును విస్మయా
కుల చిత్తుం డై మౌనంబు భజియించె నంత నొక్కశూద్రుం డతిత్వరితంబుగఁ జను
దెంచి యిట్లనియె. 238

క. అమ్మెదవేసి మ్మాల్యము, గొమ్మా నిమ్కత్రయంబుఁ గొసరేటికి నా
కిమ్మా యెద్దును బోతును, బొమ్మనుమా శాకయున్న భూసురవర్యా. 239

గీ. అనినఁ గాని మ్మటంచు ధరామరుండు, సొమ్ము గైకొన నంత నాశూద్రుఁ డపుడు
బింక మెుప్పంగ నారెంటి లంకె వైచి, తోలుకొనిపోయి తనయింట దొడ్డిఁ బెట్టె.

వ. అంత. 241

క. ఖిఱితివియ కొకటి నొకటిం, దఱుముచు నారెంటఁ బోరి తనుతనుసంధుల్
నుఱుముగఁ గంతంబులత్రాళ్లూరి బిగియఁగ నసువు దొరఁగి యొరగెన్ ధాత్రిన్.

క. అప్పు డటు చూచి శూద్రుఁడు, తప్పెనె దైవంబు చేటితడి యాఱ దయో
యప్పు గొని తెచ్చి యిచ్చితి, నెప్పగిది సహింతు నంచు నెంతయుం వగచెన్. 243

ఉ. అత్తఱిఁ బోతు నెద్దుఁ గనకాంచిత దివ్యవిమాన మెక్కి పూ
గుత్తులు దేవత ల్గురిసికొంచు నుతింప వియత్తలంబునన్
హత్తి విచార మేమిటికి నత్తువు మాకది శూద్ర నీవు మే
మత్తును వానికి న్విఱిగె నప్డు దివంబున కేగుదె మ్మనన్. 244

వ. విని పరమానందంబునుం బొంది శూద్రుండు దివ్యవిమానారూఢుండై సిద్ధసాధ్యగంధ
ర్వాదులు నుతియింప మహిషగోవృషంబులతోడి నాకంబున కరిగె ననినభీష్మునకు
యుధిష్ఠిరుం డిట్లనియె. 245

క. భూసురుఁ డేయేకర్మము, చేసెను దా మీఁదఁ గరుణ చిగురొత్తఁగ నీ
దాసునకు దెలిపి మదిలో, గాసి న్విడిపింపు మయ్య గంగాతనయా. 246

వ. అని వేఁడిన యుధిష్ఠిరునకు భీష్ముం డిట్లనియె. 247

క. ఆయర్థము గొని పెద్దలు, ప్రాయశ్చిత్తంబు సేయఁ బరిశుద్ధుం డై
కాయజగురుఁ దనమదిలోఁ, బాయఁగనీ కతఁడు చేసెఁ బరమతపంబున్. 248

క. గోవింద భక్తవత్సల, శ్రీవల్లభ వాసుదేవ శ్రీవత్సాంకా
భావభవజనక మాధవ, కావంగదవయ్య కృష్ణ కమలాక్షహరీ. 249

గీ. ఇట్లు ప్రార్థించు విప్రునిహృదయసీమ, నిలిచియున్నరమానాథుఁ డలముకొన్న
కరుణ మెఱయంగ నాకాశసరణి నిల్చి, తెల్లముగఁ బల్కెఁ గర్ణము ల్చల్లఁగాను.

ఉ. కోరిన కోరుకు ల్మిగులఁ గుప్పలు తెప్పలుగా భుజింపు మీ
దేహెఁ దపంబు చింత విడు మెవ్వరు నీసరి గారు ధారుణి
న్నారదపర్వతాది మునినాథులతోఁ దులఁదూఁగుచు న్ననా
సీరునిచెంత నిల్చెదవు చిత్తవిహారమునన్ దివంబునన్. 251

మ. అని వీతెంచిన ఖేచరధ్వనికి నాత్మానందముం బొంది శా
స్త్రనిరూఢి న్నిజకర్మము ల్గడపుచున్ జ్ఞాతు ల్బుధు ల్బంధు లా
ననఁ గోర్కు ల్భుజియించి స్వర్గమున దివ్యక్రీడల న్నిల్చె స
జ్జనసంఘంబున భూసురుండు సుఖియై సర్వంసహాధీశ్వరా. 252

క. కావున సజ్జనసంగతి, గావింపుము నీవు దానఁ గలుషము లణఁగుం
బ్రోవు లగుఁ గోర్కు లెల్లను, గైవల్యము చేతి కబ్బుఁ గలకాలంబున్. 253

గీ. పుచ్చుకొనువేళ నప్పు సంపూర్ణహర్ష, మిచ్చువేళల సంకట మేగుదెంచు
జననమరణములందున సౌఖ్యమింత, యైనఁ బొందంగలే రచ్చినట్టివారు. 254

ఆ. అప్పు చేసి యందుఁ బప్పుఁగూడు భుజించి, నంతకన్నఁ గూరఁ దించు నైదు(?)
నాఱునాళ్ళ కొక్కమాఱైనఁ గలిగిన, నూరకున్న లెస్స యుత్తములకు. 255

క. ఇక్కడ నక్కడ ననవల, దెక్కడి కేగినను వెంట నేతెంచి కడుం
గక్కసము చేయు ఋణమా, యొక్కటి వర్జించెనేని యొనరున్ శుభముల్. 256

వ. ఈయుపాఖ్యానంబు విన్న బ్రహ్మలోకంబు సిద్ధించు షణ్మాసంబులు పఠియించిన ఋణవిశుద్ధియగుం గావున సంతతంబు ధర్మం బొనరింపు మట్లయిన నిహపరంబులు చేకూరు నని ఋణంబున సత్సంగంబునం గలవిశేషంబు లెఱింగించిన గంగానందనునకు వందనం బాచరించి కుంతీనందనుం డిట్లనియె. 257

ఆ. అప్పు పుచ్చుకొన్నయతఁ డిచ్చిననరుండు, సొమ్ము దెగక మున్న సురిగెనేని
వడ్డి చెల్లకున్న వర్తింతు రేరీతి, నందు నిందుఁ దెలుపు మయ్య తాత. 258

వ. అని యడిగినఁ గుంతీపుత్రునకు గంగాపుత్రుం డిట్లనియె. 259

## ఋణవిమోచనోపాఖ్యానము.

క. సారసగర్భసుతుం డగు, నారదముని ఋణవిమోచనమ్మున సంప
త్కారణ మెఱిఁగించె శుభాధారం బిది నీవు వినుము ధర్మతనూజా. 260

క. పెట్టినవానికిఁ గలిమియుఁ, బెట్టని మనుజునకు లేమి వెంపగుచుండుం
బెట్టుటయుఁ బెట్టకుండుట, యొట్టిన తనసుకృతదుష్కృతోన్నతిచేతన్. 261

క. చదివిన కొడుకును సంపద, పాదవెట్టనితండ్రి నింద బొరయనితల్లిన్
మదినున్నపగిది నడచిన, సుదతియుఁ జెలికాండ్రటండ్రు సుజనస్తుత్యా. 262

ఆ. సాధ్వి గానితల్లి చదువనితనయుండు, నప్పు మిగులఁ జేసినట్టి తండ్రి
మాటఁ గడచి నడుచుమానిని శత్రువుల్, గాఁగ నెఱుఁగవలయుఁ గారవేంద్ర. 263

క. అచ్చినవానికి దుఃఖం, బిచ్చినవానికిని సౌఖ్య మేలోకంబు

ల్వొచ్చినఁ దప్పవు కావునఁ, బుచ్చుకొన న్వలవ దప్పు పుణ్యాత్ములకున్. 264

సీ. ఈయర్థమున కొక్కయితిహాస మెఱిఁగింతుఁ బాతకహరము సుపత్కరంబు
విజ్ఞానహేతువై వెలసినయది విను కృతయుగంబునఁ దొల్లి కీర్తిశాలి
బాంధవహితకారి బ్రాహ్మణశ్రేష్ఠుండు కౌశికుం డనువాఁడు ఘనుఁ డొకండు
ధనవంతుఁ డై సర్వధర్మంబు లొనరించి పుణ్యవర్తనఁ దచుఁబోలుచున్న

గీ. తనయునిం గాంచి వాఁడును దానుఁ గూడి, బేరమాడియుఁ జదివియుఁ బోరగెల్చి
వ్రాసి వ్యవసాయములు చేసి వడ్డి కిచ్చి, కూడఁబెట్టెను దాఁ బదికోట్ల సొమ్ము. 265

వ. ఇట్లు ధనంబు గూడిన. 266

చ. తనకును సత్యశీలుఁ డనుధర్మరతుండు ధరామరుండు ని
ర్ధనుఁ డొకఁ డాప్తుఁడై సుతులుఁ దాను మెలంగుచునుండ వడ్డియా
సను దనతోడ స్నేహమున సంతసమైన ధనంబు కద్దు లే
దనక యొసంగె నాతనికి నప్పుగ వేఁడిన యంత యంతటన్. 267

గీ. కొంతకాలంబు చనిన నాక్షోణివిబుధు, లిద్దఱును నాశమొందిన నితనూజు
భటులు గొనిపోయి తమరాజుపజ్జ నునిచి, యొఱుక గావింపఁ గౌశికుం డిట్టులనియె.

ఉ. దండము నీపదంబులకు దండధరా వినవయ్య సత్యశీ
లుం డని పేరుపెట్టుకొని లోకము వంచన చేసినాఁడు కా
కుండిన నున్ననాఁ డెవని కొప్పన చేసెనొ ముల్లెపీఁడు తా
గుండియవాఁడు పల్కఁడెటు గొట్టినఁ దిట్టిన నడ్డపెట్టినన్. 269

క. అచ్చపలె వచ్చు ముచ్చట, లెచ్చటివో కొన్ని పల్కు నేమైనను జేఁ
జొచ్చినఁ జను మఱి తాఁ గాఁ, డిచ్చిన దక్కించుకొనఁగ నీతఁడె నేర్చున్. 270

ఉ. కల్లలుగాదు నేరుపుగట్టి ధరాదివిజుండు వీనికిం
జిల్లరగాఁగ నిచ్చినది చెప్ప నశక్యము సత్యశీలుఁ డం
చెల్లరు సన్నుతింప సరియిచ్చిన నమ్మితి నేతిబీఱయుఁ గా
బెల్లముకొండ యోట మదిఁ బెట్టక యూరక మోసపోయితిన్. 271

గీ. బురదగుంటలోఁ ద్రొబ్బియుఁ బొగడదండ, చుట్టి తాయెత్తియిల్లడ వెట్టి మఱియు
నెంత బాధించినను ధన మీయఁ డయ్యె, వట్టి రట్టున కిదె యొడి గట్టుకొంటి.

క. ప్రాతఃకాలము నద్దము, రేతిరి యేతెంచి వేఁడ లే దనక కడుం
బ్రీతిఁ గలయంత యొసఁగితిఁ, జేతులు దులుపుకొని యుండ శివుఁడే యెఱుఁగున్.

గీ. వచ్చియున్నాఁడు తాఁ గాని వానిపలెనె, గోముఖవ్యాఘ్ర మీతనిగుణము మేఁడి

కాయబోనంబు నిలువెల్లఁ గలుషరాశి, మాటికొకమాట నిజమాడ నోచఁ డెందు.

వ. అని విన్నవించుచున్న కౌశికువాక్యంబులు విని ఋణస్థుం డైనసత్యశీలుండు భయంకరరూపంబు దాల్చియున్న దండధరునకు దండం బిడి యి ట్లనియె. 275

క. పాపాత్ముఁడ నీముందఱ,నోపుదునే విన్నవింప నొక్కటి యైనం
జేపట్టి రెవ్వ రంతక, నీపై భారంబు వెట్టి నిజ మెఱిఁగింతున్. 276

సీ. పుత్త్రమిత్త్రాదులఁ బోషింపఁగా నొకకాసైన లేక యీకౌశికునకు
క్షేత్రంబు లడి వెట్టి చేసితి నప్పులు గాని దైవముసాక్షి కల్ల గాదు
తత్కాలమున సర్వధారుణీపతులకుఁ గలహంబు పెట్టియ్యెఁ గఱవు దోఁచె
శారీరమానససంతాపములు మించె నఖిలజనంబుల కంత నంతఁ

గీ. బరబలంబులు చేకొనెఁ బంట లెల్లఁ, బశుధనంబులు దొంగలపాలుపడియె
దాసదాసీజనంబుల ధారుణీశ, భటులు తీసుకపోయిరి పన్నుకొఱకు. 277

గీ. చేయునది లేక నేరిత్తచేత నుండ, నాయమ వేగిన నీభటు లరుగుదెంచి
పాశములఁ గట్టి యీరీతి బాధపెట్ట, నమమ దూఱెదు నిఁకఁ దేమి నొడువువాఁడ.

క. వీఁక చెడ నీదు దూతలు, ప్రాఁకంగా నిప్పు డప్పు పైక మడుగు నీ
తేఁకువ గోర్చ్చట్టుపయిన్, రోఁకలిపోటనెడుమాట రూఢం బయ్యెన్. 279

చ. ఘనుఁ డగు కౌశికుండు మణికాంచనదివ్యవిమాన మెక్కి యో
యినసుత మీసమీపమున నెల్లదిశ ల్మెఱుఁగెక్కనుండియున్
మునుపటురీతిఁ బ్రీతి మది మొల్వఁ గనుంగొనఁ దేపగించు నీ
చునిబలెఁ దేజము ల్పడలఁ జుట్టములే పగవారుగా ధరన్. 280

క. గహనంబు ముట్టి వెలిఁగెడు, దహనుని కాపుండు మారుతం బతఁడే కా
ప్రహరించు దీప మొలసిన, నహహా కృశు లైనవారి కాపులు గలరే. 281

వ. అని విన్నవించు సత్యశీలునకు సమవర్తి యి ట్లనియె. 282

క. మెచ్చిచ్చినఁ గారుణ్యము, వచ్చిచ్చినఁ బుణ్యగతులు వల సిచ్చిన న
ప్పిచ్చిన నుచితం బిచ్చిన, నిచ్చనధనికుండు పూజ్యుఁ డెచ్చట నైనన్. 283

ఆ. అతిథిపూజ సేయునతఁ డాహితాగ్నియుఁ, జుట్టములకుఁ బిలిచి పెట్టువాఁడు
మంచివర్తనంబు మరగిన మనుజుండు, సుఖము గాంచుచుండు సుగతి యందు. 284

క. చాటుఁడు కొండీఁడు దురాచారి కృతఘ్నుండు నిందసలిపెడువాఁడుం
గాటొడ్డె కాఁడు ఋణియును, బారము ముట్టంగ లేరు బహుదుఃఖములన్. 285

సీ. పెట్టు లేకుండ మనుజుండు పుట్టఁ డెందు, లేమి నొనరించుఁ బాపంబు లేమి యైనఁ

బాపములు చేసి నరకంబు పాలుపడును, దిరుగఁ దిరుగను జేవ కీతరువు నిజము.

క. ఏనుఁడి పితరులు రాజులు, ఘనులగువారెల్ల సకలకల్మషహరమై
వెనుపొందున్యాయసారము, మునుపుగఁ దెలిపెదను లోకమునకు స్మితున్. 287

క. అప్పు గొని తీర్ప కఱుగునె, యప్పటికే కాక దాత కాశ్రై బిడ్డై
యొప్పింపఁగఁబడుఋణికుఁడు, తప్పదు తానెంత కార్యదక్షుండైనన్. 288

వ. ఇత్తెఱంగునఁ బితామహుండు సత్యలోకంబునఁ దనకెఱింగించె నదియ నిశ్చయార్థంబని సూర్యనందనుండు పాలించుచుండె నీవు నిది యెఱింగి ఋణంబు గావింపకు శాశ్వతసుఖంబు చేకూరు ఋణవిమోచనకథ విన్నవారలకు సర్వపాపవిముక్తియుం ఋణవిమోచనంబు నగు నని లోకరక్షకుం డైనపుండరీకాక్షుని యాజ్ఞాక్రమంబున భీష్ముండు ధర్మరాజున కెఱింగించినచందంబు వైశంపాయనుండు జనమేజయునకుం దెలిపినట్లు సూతుండు శౌనకాదులకుం బలుకుటయును. 289

క. మిత్రకులతిలక విశ్వామిత్రాధ్వరరక్ష ణార్యమిత్రావన సౌ
మిత్రీ హనుమద్ధాత్రీ, పుత్రీశత్రుఘ్నభరతపూర్ణకటాక్షా. 290

మ. సరయూతీరవిహార హారమణిభూషామల్లికాగంధబం
ధురశోభాంచితకాయ కాయజరిపుస్తోత్రోల్లసచ్చిత్త చి
త్తరుదీవ్యత్ఫలసార సారసరిపుస్థానాగ్రగాధీశభూ
ధరజిద్భాసురకీర్తివర్ధన ధనత్యాగధ్వజస్థాపనా. 291

మాలిని. సజలజలదనీలా సత్తతాళీవిశాలా
త్రిజగదవనలీలా దీపికానేకహేలా
సుజనవినుతశీలా శుద్ధసౌవర్ణచేలా
విజితదనుజపాలా విశ్వరూపాలవాలా. 292

గద్యము. ఇది శ్రీమన్మదనగోపాలలీలావలోకన పవిత్ర శరణయామాత్యపుత్ర సకలవిద్యానిధాన తామరపల్లి తిమ్మయప్రధానప్రణీతం బైన హరివంశోదితం బైన యాశ్చర్యపర్వంబునందలి శేషధర్మంబునఁ బాపంబులు పాపకర్ములుండు నివాసంబులుఁ బుణ్యంబులుఁ బుణ్యవంతుల కబ్బులోకంబులు యమమార్గవిస్తారంబు మానవులు బాల్యయౌవనవార్ధకంబుల వర్తించు తెఱంగు గంగాసాలగ్రామహరివాసరంబుల మాహాత్మ్యంబును బలభద్రుండు దూతం బంపినఁ గృష్ణుండు పాండవులకు ధర్మకథ లుపన్యసింప గాంగేయుఁ నియోగించి ద్వారకకుం జనుటయుం భద్రకగోవృషసంవాదంబును ఋణవిమోచనోపాఖ్యానంబును ననుకథలం గల తృతీయాశ్వాసము.

---

# చతుర్థాశ్వాసము.



మహిత పెద్దధర్మా
జీమంత్రివరేణ్యరచితసేవాత్యంత
ప్రేమస్తోమా సీతా
రామా హృదయాభిరామ రఘుకులరామా. 1

వ. విన నవధరింపు మఖిలపురాణవ్యాఖ్యానముద్రాసమేతుం డైన సూతుండు శౌనకాది
మహామునులకు మున్ను యుధిష్ఠిరునకు గంగానందనుం డానతిచ్చినప్రకారంబున
జనమేజయునకు వైశంపాయనుం డెఱింగించె నని బోధించి మఱియు నిట్లనియె. 2

క. వ్రతములలో నుత్తమ మగు, వ్రత మెయ్యది తెలుపుమయ్య ప్రజ్ఞావాచ
స్పతి నీ వటంచుఁ గుంతీసుతుఁ డడిగిన దివ్యతటినిసుతుఁ డిట్లనియెన్. 3

ఆ. మును సనత్కుమారముని నాకుఁ దెలియ జయంతివ్రతవరేణ్య మనుచుఁ దెలిపెఁ
దోఁచినంత దానిదొడ్డతనం బెల్లఁ, దగ వచింతు వినుము ధర్మతనయ. 4

క. ధనమును ధాన్యము రాజ్యము, తనయులు మొదలైనసంపదలు మదిఁ దలఁపం
బెనుపొంద జయంతీవ్రత, మొనరించిన నంతకంత కూర్జితము లగున్. 5

గీ. ధర జయంతికి సెనయైనధర్మ మరయఁ, గలుగునే యది మోక్షైకకారణంబు
హరికిఁ బ్రియ మైనదియుఁ నగునట్టిదినము, విప్రముని సురసేవ్య మై వెలయుచుండు.

ఆ. పుణ్యబుద్ధి గలుగు పురుషులకు జయంతి, నన్న మారగించు టనుచితంబు
ఆరగించెనేని నధికపాపంబుల, నిరయములను వెడలనేర రెపుడు. 7

క. ఎన్నికపాపముచేసిన, నన్నరుఁ డైనను జయంతి [1]నాహారము గో
కున్నను మన్నన గలుగును, వెన్నునిలోకంబులోన విహరింపంగన్. 8

క. రేపాడి లేచి నియమము, దీపింపఁగ స్నానవిధులు దీర్చి రమేశ
గోపాలుని జాగరణము, చూపట్టఁగఁ బూజసేయ సుగతి లభించున్. 9

క. [2]జపదానవ్రతపరులై, యపకారము సేయ వలవ దన్యులకెల్లం

---

1 నాహారంబు, నన్నయొనరింపఁ గలుగును, వెన్నునిలోకంబునందు. 2 ఉప
వాసవ్రతతత్పరు, లపకారము.

కృప గలిగి శక్తి కొలఁదిని, నుపకారము లాచరింప నొదవుం గోర్కుల్. 10

వ. శ్రీజయంతివ్రతంబు శ్రద్ధాభక్తియుక్తులై యొనరించువారికి నశ్వమేధసహస్రఫలంబును వాజపేయశతంబు లాచరించినఫలంబు సిద్ధించు గోతిలకన్యాదానంబులు చేసిన కోటికులంబులవారితోడంగూడ విష్ణులోకవిహారంబు చేకూరు జయంతి మోక్షంబు నొసంగుఁ గృష్ణాష్టమీభక్తియు బ్రహ్మలోకంబు గలిగించు నీరెండుఁ గృష్ణున కత్యంతప్రియకారణంబు లిందు కొక్కయితిహాసంబు ధర్మవ్రతచరితంబునా మెఱయు నెఱింగించెద విను మని యిట్లనియె. 11

## ధర్మవ్రతచరిత్రము.

సీ. ధర్మస్వరూపమై తనరు కురుక్షేత్రమునఁ జంద్రవంశసముద్భవుండు
చంద్రకాంతసుతుండు చంద్రికాచంద్రమస్తారహీరపటీరచారుకీర్తి
ధర్మవ్రతుండను ధారుణీపతి గలఁ డాయన ప్రజనెల్ల నధికధర్మ
వర్తనలను గాచు పరనర్మదార్క జాతీరదేశములను దేజ మెసఁగ

గీ. నశ్వమేధంబులను బదియాఱు రాజ, సూయములు ముప్పదైదును సురలు వొగడఁ
జేసి పదివేలయేఁడు లశేషధరణి, నేలి తనయులు లేకున్న నెలమి దొఱఁగె. 12

క. అంతట శత్రుమహీశులు, వంతుల కరుదుగ నమాత్యవర్గముచేతన్
దంతితురంగపురశ్రీ, లెంతయు నిడి తపము సేయ నేగె న్వనికిన్. 13

ఉ. అక్కడ మంచు నిండిన జలాశయమధ్యమసీమ వర్షముల్
గ్రిక్కిఱియంగఁ బెన్బయల గ్రీష్మము హెచ్చిన వహ్నికీలలన్
మక్కువ నిల్చి దృష్టి రవిమండలిఁ జేర్చి రమేశు నెమ్మదిం
జిక్కఁగఁ బట్టుచుం దపము చేసెను మిత్రసుతాతటంబునన్. 14

వ. ఇట్లు నిద్రాహారంబులు లేక మూఁడువేలయేండ్లు తపంబు గావింప వెఱచి దేవతలు రంభాతిలోత్తమాప్రముఖాప్సరోగణంబులం బంపి విఘ్నంబు గాకుండుటం దెలిసి సత్యలోకంబున కరిగి యంజలిపుటంబు మస్తకంబునం జేర్చి ధర్మవ్రతుం డుగ్రతపంబు సేయుచున్నవాఁ డేమి తలంచియో దివంబుననుండ నోడెదము మీకరుణాకటాక్షముల రక్షింపవే యని ప్రార్థించినఁ బద్మగర్భుం డిట్లనియె. 15

ఉ. వినుఁ డో దేవతలార మీకు హితము న్విన్పింతు ధర్మవ్రతుం
డనఘుం డాతనివల్ల సాధ్వసము గోరం తైన లేదేరికిం
జనుఁడా వచ్చినత్రోవల న్మరల మీ సంతాపము ల్మాని మీ
వెనువెంటం బఱతెంచి కోర్కు లిడుదు న్విశ్వంభరాభర్తకున్. 16

గీ. అనిన విని శాపములు మాని యమరు లెల్ల, స్వర్గమున కేగి రంత నాజలజభవుఁడు
వరము లీడేర్ప నామహీవరునికడకు, నింతితో వచ్చి యెఱిఁగించి యిట్టు లనియె.
క. ధర్మవ్రత బళి బళి నీ, నిర్మలతప మరిది దివిజనికరం బెల్లన్
మర్మంబు నాటఁ బొగడినఁ, గూర్మిం జనుదెంచినాఁడఁ గోరుకు లొసఁగన్. 18
ఆ. కోరికొమ్ము నీదు కోరుకు లీడేరె, నర్థి నిత్తు వలయు నర్థ మనిన
విని విరించనునకు వినతుఁడై ధర్మవ్ర, తుండు పలికె ముదము దొట్టికొనఁగ. 19
ఉ. కాంచనగర్భ నీకరుణఁ గాంచినవారలు వాంఛితార్థముల్
గాంచుట యబ్బురంబె ననుఁ గావఁ దలంచెదవేని సూనులం
గాంచనివారు సద్గతులు గాంచ రటంచు శ్రుతు ల్వచించు నా
కొంచెముఁ దీసివేసి సుతుఁ గోవిదు నిచ్చి కృతార్థుఁ జేయవే. 20
వ. అని సుతోదయంబు వేఁడిన ధర్మవ్రతునకుఁ గాంచనగర్భుం డిట్లనియె. 21
క. జయశుభకారణము జయంతి యన న్వెలసిల్లు విష్ణుదివసం బది నీ
కయనయయుతునిం దనయుని, దయచేయును నోమవయ్య ధరణీనాథా. 22
వ. అనిన వాణీపతికి ధర్మవ్రతుం డిట్లనియె. 23
క. శత్రువులు గొనిరి రాజ్యము, పుత్రకులా పుట్ట రెట్లు పురమున నుందున్
సూత్ర మెఱిఁగించి కరుణకుఁ, బాత్రము నను జేసి కావు పంకజగర్భా. 24
వ. అనిన ధర్మవ్రతునకు వాణీపతి యి ట్లనియె. 25
భుజంగప్రయాతము. జయంతీవ్రతం జేసి సాగించి వాణీ
ప్రియత్వాధిరాజ్యంబుఁ బెంపొందఁ గంటిం
బ్రియాయుక్తి నీవాచరించీవ్రతం బె
ల్లయిష్టంబు లీడేర్చిలానాథచంద్రా. 26
క. అని పలికి పద్మగర్భుఁడు, చనియె న్నిజసదనమునకు శక్రాదిసురల్
తనుఁ బొగడఁగ ధర్మవ్రతుఁ, డనుమోదరసాబ్ధిఁ దేలియాడుచుఁ బురికిన్. 27
గీ. వచ్చి పరమేష్ఠి పలికినవాక్య మాప్త, మంత్రివరులకు నెఱిఁగించి మగువఁ గూడి
దివిజు లరుదందఁగా జయంతీవ్రతంబు, నడిపి చంద్రప్రభుం డనుకొడుకుఁ గాంచి. 28
క. వైరినృపాలుర నందఱఁ, బోరుల నుఱుమాడి రాజపుంగవుఁ డనఁగా
ధారుణి యేలెను నీకుం, గోరుకు లీడేఱుఁ జేసికొమ్మీ వ్రతమున్. 29
సీ. కౌశలస్థవిభుఁడు మాగధిఁగూడి యొనరించి రాజవల్లభుఁ డగు రఘువుఁ గాంచె
దండకాటవిని సీతాయుక్తుఁడై చేసి రామచంద్రుఁడు కుశలవులఁ గాంచెఁ

పౌలోమియును దాను బలభేది గావించి యధికసౌందర్యు జయంతుఁ గాంచె
గిరిజాసమేతుఁ డై హరుఁ డాచరించి నిర్జరచమూపతి శరజన్ముఁ గాంచెఁ

ఆ. గుంతి మాద్రిఁ గూడి కోమ రొప్పఁగా నోమి, పాండురాజు దివ్యబలుల మిమ్ముఁ
గాంచె నాజయంతి గొంచెమే తగు రాజ్య, విభవ మొసఁగుఁ జలుపు వెలఁదితోడ. 30

క. ఈకథ విన్నమహాత్ములు, నైకొందురు పుత్రపౌత్రకాంచనరత్న
శ్రీకరిహయరాజ్యసుఖం, బాకైవల్యంబు కరతలామలక మగున్. 31

వ. అనిన విని బహుప్రకారంబుల నుతియించి మోక్షోపాయంబును సత్సంగంబును
నెఱింగింపవే యని ప్రార్థించిన యుధిష్ఠిరునకు భీష్ముం డి ట్లనియె. 32

## మోక్షసత్సంగమప్రభావము.

క. హరిపదభక్తియు సజ్జన, పరిచర్యయుఁ జాలు నెట్టి పాపాత్మునకున్
దురితంబులు పోకార్పను, స్థిరతరకైవల్యపదముఁ జేరుప నిచ్చన్. 33

సీ. విను పార్థ యిందిరావిభుని మాహాత్మ్యంబు లతని కెంతయు దాసులైనవారి
కక్షయపద మబ్బు నందుల కితిహాస మెఱిఁగించెదను ము న్నపహీనబలుఁడు
ఖలుఁడు క్షత్రియుఁడు నక్షత్రవర్మ యనంగఁ గలఁ డొక్కరుఁడు లోకకంటకుండు
అతఁడు గోసురభాగవతవిప్రవిత్తంబు లన్యాంగనాతతి నభిలషించి

గీ. వెలసి కోయల బోయదొంగలను గూడి, పట్టి బందెల దెరువాట్లఁ బ్రజకు నెల్ల
వగలఁ గావించి పాపము ల్మిగులఁ జేసి, నడచె నొకనాఁ డల విదేహనగరమునకు. 34

వ. ఇట్లు చని. 35

చ. కనుఁగొనె భూవిభుండు మణికాంచనసంచితపంజరాంచిత
స్వనజనచిత్తహారి శుకవారవిహారి విహారణార్థనూ
తనవనజాక్షలక్షణకథాగుణపాత్రవిచిత్రచిత్రలే
ఖనవవజ్రమందిరవికాసి విదేహపురంబు సొంపుగన్. 36

చ. కనకము గానిగోడ సురకాంతలు నిల్వనిమేడ విద్యలం
దనియనిప్రోడ ముత్యములు దాఁపనివాడ పటీరధారల
న్మునుఁగనిజాడ కెంపుపనిముట్టనిగూడ సురద్రుమంబులం
బెనఁగనినీడ చూడఁగవు దోఁప దొకింతయుఁ నాపురంబునన్. 37

ఉ. ఆపురిచెంత దివ్యమణిహాటకకుంభశతాకులంబు మా
క్షోపరిణద్ధతోరణవితానము దివ్యనదీయుతాంబరో

ద్దీపకపార్శ్వహీరమణిదీధితిమద్ధరనీలవిస్ఫుర
స్ఫురమై చెలంగు నొకజోవెలఁ గాంచి ప్రమోద మొందుచున్. 38

క. ఇక్కడి మణికాంచనములు, దక్కించుకొనంగవచ్చు దైవము తన కీ
యిక్కువ చూపె నటంచును, జొక్కుచుఁ గోవెలకు నేఁగి సురుచిరనిష్ఠన్. 39

ఉ. ధ్యానము సేయుచున్నహరిదాసుఁ దపోనిధి భూసురేంద్రు వి
జ్ఞానమయాత్ము నిస్పృహుని సాధు సుదంతుని జూచి కార్య మీ
మానవుఁ డుండఁ గూడునె రమాపతిఁ జేర్చుట యుక్తమంచుఁ బ్రో
త్థానుఁ డై నిశాసమయ మప్పుడు తన్మునిఁ జేర నొంపఁగన్. 40

గీ. ఖలజనోత్తముఁ డైన నక్షత్రకుండు, సొమ్మసిలిపోవఁ బదమున బొమ్మ ద్రొక్కి
యొక్కకరమున జడ లెల్లఁ జిక్కఁబట్టి, కత్తియొఱ దీసి పరిమార్పఁగాను జూచె. 41

వ. అది గనుంగొని యుదంకుం డిట్లనియె 42

క. తప్పేమి లేని మాన్యుని, నొప్పించెద వెందు నీవినోదము గలదే
కప్పిడఁగ నేల నొప్పమి, నిప్పుడ యెఱిఁగింపు కలిగెనేని మహాత్మా. 43

క. కొట్టినఁ దిట్టిన బాధలఁ, బెట్టినఁ బాపాత్ము నయినఁ బెద్దలు కరుణన్
నెట్టైనవేళఁ గాతురు, కట్టిడులై హింససేయఁ గడఁగ రధీశా. 44

క. పొగరెక్కి పగలు దెచ్చిన, పగతుర చేఁజిక్కెనేని బండితులెల్లన్
సుగుణంబు లెంచి కాతురు, పగసాధింపంగఁబోరు పార్థివముఖ్యా. 45

క. పరు లెంతకీడు దెచ్చిన, నరవరియై మాఱుసేయ కతిశాంతుండై
తిరిగినమానవుఁ డుత్తముఁ, డరయంగా విష్ణుభక్తుఁ డతఁడే ధాత్రిన్. 46

వ. అని మఱియు నిట్లనియె. 47

ఆ. సర్వసంగంబు మిక్కిలి సంతఁబెట్టి, తపసియైయున్న ననుఁ జంప దగ్గఱిల్లు
నీదురాచారవర్తనుఁ డెల్లవారి, హతులఁ గావించు విధియెంత యధికమొక్కొ. 48

క. పాపాత్ము లొరుల నూరక, చూపోపక బాధపెట్ట సొగయుచు నెందుం
బైపడుదురు దుస్స్వాధత, దీపించిన సాటివారి తెఱఁగెఱుఁగ రిలన్. 49

గీ. పుత్రమిత్రకళత్రాది పోష్యవితతి, సాకభారంబు తమకంచు సంతతంబు
సకల జనులకు ద్రోహంబు సంతరించి, దుఃఖ మొనరించు నామాయ దొడ్డ దార. 50

క. ధనమఱిమి తెచ్చి పెంచిన, జనులం దిగనాడి యొకఁడె చను నంతమునం
దనకూఁతురు తనకొమరుం, డను మమతయె చెఱచు వ్యర్థ మఖిల జగంబున్. 51

క. ధనము ఘటియించి తెచ్చిన, ధనుకనె సుతబంధుమిత్రతరుణులు ధర్మం

బు నధర్మము వెనువెంటను, జనుదెంచును దనదునీడ సరణిన్ ధరణిన్. 52

క. ఖలుఁ డార్జించిన ధనములు, పలువెఱఁగుల బంధుజనులు భక్షింతురు వి
చ్చలవిడి నా పాపంబుల, ఫలములు తానొకఁడె కుడుచుఁ బటుదైన్యమునన్. 53

వ. ఇత్తెఱంగునం బలుకు నామునీంద్రుని విడిచి నక్షత్రకుండు సత్సంగమంబున హరి సన్నిధిమాత్రంబున నిఖిల దురితంబులఁ బరిహరించి పశ్చాత్తాపంబు నొంది వణంకుచు నంజలిపుటంబు ఫాలభాగంబునం జేర్చి నాయపరాధంబు సహింపవే యని ప్రార్థించుచు నిట్లనియె. 54

ఉ. ఎన్నఁగరాని పాతకము లెల్ల నొనర్చినవాఁడ నిందె నా
కెన్నఁడు నిష్కృతు ల్గలుగు నెవ్వనికి న్స్మరణంబు చొత్తుఁ బా
పోన్నతి బోయలం గలసి యుండితి రాచతనంబు పొల్లుగా
నిన్నిదినంబు లెద్దిగడు వింక లభించెడు జన్మ మెట్టిదో. 55

గీ. పాపకర్మునిఁ బుట్టించి బ్రహ్మ భూమి, కధికభారంబు గావించె నౌర తాను
జేసినంతయుఁ గుడువక చెల్లదనుచు, నపుడు దేహంబు విడిచె నయ్యవనివిభుఁడు. 56

ఉ. అంతట నానృపాధముని యాకృతిఁ జూచి యుదంకుఁ డబ్ధిజా
కాంతుని పాదపద్మభవకంకణముల్ పయిఁ జిల్కె నింకనే
చింతలు మాని ముక్తి సరసీరుహనేత్రకరంబుల న్ముదా
క్రాంతము గాఁగఁ బెట్టుమని కంకణము ల్దయసేయు కైవడిన్. 57

క. హరిపాదజలము సోఁకిన, దురితంబు లణంగి దేవదుందుభు లులియన్
సుర లలరఁగ నక్షత్రుఁడు, హరినీలవిమానమెక్కి యమ్ముని కనియెన్. 58

ఉ. జ్ఞానముఁ దెల్పి విష్ణుపదసారసవారికణాళి నంగము
ల్నానిచి పాతకౌఘము లణంచి వికుంఠపురీపదంబుకై
కానుక చేసి కాచితి వకారణబంధుఁడ వోయుదంక యే
మైన నొనర్చెద న్వలయు నర్థము శిష్యుఁడ నానతీయవే. 59

గీ. అని యుదంకుని తలమీఁద నమరకుసుమ, విసరముల నుంచి వలగొని వినుతి చేసి
మణిగణాంచితదివ్యవిమాన మెక్కి, హరిపురంబున కరిగె నచ్చరలఁ గూడి. 60

వ. ఇట్లు నక్షత్రకుండు వైకుంఠలోకంబున కరుగ నీక్షించి యాశ్చర్యమగ్నమానసుండై యుదంకమహామునీంద్రుండును మస్తకంబున నంజలి చేర్చి యిందిరావల్లభు నీచందంబున స్తుతించె. 61

చ. తలఁపఁగరాని పాపములు తా నొనరించియు నీసుసన్నిధి
న్నిలిచినయంతమాత్రమున నిత్యవిభూతి భజించె నీఖిలుం
డలవడ నిన్నుఁ గొల్చినమహాత్ములకు న్గలవే యసాధ్యము
ల్జలజదళాక్ష పద్మభవసన్నుత కృష్ణ ముకుంద మాధవా. 62

మత్తకోకిల. కావు కావుము నీపదంబులె కాని యన్య మెఱుంగ నో
దేవదేవ ముకుంద మాధవ దీనరక్షక కృష్ణ రా
జీవలోచన యిందిరాప్రియ సిద్ధసాధ్యసురేంద్ర సం
సేవితాంఘ్రిసరోజ కేశవ చింతితార్థఫలప్రదా. 63

క. అని వినుతించిన మునికి, న్వనజాక్షుఁడు చిహ్ననామ వర్ణనగుణముల్
గనిపించి తోడుకొంచుం, జని తన నెలవున నొసంగె సారూప్యంబున్. 64

క. కావున సజ్జనసంగతి, గావింపుము నీవు దానఁ గలుగు నిజంబా
కైవల్యము నారదముని, దేవసుతుం డతనియొద్దఁ దెలిసితి వత్సా. 65

వ. ఈయుపాఖ్యానంబు విన్నవారు విరక్తియు విష్ణుభక్తియుఁ గలిగి బ్రహ్మలోకంబు కరతలామలకంబుగా వైకుంఠలోకంబున వసియించి యెల్లవంశంబువారి నుద్ధరింతు రనిన విని యుధిష్ఠిరుండు సంతుష్టాంతరంగుండై కావేరీదక్షిణతీరంబున శంఖతీర్థంబు గల దని శ్రీకృష్ణుండు మున్ను సూచించెఁ దత్తీర్థంబు నుభయతటంబుల విలసిల్లు నవి దివ్యక్షేత్రంబులు గావునఁ దదీయమాహాత్మ్యం బెఱిఁగింపవే యని ప్రార్థించిన భీష్ముం డిట్లనియె. 66

గీ. వనజగర్భుండు నారదమునికిఁ దెలిపె, నతఁడు ధరణీప్రదక్షిణ మాచరించు
వేళ నెఱిఁగించె నాకు నే విన్న కన్న, విధము వినిపింతు వినుము కావేరిమహిమ.

## శంఖతీర్థమహిమానువర్ణనము.

గీ. ప్రబలు కావేరిదక్షిణపార్శ్వమునను, జలజనాభుని వెనుకను శంఖతీర్థ
మచటఁ దప మాచరించి సుధాంశుఁ డధిక, కాంతి విలసిల్లె మధువైరికరుణఁ గాంచి.

వ. అనిన భీష్మునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 69

క. ఘోరతప మేలచేసెం, దారాధిపుఁ డతనికొఱకు దానవహరుఁ డే
తీరున వరంబు లొసఁగెను, గారుణ్యము మెఱయఁ దెలుపు గంగాతనయా. 70

వ. అనిన యుధిష్ఠిరునకు భీష్ముం డిట్లనియె. 71

క. తారావిభుఁడు బృహస్పతి, నారిన్ హరియించి కుసుమనారాచశరా
సారప్రహతుల కులికి విహారం బొనరించుచుండె ననవరతంబున్. 72

ఉ. అంతట నీగతిఁ బహుళహాయనముల్ చన మెల్లమెల్లగా
నంతట నింతటన్ దివిజు లాడికొనంగ నెఱింగి రోషసం
క్రాంతమనస్కుఁడై గురుఁడు కాంతకు వల్దని చెప్పి రోహిణీ
కాంతుని కిచ్చె శాప మధికక్షయనిందల కాస్పదంబుగన్. 73

గీ. ఇట్లు శపియింప వేలుపులెల్లఁ గూడి, వేఁడికొన నాకలోకంబు విడిచి నడచి
సత్యలోకంబునకు నేగి జలజగర్భు, కొలువుకూటంబునకు వన్నె గలుగ నిలిచె. 74

చ. అదిమొదలా మృగాక్షిని బృహస్పతిపత్ని మహాభయంబున
న్వదలి సుధాంశుఁడు న్బహుళవత్సరము ల్చన నిచ్చ నచ్యుతున్
మదిఁ బదిలంబుగా నిడి సమంజసవృత్తిఁ గృశాంగుఁడై తపం
బొదవ నొనర్పఁగా దివిజు లొక్కటఁ గూడి విచారసంగతిన్. 75

క. గురుని వినుతించి చంద్రుం, గరుణించుచు వృద్ధి యొసఁగి కావుము తిరుగన్
ధరణి మము నిలుపు మనుచున్, శరణొందిన సురలకోర్కి సలిపె నతండున్. 76

ఆ. తారకావిభుండు తపమున గురుదయా, మహిమచేత వృద్ధి మరలఁ గాంచి
యప్పు డధికభక్తి నబ్ధికన్యాపతి, జలజనాభు నిట్లు సన్నుతించె. 77

ఉ. వారిజనాభ భక్తజనవత్సల కౌస్తుభవక్ష కృష్ణ పం
కేరుహగర్భముఖ్యపరికీర్తిత పాదసరోజ మాధవా
వారిధికన్యకారమణ వాసవవంద్య మదీయపాపముల్
వీఱుగఁ జేసి ఘోరతరనీరధిపారముఁ జేర్పవే హరీ. 78

మ. కరిరా జక్కఱ కేగుదెంచి ధ్రువునిం గైచేసి ప్రహ్లాదునిం
బరిరక్షించి విభీషణు న్నిలిపి యాపాంచాలిమానంబు పో
సరపోకుండఁగఁ గాచినట్టిహరికిన్ సర్వంసహాభర్తకుం
గరుణావార్ధికిఁ గృష్ణమూర్తికి నమస్కారంబు గావించెదన్. 79

చ. అని వినుతించుచుండఁగ మురారి బలారిముఖామరౌఘముల్
తను గొలువ న్సుపర్ణగతి దారునఁ జేరి వరంబు గోరు మీ
వనఁ గనువిచ్చి చూచుచు బృహస్పతి యిచ్చినశాప మంతయుం
జనఁ దనుకాంతి వర్ధిలఁగఁ జంద్రుఁడు వేఁడె నమస్కరించుచున్. 80

క. ఈరీతి వరముఁ గోరెడి, తారాపతి శంఖవారి తనపైఁ జిలుకం
గోరిక యిచ్చితి రమ్మని, చేర న్రావించి చేర శ్రీహరి పలికెన్. 81

గీ. తారకానాథ నీతపఃస్థలము శంఖ, తీర్థ మన మించు నిం దొక్క తేప స్నాన

జలకమాడినవారికి సకలసంప, దలును విలసిల్లు లేకున్న బలియుం లేమి. 82

సీ. అని సుధాంశుని బల్కి యాశంఖతీర్థంబు మునపటికిక్కనఁ బొందుగాఁగ
శ్రీనివాసుఁ డోకింతసేపు నిల్చి సుపర్వగణములచేఁ బూజ గాంచి మునులు
పొగడఁగ నిజధామమున కేగె నది శ్రీనివాసస్థలం బన వన్నె కెక్కె
నందు లెక్కకు మిక్కిలైనజను లుప మాచరింపఁగఁ గృతార్థులైరి

గీ. రావణుని జంపి రాముండు రాజకుల మ్మణంచి భార్గవరాముఁ డహల్యఁ జెంది
శక్రుఁ డేతెంచి యచ్చట స్నానమాచ, రించి తత్పాపములు ద్రుంచి మించి రెలమి.

క. కావేరీస్నానంబులు, గావించినవారి కగును గైవల్యశ్రీ
లావెరవు పాపి కబ్బదు, కేవలపుణ్యస్వరూపికిక్ లభియించున్. 84

సీ. సకలలోకహితంబు సంతరింపఁ దలంచి కావేరి నిర్మించెఁ గమలభవుఁడు
అదిగాన పాపంబు లణఁగింపఁ జింతించు వారి కానదియందు వలరెను స్నాన
మాకల్పజన్మార్జితాఘము ల్దూలించు మాఘమాసంబున మజ్జనంబు
చంద్రసూర్యగ్రహ సంక్రాంతి ముఖపుణ్యవాసరంబులయందు వరుసతోడ

గీ. యక్షగంధర్వసిద్ధవిద్యాధరులును, దివిజనాథుండు మొదలైన దేవతలును
నిందిరయు గౌరి శారద యేగుదెంచి, జలక మొనరించి చనుదురు సదనములకు. 85

క. కావేరీస్నానంబులు, గావించెద మంచుఁ బలుకు ఘనులయఘంబు
ల్వావిరి నుండవు తమకుం, బోవేళ యటంచు నుండు భూరివివేకా. 86

క. కావేరి పుణ్యసారము, కావేరి శ్రితార్తినాశకారిణి మిగులం
గావేరి సర్వసేవిత, కావేరికి సాటి నదులు గలవే ధాత్రిన్. 87

క. కావేరీతీరంబుల, నేవంక విభూతి మెఱయు నింపొందంగా
నావంక దివిజలోకము, గావించినయజ్ఞవాటిగా నెఱుఁగఁదగున్. 88

క. పాపాత్ములైనవారికిఁ, జాపట్టక యొల్లప్రొద్దు సురుచిర నిష్ఠక్
దీపింపఁ దపము సేయుదు, రాపుణ్యనదీతటంబునందు మునీంద్రుల్. 89

వ. కమలగర్భుండు పాపంబులు వాపం దలంచి యుత్తరభాగంబున గంగను దక్షిణప్రదేశంబునఁ గావేరిని నిర్మించి కృతకృత్యుం డయ్యె ధర్మం బార్జింపం దలంచినవారికిఁ బ్రయత్నంబున నమ్మహాపుణ్యనది నవగాహనంబు సేయవలయుఁ గావున నీవాచరింపు మిష్టంబు లీడేఱు నారదోక్తం బైన యీయుపాఖ్యానంబు విన్నజనంబులకు బ్రహ్మలోకంబు కరతలామలకం బగు ననిన విని యుధిష్ఠిరుండు శ్రీనివాసక్షేత్రం బుత్త

మం బనియూనతెచ్చితివి తజ్జన్మమాహాత్మ్యంబులు సవిస్తరంబుగ నెఱింగింపవే యని ప్రార్థించిన భీష్ముండి ట్లనియె. 90

## శ్రీనివాసక్షేత్రమహిమ.

సీ. నలినగర్భుఁడు మున్ను నారదునకుఁ దెల్పె నమ్ముని కరుణ నా కానతిచ్చె
నీవు నే వినిపింతు నిజముగా విను పాండునందన పాపముల్ ద్రుంచుపఱుచు
నారోగ్యవర్ధనం బఖిలసంపత్కర మిహపరంబు లొసంగ నిడియ నేర్చు
సిద్ధసాధ్యనుతంబు శ్రీనివాసక్షేత్ర మచ్చటి ఫల మెన్న నలవి యగునె
గీ. పూర్వపశ్చిమతటములఁ బొదలి లెస్స, దక్షిణంబున నుత్తరదక్షిణముల
వెలసి తూర్పుగ నడచు కావేరినడుమ, వనితయును దాను శ్రీహరి వచ్చి నిలుచు.91
గీ. శ్రీనివాసునిసన్నిధిసేవఁ గోరి, వరుసనె యనంతతక్షకవాసుకులును
శంఖపాలుండు నిల్తురు సంతతంబు, నాల్గుయుగములు సురలతో నరవరేణ్య. 92
సీ. ఈయర్థమున నొక్కయితిహాస మెఱిఁగింతు వరమనోరథఫలావాప్తికరము
మును కైటభుండను దనుజాశనుఁడు వేల్పుగుంపుల నెల్ల నిర్జింపఁ గోరి
యాక్షేత్రమున నిల్చి యశనంబు వర్జించి యెట్టిగాఁ గాఁగిన యినుపముద్ద
లాహారముగఁ గొంచు నతిఘోరతపము గావింప దేవేంద్రుఁడు వెఱచి సురల
గీ. వెంటఁ గొనిపోయి శారదావిభునిపాద, పద్మముల కంతయును విన్నపంబు చేసి
తెలిపి గావక సురలోకతేజ మిపుడె, యొందునననుచింత నేఁబడియుగము లుండె.93
ఉ. అంతట నయ్యుపప్లవము లంబుజగర్భుఁ డెఱింగి దేవతా
కాంతుని బిల్చి మీకు భయకంపము లేల చనుండు మేలు గా
వింతు నటంచుఁ బంపి యతివేగముతో నమరారి యున్నయా
చెంతకు వచ్చి దృష్టి రవిఁ జేర్చి తపం బొనరించుచుండఁగన్. 94
గీ. చూచి యరుదంది మున్ను నేఁ జూచినాఁడ, యతులమునిసిద్ధదేవతాతతులతపము
లెన్నియేనియుం నవి యెల్ల నిందులోన, నీసమును జేయ దిది దొడ్డవింత యనుచు.95
వ. వెఱఁగంది పద్మగర్భుం డి ట్లనియె. 96
తోటకము. ఘోరతపంబునఁ గుందె శరీరం, బార బళీ దనుజాధిప నేనే
వారిజగర్భుఁడ వచ్చితి నీకుం, గోరిక లీయఁగఁ గోరుము కోర్కుల్. 97
గీ. అనినవాక్యంబు కైటభుం డాలకించి, వనజసంభవు నీక్షించి వందనంబు
చేసి యి ట్లను నాతఁడు స్థితులు దెలిసి, వరము దయచేయఁ గదవయ్య వనజగర్భ.98
గీ. నీవు నింద్రుండు దేవతానివహములును, మూఁడులోకంబు లెల్ల నాకోడవలయుం

నెంతపాపంబు చేసిన నంతకంత, జయము చేకూర వరమిమ్ము జలజగర్భ. 99

క. అని వేఁడికొన్న వరములు, వనజాసనుఁ డొసఁగి నిజనివాసంబునకుం
జనియెను దనుజుండును ధరఁ, దన కెక్కుడ మాఱులేక దర్పోద్ధతుఁ డై. 100

మ. సురలోకంబున కేగి దేవతలకున్ క్షోభంబు గల్గించి ని
ర్జరనాథుం దరివెట్టి సన్నుతి యొనర్ప న్మల్లి వైవస్వతున్
వరుణున్ గుహ్యకనాథుఁ గెల్చి తనకు న్వారిచ్చు కైకానుకల్
కరుణం గైకొని బ్రహ్మపట్టముపయిం గాల్సాఁచి యద్దిక్కునన్. 101

వ. రాజర్షిగణసేవితుం డై యున్న ధాతకు నమస్కరించి యి ట్లనియె. 102

ఉ. లోకము లన్నియున్ గెలిచి లోకువగా విహరింపఁ గంటి నే
నీకరుణాకటాక్షమున నీరజగర్భ రమావిభుం గడుం
జేకలవాఁ డటం డ్రతనిచిత్తము రా సమరంబు చేతు నే
పోకలఁ బోక యందు సరిపోల్పఁగరాని పరాక్రమంబునన్. 103

ఆ. అనుచుఁ బాలకడలి కరిగి యబ్జాక్షుని, సర్వగతుని జూచి జడధిఁ గాన
కందు మాని యవనియం దున్నవానిగాఁ, దలఁచి ధరకు వచ్చె దనుజవిభుఁడు.

క. ధరణి సమస్తముఁ దాసై, హరి తిరిగెడుఁ గడలినడుమ నది వైచి రిపున్
హరియింతు ననుచుఁ గోపో,ద్ధురుఁడై సొరఁ గుతిక వట్టి తోయములందున్. 105

గీ. ఎడమచేతను బాతాళ మడఁగఁబట్టి, మీఁద దక్షిణహస్తంబు మెత్తు చేసి
ధరణి సుట్టూఁత లూఁచె నా దైత్యవిభుఁడు, కల్పవివరంబు వేళ దిగ్గజమువోలె. 106

గీ. అపుడు లోకైకమాత యానవనిదేవి, దితితనూజుండు తనుఁ ద్రిప్ప దిక్కులేక
భక్తవత్సలు సర్వేశుఁ బరమపురుషుఁ, దిరుగఁ దిరుగను నుతియించె దీనవృత్తి. 107

క. సారసలోచన మాధవ, కారుణ్యసముద్ర కృష్ణ కౌస్తుభవక్షా
నారాయణ కావు నమ,స్కారముఁ గావింతు నీకుఁ గంసారి హరీ. 108

తోటకము. కేశవ మాధవ కృష్ణ ముకుందా, యీశ త్రివిక్రమ యిందునిభాస్యా
నీశరణొందిన నెవ్వరికెందు, న్నాశము చెందదు నారదవంద్యా. 109

ఉ. మ్రుచ్చును సంహరించి గిరి మోచి హటాత్తుగ ముట్టె త్రోపున
న్వచ్చి యనేకవేషముల వాలి బలింగని వేఁడి రాజులన్
ద్రచ్చి పయోధిగట్టి బలునాఁగలి వట్టి ప్రబుద్ధరీతి నే
కచ్చిని మ్లేచ్ఛులం దునుమఁ గాంచియుఁ గాచితివే రమాపతీ. 110

గీ. ఇట్లు నుతియింప హరి జగదీశ్వరుండు
మెఱుపువలెఁ దోఁచి కైటభుమెడ సుదర్శ
నమునఁ దునుమాడి ధరయును రమయు నమరు
లెనయఁ జనుదెంచి యీక్షేత్రమున వసించె. 111

క. అక్కడ నున్నరమాపతి, యిక్కువ దెలియుచు ననంతుఁ డెంతయు మదిలోఁ
జొక్కి ఘనశంఖపాలుని, మక్కువగల సుతునిఁ జూచి మఱి యిట్లనియెన్. 112

సీ. పాపము ల్క్షయింప భద్రంబు లీడేర్ప దళమైన కావేరిదక్షిణమున
ధవళజంబూకపిత్థల్ తింత్రిణీబిల్వనిలయంబు దేవతానివహావర్ణ్య
మైనయాద్దాలకమౌనియాశ్రమ మొప్ప సకలతపోధనస్థానగరిమ
నచ్చోట ధరణియు నంబుధికన్యయు సేవలు గావింప శ్రీనివాసుఁ

గీ. డమిత కరుణారసంబున నఖిలజగము, నాదరించుచు నున్నవాఁ డతనిపాద
పద్మములచెంత నిలుపు మేపనులు మాని, భుక్తిముక్తులు నీకబ్బుఁ బుత్రవర్య. 113

## అనంతశంఖపాల సంవాదము.

వ. అనిన విని నమస్కరించి యాద్దాలకుం డేమి గోరి తపంబు సేయుచున్నవాఁ డతనిచరితంబు సవిస్తరంబుగా నెఱింగింపవే యని ప్రార్థించిన శంఖపాలున కనంతుం డిట్లనియె. 114

సీ. శాంతుండు హరిపద సంతత ధ్యానపరాయణుం డఖిలాగమాంతవేది
ధర్మస్వరూపి యాద్దాలకుం డనుమౌని పవనాశి యగుచు నలువదియుగము
లత్యాంతమును దపం బచటఁ గావింపంగ సారసగర్భుఁ డాశ్చర్య మొంది
యింద్రాదిదేవత లిరువంకలం గొల్వ హంసాధిరూఢుఁ డై యరుగుదెంచి

గీ. మెచ్చి వర మీయవచ్చితి నిచ్చ పుట్ట
వేఁడు మన్నను సాష్టాంగవినుతిచేసి
యిందిరాపతి ప్రియమొందు నెట్టు లట్లు
దయ విలోకింపు మనుచుఁ బ్రార్థనమొనర్చె. 115

వ. ఇట్లు పుండరీకాక్షుండు ప్రసన్నుండు గా వరంబు గోరిన తపోనిధికిఁ గాంచనగర్భుం డిట్లనియె. 116

క. వినుము కుమార నాపలుకు విశ్వమయుం డగు శ్రీనివాసుఁడే
దినమునఁ గైటభాసురు వధించి చెలంగునో యాదినంబునం

గనుఁగొనఁగల్గు నీకుఁ జిరకాలము నిక్కడ నాముఁరారి యిం
పొనర వసించి చెందు సకలోన్నతమౌ నిజధామ మంతయున్. 117

మ. హరి రామాకృతి రావణుం దునిమి స్నానార్థంబు వచ్చుం బురం
దరముఖ్యు ల్వసియింతు రచ్చట జగన్నాథు న్విభుం గొల్చి యం
ద్వర నీక్షేత్రము శ్రీనివాస మనగా వర్ధిల్లుచుం జేగ నా
సరసీజాసనుఁ డుండె మౌని యచటన్ సర్వేశు ధ్యానించుచున్. 118

గీ. అంత నతనికిఁ బ్రత్యక్షమయ్యె శ్రీని
వాసుఁ డాస్వామిఁ గొలువుము వరము లొసఁగు
ననుచు శేషుండు పంపిన నలరి శంఖ
పాలుఁ డేతెంచి నిశ్చలభక్తి మెఱయ. 119

వ. సుఖంబున శ్రీనివాసుని సేవ గావించుచు నేఁడు నున్నవాఁ డనిన విని యుధిష్ఠి
రుండు భీష్మున కిట్లనియె. 120

క. పాతాళతలము వెలువడి, యేతెఱఁగున నరుగుదెంచె నెచ్చట నుండెన్
ఖ్యాతిగల శంఖపాలుం, డాతీ ఱెఱిఁగింపు తాత యధికస్ఫూర్తిన్. 121

వ. అని యడిగిన మనుమనికిఁ దాత యిట్లనియె. 122

ఆ. విను మగస్త్యతీర్థ మనఘుంబు దానిపడమట శంఖ మనఁగ నమరు మడుఁగు
శంఖపాలుఁ డందు జన్మించె శేషుని, పలుకు లింపు గులుకఁ దల ధరించి. 123

క. అదిగనుక తత్ప్రదేశము, విదితం బగుక్షేత్రతీర్థవిసరంబులకు
న్నాదరణచట నగస్త్యుఁడు, పదిలంబుగఁ దపముచేసి భవు మెప్పించెన్. 124

వ. ఇట్లు మెప్పించి యగస్త్యుం డణిమాద్యష్టైశ్వర్యంబులునందె శ్రీనివాసంబు కావేరీ
దక్షిణతటంబున యంగత్రయంబు విలసిల్లు ననిన భీష్మునకు యుధిష్ఠిరుం డిట్లనియె.

క. అంతట నౌద్దాలకముని, కెంతయుఁ దేరీతి మెలఁగెఁ గమలావిభుఁ డే
వింతవరంబుల నొసఁగెను, నంతయు నాకెఱుఁగఁ బలుకు మయ్యా మహాత్మా. 126

వ. అని యడిగిన యుధిష్ఠిరునకు భీష్ముం డిట్లనియె. 127

సీ. ఔద్దాలకమునీంద్రుఁ డతినిష్ఠఁ దపము గావించుచుండఁగ హరి విశ్వమూర్తి
యిందిరాసతి వెంట నేతేరఁ బ్రత్యక్షమై నిల్చి యతనిదేహంబు నిమిరి
చాలించు మీచర్య సంతసించితి నింక రాజులం దునుమాడి రావణాసు
రుని బరిమార్చియుం నినుమాఱు రామాఖ్యు నాదర్శనము చేతు వాదరమున

ఆ. నంతమీఁద మోక్ష మబ్బు నీక్షేత్రంబు, ధివిజఋనుతలీలఁ దేజరిల్లు

ననుచు నానతిచ్చి యంతర్హితుం డయ్యె, భవబిరించిముఖులు ప్రస్తుతింప. 128

వ. కావున నీవు శ్రీనివాసుని భజియించుము కలియుగంబునఁ గావేరీస్నానంబును శ్రీనివాసక్షేత్రంబును దుర్లభంబులు ధర్మాత్ములకుఁ బూర్వసంచితపుణ్యవిశేషంబున లభించుఁ బాపాత్ములైన సింధు మజ్జనం బాచరించిన వేలుసంఖ్యలైన పితృమాతృ కులంబుల నుద్ధరించి విష్ణుసన్నిధానంబున వర్తింతురని యొఱిఁగించి మఱియు ని ట్లనియె. 129

సీ. కావేరి స్మరియింపఁ గలిగినవారికి సకలపుణ్యంబులు సంతరించుఁ
గావేరి వీక్షింపఁ గాల్పాఁచువారికి హరిసన్నిధానంబు నప్పగించుఁ
గావేరి స్నానంబు గావించువారి కశేషయాగఫలంబుఁ జేతికిచ్చుఁ
గావేరి దరి నిల్వఁ గలిగినవారికిఁ గామితార్థంబులు గలుగఁ జేయుఁ
గీ. భద్రకారిణి కావేరి బ్రహ్మరుద్ర, పాకశాసన తారేశభాస్కరాది
దైవలోకంబు లన్నియుఁ దానొనర్పు, ననుచుఁ గంసారి శ్రీకృష్ణుఁ డానతిచ్చె. 130

క. కావేరీస్నానంబులు, గావించిన యాఱునెలలు కడముట్టంగాఁ
గావలసినవారలు తన, యావిర్భావంబుఁ గాంతు రవనీనాథా. 131

గీ. ఇట్లు కావేరిమాహాత్మ్య మెఱుఁగఁ బలుక, విని మనంబునఁ దనియక వివిధపుణ్య
దేశచరితంబు లన్నియుఁ దెలియఁ గోరి, వినుతి గావించి తాతకు మనుమఁ డనియె.

క. నీవాక్యామృతధారలు, త్రావితిఁ జిత్తంబు మిగులఁ దనియదు నన్నుం
భావించి కడమఁ దెలుపుము, కావేరీసకలతీర్థగరిమ మహాత్మా. 133

వ. కావేరీ కపిలాసంగమంబునం జంద్రార్కవహ్నిపుష్కరిణీతటంబులఁ గుంభఘోణం బున హైమవతీసంగంబున విశ్వేశ్వరంబున భృగుక్షేత్రంబున గజారణ్యంబునం గలిగినవిశేషంబులు నందు వర్తించిన మునులచరిత్రంబులుఁ దక్కినమాహాత్మ్యంబులు నీకుం గరతలామలకంబు లెఱిఁగింపవే యని ప్రార్థించిన ధర్మనందనునకుఁ బరోపకారులు స్వదేహంబులచేత నితరులకుఁ బ్రియంబాపాదింప వాఙ్మాత్రంబున నీకు ధర్మంబు లుపన్యసించి పుణ్యలోకంబులం గైకొనరాదె యని భీష్ముం డి ట్లనియె.

ఆ. అగ్నిపుష్కరిణియు నర్కపుష్కరిణియు, నధికపుణ్య మొసఁగు నందులోన
ననలపుష్కరిణికి నరిగి స్నానంబు గా, వించుజనము లుంద్రు విష్ణుపదవి. 135

మత్తకోకిల. వహ్నిపుష్కరిణీమహాత్తరవారిఁ దోఁగి రమాపతిన్
జాహ్నవీసుతపాదపంకజు సంశ్రయించినమానవుల్

వహ్నిసూర్యసమప్రభం గదు వాలి చక్రధనుర్గదా
చిహ్నము ల్దగ విష్ణులోకముఁ జేరి యేలుదు రెప్పుడున్. 136

సీ. ఆదిత్యకులచంద్రుఁ డగురామచంద్రుండు జానకీలక్ష్మణసహితుఁ డగుచు
నంగద సుగ్రీవ హనుమ త్సుషేణాది వానరబల మిరువంకఁ గొలువ
ననలపుష్కరిణికి నరిగి స్నాన మొనర్చి ధారుణీసురలకు ధన మొసంగి
గాయత్రియనుపేరుగల శిలకేగి యాచక్కి నిలిచి భువేశ్వరి జపించి
గీ. చెంత మెలఁగు విభీషణుఁ జేరఁ బిలిచి, కలుషహారిణి కావేరి గరిమనిందు
రత్నముఖదానములు చేసి రావణాది, దనుజకులకోటి ముక్తికిఁ బనుపు మనియె.

వ. ఇత్తెఱంగున రామచంద్రుండు రావణాదులకు సకల పితృజనంబులకు మోక్షంబు సిద్ధించుకొఱకు రత్నకాంచనాది సకలదానంబు లొనర్ప విభీషణున కాజ్ఞాపించి జానకిం గనుంగొని యి ట్లనియె. 138

సీ. నలినగర్భునకు మానసపుత్రియై లీల జనియించి కన్నులు చల్లఁజేసె
నిఖిలలోకహితంబు నెఱప నగస్త్యుండు వేఁడిన నింతియై వెంట వచ్చె
గంగాప్రముఖపుణ్యకల్లోలినుల కెల్లఁ జేరువకాఁ దనఁ జెలువు దాల్చెఁ
దనమీఁదిపవనంబు దాఁకినవారికి ముక్తికామినిఁ గొంగుముల్లె చేసె
గీ. నేటిమాత్రంబె కావేరి యిందు నందు, శుభము లొసఁగంగఁ జాలును జూడు విప్ర
తతికి మణిచేలకాంచన ధాన్యముఖ్య, సకలదానంబు లొనరింపు జనకతనయ. 139

ఉత్సాహ. అనిన రామచంద్రుమాట లాలకించి వానరుల్
జనకసుత విభీషణాది సర్వదైత్యవితతి మ
జ్జన మొనర్చి కనకరత్నశాటికాప్రదాన మిం
పొనరఁ జేసి సహజకాంతు లొదవఁ జొచ్చి రంతయున్. 140

క. అంతట నగస్త్యముని ధీమంతుఁడు భగవంతుఁ డఖిలమాన్యుఁడు వెంటన్
వంతులుగ మునులు గొలువ, న్నంతసమున వచ్చి రాముసన్నిధి నిలిచెన్. 141

సీ. చ్యవన విశ్వామిత్ర జాబాలి సుక్రతు గౌతమ గాలవ కశ్యపులును
శంఖ బృహస్పతి సంవర్త పులహ శతానంద కణ్వ బోధాయనులును
రోమశ స్థూలశిరో భరద్వాజ సత్యాషాఢ రైభ్య కాత్యాయనులును
వ్యాస పరాశర యాజ్ఞవల్క్య సుమిత్ర భార్గవ దేవలప్రముఖమునులు
గీ. ఘనుఁ డగస్త్యుండు ముందఱగా నెలర్ప, లలితగుణధుర్యులకు రామలక్ష్మణులకు
స్వస్తివచనంబు గావించి సకలసైన్య, ములవిమానంబుఁ గనుఁగొని ముదితులైరి. 142

వ. అంత రామచంద్రుండు గాయత్రీనామశిలాతలంబున సకలమునిసంఘంబులకు సాష్టాంగదండప్రణామంబులు నర్ఘ్యపాద్యకృత్యంబు లాచరించి వినయంబుతో నిట్లనియె. 143

గీ. కుశలమే మీకు మీరాకఁ గోర్కులమరె, నాకుఁ దమ్మున కింతికి నగచరులకు
దైత్యపతులకు జన్మంబు ధన్య మయ్యెఁ, బాపములు దూలె మునిసార్వభౌములార.

క. అని పలికి రామచంద్రుఁడు, వినయం బలరంగ లేచి వెలఁదియుఁ దానున్
మునుముంగ నిలిచిన మౌనులఁ, గను దనియఁగఁ జూచి చూచి గౌరవమెసఁగన్.

వ. కూర్చుండుఁ డని నియోగించి బహుప్రకారంబుల నుతియించిన నమ్మునులలో నగస్త్యుం డిట్లనియె. 146

## అగస్త్యకృతశ్రీరామస్తవము.

దండకము. శ్రీరామరామా మనోజాభిరామా శుభోద్దామనామా ధరాధీశసోమా రిపుస్తోమభీమా ప్రతాపోగ్రరామా దయాపాత్రనేత్రాంతసీమా మరుత్సార్వభౌమాతగ న్నేషభాషాధిపు ల్నీవిశేషంబు లెక్కింపలే రన్న మాబోంట్లకు న్శక్యమే యాదినారాయణాఖ్యం బయోరాశిమధ్యంబున న్భద్రపీఠాయమానోజ్జ్వలద్భోగిభోగోల్లసద్రత్నకాంతిచ్ఛటారంజితాంగంబు చేతన్ భుజామధ్యపీఠీపరిభ్రాజమానేందిరాసుందరీలోచనేందీవరాపూర్వపర్వంబు గావించుచు న్లోకము ల్గావవే దేవ యానీవె దుర్వారవారాన్నిధిం జోఁఅవై వారిధిం జేరెమఁల్వారి వైరి న్విదారించి వేదంబులాలోకనిర్ణేతకున్ ధాతకుం బ్రీతిగాఁ జేతి కందీయవే; దేవ యానీవె దేవాసురుల్ రాసులై డాసి వారాశిలో మందరాగంబు రాగంబుతోఁ ద్రిప్పఁ జేఁదప్పి సర్పాధివాసంబుఁ జేరం గకుప్పాలసంరక్షణార్థంబుగా గొప్పతాఁబేలవై మేలుగా లీల నాశైలము న్వీఁపునం దాల్పవే; దేవ యానీవె క్రోడంబవై యాహవక్రీడలం బ్రోడవై జాడ యేజాడల న్వేడఁగా నాడ వెన్నాడ వే కూడి చేకూడ రక్షఃకులాధ్యక్షు బాహాబలక్షోభితాశావిపక్షున్ హిరణ్యాక్షు శిక్షించి యీక్షోణి రక్షింపవే; దేవ యానీవె మన్నాపు కంబంబునం బుట్టి గుట్టెల్లఁ బో రక్కసుం బట్టి యిట్టట్టుగాఁ గొట్టి ప్రహ్లాదు నాహ్లాదదృష్టి న్నిరీక్షింపవే; దేవ యానీవె వంచించి వైరోచనుం గాంచి కొంచెంబుగా భూమి యాచించి యంతంతకు న్మించ వేధించవే; దేవ యానీవె జన్యంబులం దుష్టరాజన్యులం దున్మి యిన్నేల మాన్యంబుగా నీయవే భూసురశ్రేణికిన్ దేవ; యానీవె యిక్ష్వాకువంశంబున న్లీల జన్మించి గాధేయయాగప్రయోగంబు సాగించులాగెంచి క్రౌర్యాటకం దాటకం ద్రుంచి పాదాంబు

జాతద్వయీ రేణుపాతంబున న్నాతి మేన్నాతిఁ గావించి హేమాద్రికోదండకోదండ దండంబు ఖండించి వైదేహికిం గేలు గీలించి మాతల్లియుల్లంబు రంజిల్లఁగా దండ కారణ్య మావాసయోగ్యంబుగా నెంచి పంపానదీప్రాంతభూమిన్ హనూమంతుఁ బంతంబుతో నేలి సుగ్రీవుతో జాలి దూలంగ వాలమ్మున న్వాలిఁ దూలించి నీలాది శాఖామృగశ్రేణిచే వార్ధి గట్టించి గీర్వాణవిద్రావణున్ రావణుం గుంభకర్ణాది దుర్నీతిమద్దైత్యబృందంబుతోఁ గూడ నోడించి నీజాడ నీడెందు లేకుండ వర్తిం చెదో దేవ యానీవె తారాంకవిఖ్యాతిఁ గాళింది భేదించి బుద్ధుండవై వైరిదారా పరీరంభకేళి న్విజృంభించి వాహావరోహక్రియన్ మ్లేచ్ఛబృందంబుఁ గుందింప నున్నా వయో దేవ నీమాయ యేచాయదో యేయుపాయంబులం గానరా దయ్య యీలోకజాలంబుఁ బుట్టింప రక్షింపఁ గిట్టింప నీవే సమర్థుండ వంభోజసంభూత కల్పావసానంబునం దేకమై లోక నీరాకరంబు ల్ధరాకాశము ల్ముంప నొక్కండవే దక్కి మఱ్ఱాకుపై నెక్కి చొక్కంబుగా దిక్కు లాముక్కుమ్మడిం డొక్కలోఁ ద్రొక్కి వర్తింతు వీశా సురాధీశ నీబొడ్డుపాపందు బ్రహ్మాండభాండప్రకాండంబు నిర్మించు నీపాదతీర్థంబు ఫాలేక్షణాలంకృతఖ్యాతి వర్తించు నీకన్ను లిందీవరాం భోజసంకోచము ల్మించగా మించు నీదివ్యధామంబు చింతామణీ కామధుక్కల్పక శ్రేణిఁ గల్పించు నీసెజ్జ సర్వంసహాభారమానంగ వెన్నొద్దు నింద్రాదిదిక్పాలకు ల్నీకళా మాత్రసంభూతు లీభూతజాలంబు నీచేతి దోయీశ యాయాశకంఠోల్లసత్తారక బ్రహ్మమంత్రంబు నీ వెన్నఁగా నింతయుం న్సత్య మంభోధరశ్యామదేహా నిరీహా సమస్తాఘదావా రిపువ్యూహభీమస్వభావా సదాభక్తసంతక్షణోపాయమోహా నమస్తే నమస్తే నమః. 147

చ. హరిహరపద్మసంభవు లహర్పతిముఖ్యనవగ్రహంబులున్
హరిహయపావకాది సకలామరవర్గముఁ బంచభూతముల్
శరధులు నారదప్రముఖ సర్వమునీంద్రులు నీవ యీచరా
చరములు నీస్వరూపములు సంశయ మింతయు లేదు రాఘవా. 148

వ. అని వినుతించిన యగస్త్యమహామునీంద్రునకు వినయావనతుండై రామచంద్రుం డి ట్లనియె. 149

మత్తకోకిల. తండ్రి కైవడి మమ్ముఁ గాచితి దండకాటవిలోన నీ
వాండ్ర మన్యులమే నుతింప భవత్కృపారస మాని పె
క్కండ్ర దైత్యుల గెల్వఁగంటిమి గాక శక్యమె యేరికిం
దీండ్రమైన త్వదీయ తేజముఁ దేటి చూడ ఘటోద్భవా. 150

వ. మీరొసంగిన యక్షయతూణీరంబుల రావణు నే నిర్జించితి ఖడ్గంబున లక్ష్మణుం డిం
ద్రజిత్తు నణంచె మీకటాక్షవీక్షాబలంబుల రణరంగంబుల మేము జయంబుగంటిమి
దుష్టరాక్షసగణంబులకుఁ గానంబడకయుండ వైదేహియుఁ బ్రదికెఁ దిరిగి మీపాద
పద్మంబులు పొడఁగంటి మింక నాచరణీయం బానతీయవే యని వినయమధుర
వాక్యంబులఁ బ్రార్థించుచున్న రఘువరునకుం గుంభసంభవుం డిట్లనియె. 151

## రామునకు అగస్త్యుఁడు గాయత్రీశిలంగూర్చి చెప్పుట.

సీ. గాయత్రి యనుపేరు గలుగు నీశిల సర్వపాతకజాలంబుఁ బరిహరించు
మీర లిందఱుఁ గూడి గోరూప మొనరించి దానిపొట్టను బుట్టఁ దగునటన్న
విని ముదంబున రామవిభుఁడు బంగరుజావుఁ గావించి యపుడు తద్గర్భపేటిఁ
జేరి ధరామరశ్రేణికిఁ బదియాఱు దానము ల్వెక్కులు ధారవోసి
ఆ. సీత లక్ష్మణుండు చిత్రభానుసుతాంగ, దాంజనేయముఖ్య హరిచమూప
తులు విభీషణుండుఁ దోడ్తోడ నారీతి, వెలయఁ జేసి రధికవిభవ మెసఁగ. 152

వ. అంత. 153

గీ. దివిజు లరుదంద శివునిఁ బ్రతిష్ఠ చేసి, సిద్ధసేవిత గాయత్రిఁ జేర నరిగి
యందుఁ గూర్చుండి శ్రీరాముఁ డధికభక్తిఁ, బలికె నీరీతిఁ గుంభసంభవున కెరఁగి.

క. ఏయనువున నీరాత్రికి, గాయత్రీనామమయ్యె ఘనశాస్త్రకళా
తోయధి నీచేతిది యీ, న్యాయం బెఱిఁగింపు కుంభనందన నాకున్. 155

వ. అనిన రామచంద్రునకు నగస్త్యమునీంద్రుం డిట్లనియె. 156

క. వృత్రవధపాప మణఁప, సుత్రాముఁడు కోరి గురుఁడు సూచించిన వై
చిత్రియుగచతుష్కము గా, యత్రిం జపియించె నిశ్చయమనోరథుఁడై. 157

గీ. అంత గాయత్రి ప్రత్యక్షమై సురేంద్ర, యేయుగంబున నెవ్వార లిట్టి తపము
చేయ రెఱిఁగింపు మానసస్థితులు దెలియ, రమణ నీకోర్కు లీయ నారాక యనియె.

వ. అనిన విని సంతుష్టాంతరంగుం డై యింద్రుండు వృత్రాసురుం జంపి యేతద్దోషపరి
హారార్థంబు ప్రార్థించెద నట్లు గావించి మనోబుద్ధి స్వాస్థ్యంబు లొసంగి కృతార్థుం
జేయవే యని వేఁడిన నీమనోరథంబు లీడేఱు మదీయజపసమయంబున నీకు నివాసం
బైన యీశిలయు గాయత్రీనామంబున వెలయు మహాపాతకోపపాతకంబు లిందు
జపియించిన వారికిం జెందవెఱచు నని వరం బిచ్చి గాయత్రి యంతర్ధానంబు నొందె.
బ్రహ్మపౌత్రుం డగురావణుండు రణంబున నీచేత హతుం డయ్యెఁ దత్పాతకశాంతి
కై నీవు నొనరింపు మనినఁ గుంభసంభవునకు రామచంద్రుం డిట్లనియె. 159

గీ. అట్టి కావింతు మీమాట కడుగు దాఁట, శిష్యవర్గంబు మీరు వేంచేయవలయు
మన మయోధ్యకు నేఁడ యీదనుజవాన, రేంద్రజనములతోఁ గూడి నేను వత్తు.
వ. అనిన రామభద్రునకుఁ గుంభసంభవుం డిట్లనియె. 161
క. ఆలాగున నొనరింపుము, వాలాయము వత్తు మానివర్గముతో నీ
మేలుఁ గనుంగొన వెంటనె, చాలవె భాగ్యంబు లింతసౌఖ్యము గలదే. 162
క. అని పలికిన మునివచనము, విని దివ్యవిమాన మెక్కి వెనువెంటఁ గపు
ల్దనుజాలు గొలువ నయోధ్యకుఁ, జనియె న్సర లలర రామచంద్రుఁడు వేడ్కన్. 163
క. కావేరీస్నానంబులు, గావించినవారికబ్బుఁ గైవల్యం బా
దేవి భగీరథపుత్రిక, కైవడి దుర్లభయుం నెన్నిగతులం దెలియన్. 164
వ. కావేరీస్నానంబును గాయత్రీనామశిలా రామలింగదర్శనంబులును గావించినవారికిఁ
గైవల్యంబు కొంగుముల్లె యీయుపాఖ్యానంబు సకలహితకరం బగు నింక సూర్య
పుష్కరిణీమాహాత్మ్యంబు వివరించెద విను మని భీష్ముం డిట్లనియె. 165

## సూర్యపుష్కరిణీమహిమ.

గీ. మున్ను సూర్యుఁడు తప ముగ్రముగ నొనర్ప
హరుఁడు ప్రత్యక్షమై నిల్చి వరము లడుగు
శంకరుఁడ నేను నీకింక శంక యేల
యర్క యన మ్రొక్కి భక్తి నిట్లనుచుఁ బొగడె. 166
చ. హర శరణాగతార్తిహరణాదర మేదుర దివ్యవాహినీ
ధర శరదిందుకుందనిభధామధురంధర దండకానా
పుర పురభంజనప్రదర భూరిదయాకర దారితాధ్వర
స్మరహర పార్వతీవర నిశాచరభీకర చంద్రశేఖరా. 167
క. పులితోలుఁ గట్టుకొని కొమ్ములు డాలు నెలంగ వాఁడిముమ్మొనకత్తిం
దోలుపేల్పుల నొప్పించిన, నెలబాలుని సిగను ముడుచు నేర్పరిఁ గొలుతున్. 168
చ. హర పరమాత్మ శంకర పురాంతక యంబరకేశ చంద్రశే
ఖర నిటలాక్ష యుగ్ర శితికంఠ గిరీశ కపాలహస్త యీ
శ్వర భవ భీమ భర్గ గిరిజాప్రియ పన్నగహార రూపగా
ధర గరుడధ్వజప్రదర దర్పకసంహార లోకరక్షకా. 169
చ. అని వినుతించి నీకు హరి కంబుజసూతికిఁ గల్గు శక్తి న
న్నొనయ మదీయభక్తులకు నీస్తుతి పల్కిన విన్నవారికిఁ

ఘనతరమోక్ష మబ్బు శితికంఠ మతిం గను మన్న నట్ల యా
ననుచు వరంబు లిచ్చె రవి కద్రిసుతాపతి సాదరంబుగన్. 170

సీ. ఈరీతి వర మిచ్చి యీశుండు సర్వభూతగణంబులును దిరోధాన మందె
నర్కుండు హరుఁ గూర్చి యశ్వమేధసహస్రములు చేసి వాసవముఖ్యదివిజ
గణములకును బ్రీతి గావించి తను వారు వినుతింపఁగా స్వర్గమునకుఁ జనియె
నా తేజ మీక్షించి యక్కడి మూఁక లేతెంచి కవేరజాతీరభూమిఁ
గీ. పేరుకల యాగములు చేసి పెంపుగాంచి, మగిడి రిచ్చట నిప్పుడు మఘవిభూతి
దనర జమదగ్ని కుశ భరద్వాజ కణ్వు, లోరు లెఱుఁగకుండ మానులై యున్న వారు.
క. నెల భాస్కరపుష్కరిణీ, జలముల స్నానంబు చేయుజనముల కెల్లం
గలుగును వైకుంఠంబును, జ్వలనార్కవిభాసమృద్ధి జగతీనాథా. 172
గీ. నీవుఁ దమ్ములు ద్రౌపది నిఖిలవిప్ర, సముదయముతోడ నర్కపుష్కరిణి దాన
మాచరింపుము కోరుకు లతిశయిల్లు, రమణఁ జేతికి వచ్చును రాజ్యలక్ష్మి. 173
వ. సూర్యపుష్కరిణీస్నానంబు కలియుగంబున దుర్లభంబు పాపాత్ముల కబ్బదు పుణ్య
వంతులకు సిద్ధించు నందుఁ దపోయాగంబు లాచరించినవారికిఁ గామదుం డగుసూ
ర్యుండు నిజలోకం బొసంగుఁ గావేరీతీర్థం బుత్తమం బగు నందు జలంబులాడినవారు
దివ్యవిమానారూఢులై దివంబున విహరింతు రిందుల కత్యంత పుణ్యకరంబును బురా
తనంబునైన యితిహాసం బెఱింగింతు విను మని యిట్లనియె. 174

సీ. కడుఁ బావనం బైన కావేరికాహైమవతి సంగమంబున వఱలుఁ బురము
హైమవంతం బన నఖిలసంపద్రాశిచిత్రిత మది యేలుఁ జిత్రకేతుఁ
డనురాజు రైవతమనుకులకేతు వై యతనికిఁ దనయుండు వ్యాఘ్రకేతుఁ
డుదయించి తనయాజ్ఞ పదిదిక్కులం జాలఁ బొల్పొంద వహ్న్యర్కపుష్కరిణుల
గీ. నడుమ భృగుమానిమాటల కడుగు దాఁట, కశ్వమేధము రాజసూయములు నూర్లు
చేసి కణ్వమునికిని దక్షిణకు నేఁబ, దొక్కటి యొసంగె మేల్గలయూళ్లు దెలిసి. 175
క. చేకొద్ది కుంచ మెంతయు, వా కలిగిన శిష్యుఁ డనుచు వసుఁడను మునికిం
గైకఱపి పౌరుపత్త్యం, బాకణ్వుం డిచ్చె నూళ్లకన్నిటి కెలమిన్. 176

గీ. ధరణి దివిజుండు పౌరుపత్యంబు చేసి, ఋషిని వంచించి మున్నూఱు నిరుపదేను
నిష్కములఁ గూర్చె నాసొమ్ము నెఱియ దొంగ, లపహరించిరి పాపంబు లతనిఁ జెందె.
వ. అది యెఱింగి కణ్వుండు సమలోష్టకాంచనుండై సకలశిష్యజనంబులకు వేర్వేఱ
గ్రామంబులు పంచియిచ్చి నిర్ద్వంద్వుండును విగతకల్మషుండు నై యుండె వసుం

డును గురుద్రోహంబుచే నల్పకాలంబునఁ బంచత్వంబు నొంది తామిస్రవ్యాఘ్రి
శూల తప్తకుంభ తప్తసైకతభర్జనక్రిమిభోజన వృకరాక్షసభక్షణాది ఘోరనరకంబు
లిఱువదివేలేం డ్లనుభవించి యంత బ్రహ్మరాక్షసుండై యుగంబు గడపి తదనంతరం
బు వృషలుం డై పాడమి జాతిస్మరణసంపన్నుండును దేవపూజాపరుండును నై
వర్తించుచు నొక్కనాఁ డమ్మునిసమీపంబున కేగి నమస్కరించి యిట్లనియె. 178

క. రక్షింపుము రక్షింపు ము,పేక్షింపకు మున్న నీకుఁ బ్రియశిష్యుఁడ దు
ర్లక్షణములకతన వివే,కక్షయజన్మంబు వచ్చెఁ గణ్వమునీంద్రా. 179

వ. అని పలికిన శూద్రునకుం గరుణించి కణ్వుం డిట్లనియె. 180

క. మున్నెఱుఁగుదు నీచరితము, లన్నియు నననేల శూద్ర యద్రిసుతేశుం
బన్నగహారు గిరీశు, న్సన్నుతి యొనరింపు మతఁడు సౌభాగ్యమిడున్. 181

గీ. అనిన శూద్రుండు మున్పడిపోయినమ్ము, లహరహంబును గావేరియందు మజ్జ
నంబు గావించుచు శివార్చనంబు సేయఁ, బాతకవ్రాతములు పటాపంచ లయ్యె.

ఉ. అంతట శూద్రుఁ డర్కునుదయంబున లేచి కవేరపుత్రికా
భ్యంతరవారిఁ దోఁగి గిరిజాధిపు శంకరుఁ బూజసేయఁగాఁ
జెంతకు దైవయత్నమునఁ జేరిన దివ్యవిమాన మెక్కి యా
క్రాంతకుతూహలుం డగుచుఁ గణ్వునికిం బ్రణమిల్లి యిట్లనున్. 183

క. మునిజనవల్లభ నీకత,మునఁ బాపము దూలిపోయె మోక్షము దొరకెం
జనియెద మును పేఁ దావక, ధనములు దొంగిలినయట్టి తప్పు మఱవుమీ. 184

గీ. అని నమస్కృతు లొనరించి యమరకుసుమ, విసరములఁ బూజగావించి వివిధభూత
జాలసంసేవ్యమానుఁడై నీలకంఠు, శివుని సారూప్యమందె విచిత్రమహిమ. 185

వ. కావేరిని వహ్న్యర్కపుష్కరిణులయందు స్నానం బాచరించువారికి బ్రహ్మలోకంబు
సిద్ధించుఁ దన్నదీహేమావతీసంగమంబుల నేకవారంబు జలంబులం దోఁగి జన్మాంతర
కృతపాపంబులం బరిహరింతు రిందుకొక్కయితిహాసంబుగల దెఱింగించెద విను
మని భీష్ముం డిట్లనియె. 186

## కావేరికపిలాసంగమస్నానమహిమ.

ఆ. మునుపు యజ్ఞదత్తుఁ డనుపేరి భూసురుం, డఖిలనదులఁ దీర్థమాడి పితరు
లకును దర్పణంబు లకలుషనిష్ఠ గా,వించి వారు తృప్తిఁ గాంచ రనుచు. 187

క. కావేరినదీహైమవ,తీవారిం గలవి యున్న దిశకుం జనియా
త్రేవఁ బితృతర్పణంబులు, గావించెన్ గోత్రనామకలితంబులుగన్. 188

గీ. అంతఁ బితరులు దివ్యదేహములు దాల్చి, కలిగె నీక్రియ బ్రహ్మలోకంబు దమకు
భద్రమగు నీకటంచును బరమభక్తి, యజ్ఞదత్తుని దీవించి యరిగి రెలమి. 189

సీ. యజ్ఞదత్తుఁడు నంత నఖిలసంపదలచే విఱ్ఱవీఁగుచు ధర్మవృత్తి నడిచి
యిహలోకసౌఖ్యంబు లెన్నేని భజియించి కడపట స్వర్లోకగరిమఁ గాంచి
హేమభూషణనామ మింపొందఁగాఁ జక్రవర్తియై జనియించి వసుధలోనఁ
దనపేర హైమవంతం బను పురిఁ గట్టి యచ్చటఁ గ్రతుబృంద మలవరించి
గీ. యబ్జనాభునిఁ బూజింపు చయుతహాయనములు ప్రజ లెన్న వైకుంఠనగరి నిలిచెఁ
గాన హైమవతి కవేరకన్య గలసి, నట్టితఱిఁ బితృతర్పణ మాచరింపు. 190

వ. పితరులు తృప్తిఁ బొందుదు రీయుపాఖ్యానంబు విన్నవారికిఁ బాపంబులు నశించు
బ్రహ్మలోకంబు సిద్ధించునని చెప్పిన విని సంతుష్టాంతరంగుం డయ్యు నింకఁ దనివి
చాలక కపిలా కావేరీ సంగమఫలం బానతీయవే యని యుధిష్ఠిరుం డడిగిన భీష్ముం
డిట్లనియె. 191

గీ. కపిలచందంబుఁ గావేరిఁ గలుగుమహిమ, తన్నదీసంగమంబునఁ దనరుచున్న
నీలకంఠునివిభవంబు నీకు లెస్సఁ, దెలియఁ బలికెద వినుము కుంతీతనూజ. 192

క. కావేరీస్నానంబులు, గావించినవారి కఖిలకలుషము లణఁచున్
భావజహరుఁ డీశుఁడు తన, కైవల్యం బొసఁగి కాచుఁ గలకాలంబున్. 193

గీ. వివిధపాపంబు లణఁచుఁ గవేరతనయ, కామితార్థంబు లీడేర్చుఁ గపిల రెంటి
సంగమంబును గలిగిన సకలతీర్థ, ములకు క్షేత్రంబులకు నెల్ల ముఖ్యమండ్రు. 194

సీ. దక్షిణశాశ్వతధర్మతీర్థక్షేత్రసందోహములకెల్ల సార్వభౌమ
మమరేశ వాణీశ్వరాది నిర్జరనాథగణకృతక్రతువాటికాతలంబు
నారదసనకసనందముఖ్యామితబ్రహ్మర్షిసంఘకృతతపఃఫలంబు
గౌరీసరస్వతీకమలాలయాప్రముఖామరీవారవిహారసీమ
గీ. యేయుమాత్రంబె కపిల కావేరి గలయు, నట్టిదేశంబు హోమంబు నర్చనంబు
జపము దానంబు నేమైన సంతరింపఁ, గోటికోటిగుణంబునఁ గూర్పుఁజాలు. 195

క. వారిజమిత్రుఁడు తులకుం, జేరిన గంగాదినదులు చెలువలరంగా
వేరిపరివర్తనకును శరీరము శుచిగాఁగ నాచరింపు కుమారా. 196

గీ. మకరమున సూర్యుఁ డుండంగ మాఘమాస
మునను నెలయైనఁ బదియేను దినము లైన

మూఁడుస్నానానఁ గావేరి మునుఁగువారి
కోటివంశంబులకు ముక్తి కొంగుముళ్లె. 197

క. కావేరిని స్మరియించినఁ, గావేరిని దీర్థమాడి కావేరి మదిన్
సేవించినవారలకుం, గైవస మగుఁ గ్రతుఫలంబు కైవల్య మగున్. 198

గీ. పర్వముల వైధృతిని వ్యతీపాతలందు, నర్కచంద్రగ్రహణముల నయనములను
గపిలకావేరి గలసినకడల మునుఁగు, వారికులకోటి కెల్లను జేరు ముక్తి. 199

ఉ. ఇన్నియుఁ బల్కనేల మును పిక్కడ యక్షవిభుండు నెమ్మదిం
బన్నగహారుఁ గూర్చి నిరపాయతపం బొనరించి కాంచెఁ గ్రేఁ
గన్నుల నుప్పతిల్లు దయ కాలువ గట్ట ధనాధిపత్యముం
గిన్నరసిద్ధసాధ్యసురకీర్తిత మాపురజిత్సఖత్వమున్. 200

విప్రత్రయతపఃప్రభావము.

వ. చంద్రకాంత మహామేధ విజయు లను బ్రాహ్మణోత్తము లిచ్చటఁ దపం బొనరించి ముక్తులైరనిన విని వారి కేచందంబున మోక్షంబు గలిగె నెఱింగింపవే యని యడిగిన యుధిష్ఠిరునకు భీష్ముం డి ట్లనియె. 201

సీ. ఘనులు ముగ్గురు చంద్రకాంత మహామేధ విజయనాములు జగద్విదితమతులు
యాజ్ఞవల్క్యుని సుతు లగ్రజుఁ జంద్రభూషణు గృహంబున నిల్పి చంద్రజూటు
విశ్వేశుఁ గపిల కవేరకన్యామధ్యనిలయు నుమానాథు నీలకంఠుఁ
బూజించి మోక్షంబుఁ బొందఁ గోరి తపంబు సేయుచుండఁగ వారిశిష్యగణము
గీ. పదియునాలుగువేలును బహువిధములఁ, బూజ ధ్యానంబు కీర్తనంబును దపంబు
నెలమి హోమంబు వేర్వేఱ నొలసినట్టు, లాచరింప నావిభుఁడు ప్రత్యక్షమగుచు.

క. కోరుఁడు నెమ్మదులం గల, కోరుకు లన భూమిసురులు కొంకక యీసం
సారవిషవృక్షభేదన, కారకుఁడవు నీవు నీలకంఠా యన్నన్. 203

సీ. ఔర మీమొగముల సారతరంబులై మించువాక్యంబు లేతెంచెఁ గానఁ
గ్రూరరూపంబు గైకొన్న దేహంబునఁ గైవల్యవిభవంబు గలుగు మీకు
విష్ణుండు దశరథోర్వీశతనూజుఁ డై మాటకుఁ దగిన వెంబడి నొనర్చి
రక్షించు నని పల్కి యక్షవాహనుఁ డేగె సరభసంబున నంతఁ జంద్రకాంతుఁ
గీ. డును మహామేధవిజయులు దనుజులై ఖ, రుండు దూషణుడును త్రిశిరుండు నాఁగ
... ... ... , ఘనత గాంచిరి దండకావనమునందు.[1] 204

1 ఈగీతిలో మూఁడవచరణ మేప్రతిలోనుఁ గనఁబడలేదు.

ఉ. అత్తఱి రామచంద్రుఁడు మహత్తరతేజుఁడు చంద్రశేఖరా
యత్తత వల్కలంబులు జటావలిఁ దాలిచి దండకావనిన్
హత్తి సమస్త దానవచయంబు శిరంబులు చిత్తవృత్తిగా
మొత్తెను వారలుం గనిరి ముక్తివధూపరిరంభణక్రియల్. 205

వ. ఈశ్వరుని బూజించిన ఫలం బేతాదృశం బగు నిప్పుడు నక్కడ మహామునీంద్రులు మాఘమాసంబునఁ గావేరీకపిలాసంగమమధ్యగతుం డైన శంకరుం బూజింతురు మోక్షార్థంబు మహాత్ములకు దుర్లభం బైన యీయుపాఖ్యానంబు నారదుండు నాకానతిచ్చె వినువారలకు బ్రహ్మలోకంబు సిద్ధించు నింక విశ్వేశ్వరస్థానంబు మాహాత్మ్యం బెఱింగింతు వినుమని యుధిష్ఠిరునకు భీష్ముం డిట్లనియె. 206

## విశ్వేశ్వరస్థానమహిమ.

సీ. చెలఁగుఁ గావేరి దక్షిణతటంబున సురసేవ్యమై భార్గవక్షేత్ర మొకటి
శిలికంతు మూలను శ్రీనివాసునికిఁ దక్కువయయి నాల్గుపరువులమేర
సంవర్తుఁ డను మునిస్థానంబు పరమపావన మచ్చటను భరద్వాజముఖ్య
యోగీశ్వరులు బ్రాహ్మణోత్తము లాజులు నాచరించిరి బహుయాగసమితి
గీ. యందు గాయత్రి యనుశిల యట్ల యజ్ఞ, శిల యనఁగ నొక్క ప్రస్తర మలరు దాని
చెంగటను మించు సంవర్తలింగమునకుఁ, బూజగావించి నలుఁ డెల్లభూమిఁ గాంచె.

క. ఆశివునకుఁ బడమరగాఁ, గ్రోశము దూరమున వృక్షకోటియుతం బై
కౌశికమునియాశ్రమ మఖి, లాశాపరిగణితవృత్తి నలరుచు నుండున్. 208

క. అక్కడ దీర్ఘశిలాభిద, మొక్కటి పెనుఱాయి దనరు నుర్వి బొగడ నా
చక్కిని జేయుంజపాదిక, మెక్కువయై కోటిలెక్క నిహపరము లిడున్. 209

వ. అచ్చటఁ గౌశికమునిప్రతిష్ఠితంబైన కుశలింగంబు దనరుఁ దదాశ్రమసమీపంబున వసిష్ఠసుతుండు కుండినుం డనువిప్రముఖ్యుండు తపంబొనరించి ప్రత్యక్షంబైన శంకరునిచేత సకలశాస్త్రోపదేశంబుగాంచి గోత్రఋషియై నందివాహననామంబున నద్దేవుని నిలిపి యతనికి సఖుండయ్యెఁ గావేరీస్నానం బాచరించి నందివాహన లింగంబును గుశనాభలింగంబును సంవర్తకలింగంబును దర్శించినవారి కణిమాద్యష్టైశ్వర్యంబులు కరతలామలకంబు లనిసుర లాచరింతు రాముంగలం బవనాశ్రమంబు గలదు అచ్చట హరిశ్చంద్రుండు రాజసూయం బొనరించి సురలోకంబుఁ బ్రాపించె

నట్లు కార్తవీర్యుం డొనరించి చక్రవర్తి యయ్యె నాముంద బోధాయనుం డను ముని విశ్వేశ్వరు నారాధించి చతుర్దశవిద్యావిశారదుండై సూత్రకర్తల కగ్రజుండై సూత్రంబు గావించె నది విశ్వేశ్వరస్థానం బిప్పుడును నట వటవృక్షోత్తరభాగంబు సర్వపుష్పఫలంబుల నొసంగుచున్నయది యీప్రాంత దక్షిణతటంబున నాగ్నేయభాగంబునఁ బుండరీకాక్షు ధ్యానంబు గావించుచు భృగుమహాముని చెలంగుఁ దదారోపితంబగు నశ్వత్థంబు స్వర్గకాంక్షులు సేవింతు రావృక్షంబు మొదల యాజ్ఞవల్క్యుండు విశ్వేశ్వరధ్యానంబున నిష్ఠుండై బ్రహ్మచారులకు శాస్త్రదర్శనంబు గల్పించు భగవంతుం డైన యగస్త్యుండు విశ్వేశ్వరలింగంబుఁ బ్రతిష్ఠచేసి ముక్తిం గోరి సేవించుచుండు స్థావరజంగమాత్మకం బైనయీజగం బావిశ్వేశ్వరుండ యతనికి నమస్కరించి గజారణ్యమాహాత్మ్యం బెఱింగించెద విను మని యుధిష్ఠిరునకు భీష్ముం డిట్టు లనియె. 210

## గజారణ్యమాహాత్మ్యము.

సీ. మును వసిష్ఠకులీనుఁ డనఘుండు సోమదత్తాఖ్యుం డొకండు ధరామరుండు
లేమి వేసరి ముక్తి కామిని వరియింతు నీఁక జన్మదుఃఖంబు లెల్ల నొడుతు
నని కాశికాక్షేత్రమున కేగి బ్రాహ్మణపటలంబుతోడఁ దపంబు నేసి
శంకరుఁ బొగడ నాస్వామి ప్రత్యక్షమై కపిలకావేరియుం గలసె నెచట
గీ. నచ్చటికి యోజనార్థంబునందు వెలయు, నమరనుతము గజారణ్య మది మదీయ
వసతి యిహసౌఖ్యమంతకు వాడపట్టు, పరము నీసొమ్ము నిజ మని పలికి చనియె.
గీ. బంధువర్గంబుతోడ నాబ్రాహ్మణుండు, నఖిలభోగంబు లిచ్ఛగా ననుభవించి
ముక్తికాంక్షను జన వింధ్యమున గజంబు, లడ్డు పడి త్రుంచె వారి మాఱుమగకుండ.
క. కొట్టువడి భూమిసురు లా, గట్టునఁ దద్భావయుక్తి గజవల్లభులై
పుట్టి పురవైరిభక్తి, న్నట్టిగ వర్తించి రీశుకారుణ్యమునన్. 211
సీ. అక్కడఁ గలపుణ్య మవని వర్ణింపంగ శక్తు లెవ్వార లీశ్వరుఁడ యెఱుఁగు
గజరూపమును దాల్చి ఘనులు విప్రులు ప్రత్యహంబును గావేరియందు స్నాన
మాచరించుచు నిరహంకారులై శర్వు శివు నుమానాథుఁ బూజించుచున్న
నావేల్పు ప్రత్యక్షమై వారినందఱఁ దనలోన నిడుకొని చనియె నీశుఁ
గీ. డదియె మొదలుగఁ దత్తీర్థ మతిశయిల్లె, నఖిలదిశల గజారణ్య మనఁగ నందు
నయుతలింగంబు లొప్పారు నచటి మహిమ, వినినఁ బఠియింపఁ గోరుదు ల్విస్తరిల్లు.

క. కావేరిమహిమ నొడువం,గా వచ్చునె యెరికైనఁ గల్పశతంబుల్
శ్రీవిభుఁ డగునారాయణ, దేవుం డొక్కండె యెఱుఁగు ధీరవరేణ్యా. 215

సీ. ఉభయతీరంబుల నొనరు యోజనమున గవ్యూతిఁ గోసెంట ఘనమునీశ్వ
రాశ్రమస్థలము సింహాద్రిసాగరమధ్యభూముల మృగపక్షిభూజములకుఁ
గైవస మైయుండుఁ గైవల్య మన మానవులకుఁ గల్దనివేఱె పలుక నేల
సుర సిద్ధ సాధ్య కిన్నర యక్ష గంధర్వ ముని దైత్యదానవజనము లుందు

గీ. రచట జాహ్నవి రేవయు యమున గౌత
మియుఁ ను మూఁడును నాల్గైదు మేర లైన
దినములకుఁ ద్రుంచు పాపంబుఁ ద్రెంచివైచి
శుభము లొనగూర్చుఁ గావేరి చూచినపుడ. 216

వ. గజారణ్యంబునకు ముంగల యోజనద్వయమాత్రంబునఁ గావేరీవారివిహారం బాచ
రించుచు సదాశివుండు భీమేశ్వరనామంబున వర్తిల్లు నచట మున్ను నలుండు కారణ
వశంబునం గాంతి దొరంగి యజ్ఞాతవాసంబున నుండ నతని మామ యగు భీమభూ
పాలుం డల్లునిం గానకవచ్చి యద్దేవు నిట్లని స్తుతియించె. 217

ఇంద్రవజ్రము. గౌరీప్రియా శంకర కాలకంఠా, తారేశఖండామృతధౌతజూటా
నారాయణాస్త్రోజ్జ్వలనాగభూషా, కారుణ్యదృష్టి న్ననుఁ గావు మీశా. 218

ఉపేంద్రవజ్రము. ఉమాప్రియా శంకర యోగి వంద్యా, సమస్తలోకావనచారు దీక్షా
సమాధికాన్యప్రభుశబ్దశూన్యా, క్షమింపు నానేరమి చంద్రజూటా. 219

క. అని భీమధరాధీశుఁడు, వినుతించిన శంకరుండు వృషవాహనుఁ డై
కనుఁగవఁ గారుణ్యరసం, బెనయఁగఁ బ్రత్యక్ష మగుచు ని ట్లని పలికెన్. 220

ఉ. [1]కోరికి దీర నల్లుఁడును గూఁతురు వత్తురు వేగ నింక నీ
పేరను లింగ మిచ్చటను బెంపగు చుండు నొకప్పు డైనఁ గా
వేరిజలంబుల న్మునిఁగి విశ్వపతి న్ననుఁ గొల్చువారికిం
జేరువ సమ్ము కాఁపురము సేయఁగ నాపుర మెల్ల కాలమున్. 221

ఆ. ఇట్లు నొడివి పార్వతీశుండు తన వెళ, పునకుఁ జనియె భీమమనుజపతియు

1 దారితవైరి వీరనిషధక్షితినాయక వేఁడు మిచ్చెదం, గోరుకులెవ్వియైన మది
గొంచకుమా కలిదోషవారిధిం, బారముగాంచి యంచితశుభమ్ముల ధారుణి యేలు నింత
టం, జేరువసమ్ము కాపురము సేయఁగ నాపురమెల్ల కాలముక్.

సాత్మపురము చేరె నంతట భృగు వేగు, డెంచి యచట జపము మించఁ జేసి. 222

ఉ. ఎప్పుడు చూతు శంకరుని నెప్పుడు గాంతు హరుక జటాటవిం
ద్రిప్పుడు గొన్న నిర్ఝరనదీమణి కెవ్వఁడు మేనిచాయలం
గప్పినచంద్రభూషణవికాసము లానుదుఁ జిత్తవృత్తిగా
నెప్పుడు నాతపంబు ఫలియించునొ కోరుకు లెప్పు డబ్బునో. 223

గీ. అనుచు వినుతించుచుండు నాయవసరమున, నలుఁడు చనుదెంచి కావేరి జలకమాడి
భీమనాథుని దర్శించి భృగువుఁ గాంచి, వినుతు లొనరించి కలిబాధ విన్నవించె.

వ. ఇట్లు విన్నవించి దైవకృతం బైనకుత్సితరూపంబు నూపి వగచిననలునకు దయాపరుం
డై భార్గవుం డి ట్లనియె. 225

సీ. మనుజప యీరూపు మాపి మున్నటి మోహనాకృతి దయసేయుం నభవుఁ గొలువు
మిది కాశి భీమేశ మదె జూడు పుష్కరిణీత్రయం బిచ్చోట నిఖలపాప
వితతి నేఁడు దొరంగెఁ గృతకృత్యుఁడ వయితివి ఋతుపర్ణుఁ డిక్ష్వాకుయోఱింగి(?)
యామహాదేవుని యమితమహిమఁగాంచెఁ గర్కోటకుండు శాకల్యమౌని

గీ. శాపవశమునఁ బాముయి సంభవించి, భాగ్యములకల్మి నేతెంచి భక్తి ముక్కు
సరస మెలఁగుచు నంత నాచంద్రమౌళి, కభినవం బైనభూషణం బై చెలంగె. 226

క. కలిదోషహరణశక్తి, న్వెలసెద వారీతి నీవు వెలఁదియుఁ నిన్నుం
గలసి పెనుపొందు నట్టులు, తలఁకకు నీవింక నిషధధరణీనాథా. 227

వ. కర్కోటకుని ఋతుపర్ణుని నిన్ను దమయంతిని గీర్తించిన వారికిఁ గలిదోషంబు
లణంగును జుమ్ము కావేరీస్నానంబును భీమేశ్వరదర్శనంబును నొనరించి ఋతుపర్ణ
పురంబున వసియింపు మంతట నిజస్థానంబున శుభంబు లందెద వని భార్గవుం డానతి
చ్చిన నలుండు నట్ల యాచరించి స్వకీయరాజ్యంబునం గాంతాసమేతుం డై యి
ష్టోపభోగంబులం దేలుచుండె నీవు న ట్లిట్టిం గాచరింపుము కౌరవరాజ్యంబు నొందెద
వనిన గుంతీనందనుండు గంగానందనున కి ట్లనియె. 228

గీ. చంద్రపుష్కరిణీస్నానజనితఫలము, రంగనాథుని దర్శింపఁ జెంగలించు
మహిమ లక్ష్మీశుఁ డచ్చట మరగి యున్న, తెఱఁగు వివరింపవే నాకుఁ దెలియఁ దాత.

వ. అని యడిగిన యుధిష్ఠిరునకు భీష్ముం డి ట్లనియె. 230

గీ. కరము విలసిల్లుఁ జంద్రపుష్కరిణి క్షేత్ర, రాజ మనఁగను బ్రహ్మకృత మై జనార్ద
నుండు తనయందు మెలఁగ నాపుండరీక,[1]నయనుగీర్తించువారిల్లు నాకనగరి. 231

1 నయనుగీర్తించువారలు నాకలోక, మందు నుందురు రెప్పుడు నతివిభూతి.

గీ. చంద్రపుష్కరిణీస్నానసంభ్రమంబు, రంగవిభుపాదపద్మమరందసేవ
పురుషజన్మంబు నీమూఁడుఁ బొందు టరిది, కలియుగంబున నెంతటిఘనులకైన. 232

క. మునిగంధర్వసురాసుర, మనువసు దిక్పాలచంద్రమస్సూర్యాదుల్
చనుదెంచి యచట నుందురు, రనిశంబు మనోరథంబు లలవడుచుందున్. 233

క. కొందఱు వైరాగ్యంబును, గొందఱు బహువైభవములు కొందఱు ముక్తిం
జెందఁగఁ గోరి సురాసురు, లందఱు నందుందు రెపుడు హర్షము నొందన్. 234

చంద్రపుష్కరిణీక్షేత్రమహిమ.

సీ. ఈక్షేత్రమాహాత్మ్య మెఱిఁగించె నారదమునివరేణ్యుఁడు నాకు వినుము నీకుఁ
దెలిపెద నది ము న్నదితి దేవతలతల్లి సుతువేఁడి పతియనుమతిని జంద్ర
పుష్కరిణీతీరభూమి నారాయణు గోవిందు మాధవుఁ గూర్చి తపము
ముప్పది వేల్వర్షములు చేసి ప్రత్యక్ష మగుచు నాహరి కోర్కు లడుగుమన్న

గీ. దనుకజయశాలి నీవంటి తనయు నొసఁగు, స్వర్గవిభవంబు త్రైలోక్యసంపదయును
వాసవున కిమ్ము రాక్షసవధ యొనర్పు, మర్థిమందార యని మ్రొక్కి యభినుతించి. 235

క. ఈ చందంబున వరంబుగోరిన దక్షతనయకుఁ బుండరీకాక్షుం డి ట్లనియె. 236

క. నావంటి కొడుకుఁ గోరితి, వేవెరవున నాకు సాటి యేనే జగతిం
గావున నీకేఁ దనయుఁడ, నై వెలసెద వేగ నరుగు హర్షముతోడన్. 237

క. అని చనియె హరియు నదితియుఁ, దన పెనిమిటి కశ్యపునకుఁ దాత్పర్యముతో
వినిపించి మంచిదినమునఁ, గనియె న్సుతు లోకరక్షుఁ గంజదళాక్షున్. 238

చ. కరమున శంఖచక్రములుఁ గర్ణముల న్మణికుండలద్వయం
బురమున దివ్యకౌస్తుభము నూరువులం గనకాంబరప్రభల్
శిరమున రత్నకాంచనవిచిత్రకిరీటముఁ జూచి యాతఁ డా
హరి యని కశ్యపుండు నిగమాంతముల న్నుతియించె సూనునిన్. 249

గీ. అదితిదేవియుఁ గశ్యపుఁ డభినుతింప, జలజనేత్రుండు ముదమున బలియొనర్చు
యాగవాటంబునకు నేగి యజ్ఞఫలము, లతని కొనగూర్చి యిట్లని యానతిచ్చె. 240

మత్తకోకిల. చంద్రపుష్కరిణీతటంబున సర్వకాలము నన్ను ని
స్తంద్రభక్తిని బూజసేయుము దానవత్వము మానిసీ
వింద్రచంద్రవతంసనిర్జరు లెల్లఁ గోరుపదంబు నా
చంద్రతారక మై తనర్పఁగ సంతరించెద వో బలీ. 241

ఆ. నీకు దివ్యదృష్టి నేఁడిత్తు నారూప, మదిగో లెస్స కను మటంచుఁ బలికి
భయము గదుర నెదుర బ్రహ్మాండములు నిండి, పెరిగి చూపెఁ దనదు పెంపు మిగుల.
వ. అంతట బ్రహ్మాదిదివిజసంఘంబుల సన్నుతులు గైకొని మనుష్యరూపంబు ధరియించి. 243
క. పుష్కరలోచనుఁ డప్పుడు, పుష్కరహితనులుఁడు దివిజపుంగవుఁ డగుచుం
బుష్కరవాసినితోవిధు, పుష్కరిణీతీరభూమిఁ బొందఁ దలంచెన్. 244
క. లలిఁ బౌలస్త్యకులంబునఁ, గలిగె విభీషణుఁ డనంగఁ గమలాపతియుఙ్
వెలసెను రవివంశంబున, నలఘుఁడు శ్రీరామచంద్రుఁ డై సుర లలరన్. 245
సీ. రామచంద్రుఁడు రణరంగస్థలంబున దశకంఠు నిర్జించి దనుజ వాన
రేంద్రులతోఁ దమ్ముఁ డింతియుం వెంటరా సాకేతనగరికి జరగి యచట
ఘను విభీషణుఁ బిల్చి కట్నంబు లిక్ష్వాకుఁ డొనరించు హరిపూజ నొసఁగి లంక
కనుప నాపౌలస్త్యుఁ డనుమతిఁ గైకొని ధ్యానంబు సేయుచుఁ దరలి నడుమఁ
గీ. జంద్రపుష్కరిణీతటస్థలిని దేవ, విభుని నిలఁ బెట్టి శంకానివృత్తిఁ దీర్చి
వచ్చి వారిచి మరలంగఁ బుచ్చుకొనఁగ, నొడిఁగి యింతైనఁ గదలింప నోపలేక 246
క. వెఱఁగుపడి యెన్నియేనియు, వెరవులఁ గదలించి చూచి వెడలింపంగా
బరవసము లేక చింతిలు, తఱి దివి నొక పలుకు మొలచె దనుజపతి వినన్. 247
ఉ. అక్కట! లంక దుష్టదనుజావృత గాన యొకింతయుం న్మనం
బెక్కదురా కవేరసుత యిక్కవ నిక్కడ నుందు నీకు నేఁ
దక్కతి నేఁట నొక్కపరి తప్పక వచ్చి మదీయ పూజపెం
పెక్కఁగఁ జేయు ముక్తియగు నీజనసాంతమున న్విభీషణా. 248
ఆ. అఱునెలల కొక్క మాఱు నీవెప్పట్టు, నైన వచ్చి చేయు మస్మదీయ
పూజ యిచటఁ గల్గు భుక్తియు ముక్తిశ్రీ, రంగ మిదియె భువన మంగళంబు. 249
క. అని పలికి కపటమార్గం, బున రంగస్థానమునకు బోటియుఁ దానుం
జనుదెంచి నిలిచె మాధవుఁ, డనవరతము సాధురక్షణార్థము ధాత్రిన్. 250
ఆ. అంతఁ బూజచేసి యరిగె విభీషణుం, డదియుం మొదలుగాఁగ నమరవరులు
భుక్తి ముక్తిఁ గోరి పూజ గావింతురు, రంగపతికి మనము చెంగలింప. 251
క. రంగేశ రంగనాయక, రంగాధిప రంగనాథ రంగ యటంచున్
రంగపతిని గొల్చిన నా, రంగేశ్వరుఁ డిచ్చు శుభపరంపర లెలమిన్. 252
గీ. చంద్రపుష్కరిణీస్నానసంభ్రమంబు, రంగనాయక శాస్త్రప్రసంగ మఖిల
జనకుఁ డైనట్టి శ్రీరంగశాయిఁ గొల్వ, ధర్మవంతుల కబ్బు నీధరణిలోన. 253

క. సనకాది మునిసమూహము, వనజాసనముఖ్య దివిజవర్గము ప్రతిహా
యనమును బూజింతురు తమ, జననం బలరంగ రంగశాయిం బ్రీతిన్. 254

క. సంసారాంబుధి గడప రి,రంసాపరులైన దివిజరాజుల కైనన్
హంసతురంగమసుతుఁడగు, కంసారిన్ రంగశాయిఁ గనుఁగొనవలయున్. 255

క. విన్నను ధ్యానము చేసినఁ, గన్నను బూజించిన నమస్కారం బన్నన్
వెన్నుండు రంగశాయి ప్రసన్నత నిహపరము లిచ్చు జనులకు నెల్లన్. 256

గీ. రంగనామంబు నొడువుచు రంగవిభుని, చరణయుగళంబుపై భక్తి సలుపువారి
పుణ్యపాళిని లెక్కింపఁ బోల దెందు, ముక్తికాంతకు వారలే మొదలివారు. 257

వ. ఈయుపాఖ్యానంబు విన్నవారలకుఁ బాపంబు లణంగు రంగధాముపాదపద్మంబుల
పై భక్తి సిద్ధించు ననిన విని చంద్రపుష్కరిణీనిర్మాణంబు గావించినవార లెవ్వారాన
తీయవే యని యడిగిన యుధిష్ఠిరునకు భీష్ముం డిట్లనియె. 258

గీ. చంద్రపుష్కరిణీజలస్నాన మచట, రంగవిభుదర్శనంబును సంగమమును
వంచనంబును లోభంబు వలననైనఁ, జేయువారికి మోక్షంబు చేతిసొమ్ము. 259

ఉ. ఎవ్వరు రంగనాథుని భజింతురొ యెవ్వరు సన్నుతింతురో
యెవ్వరు పూజసేయుదురొ యెవ్వరు కానుక లప్పగింతురో
యెవ్వరు చూడఁ బోవుదురొ యెవ్వరు నెమ్మది నావహింతురో
యవ్విమలాత్ము లందఱకు సాధ్యులు పూజ్యులు వంద్యు లన్నిటన్. 260

గీ. చంద్ర పుష్కరిణిని నిచ్చ స్నాన మాచరించి రంగేశుసేవ గావించువారి
కఖిలతీర్థతపోవ్రతయాగఫలము, లబ్బు నిమ్మగ సురలోక మబ్బుచుండు. 261

వ. ఇందుల కొక్కయితిహాసంబుగల దది శ్రోతృపాతకహారంబై చెలంగు విను మెఱిం
గించెద. 262

సీ. మును సోమవంశసముద్భవుం డగురాజు ధర్మకేతుఁడు మహాధర్మశాలి
విష్ణుభక్తుఁడు జగద్విఖ్యాతుఁడై చంద్రపుష్కరిణీతీరభూమి రంగ
విభుసేవ గావించి వేయి యాగంబులు జనసీజనకపూజ కనకరత్న
వస్త్రాన్నగోతిలవసుధాదిదానంబు లొనరించి తత్పుణ్యమున సమస్త

గీ. బంధువర్గంబుతో విష్ణుపదవియందు, నలరె నవ్వేళఁ దత్సోమయాజకుండు
యజ్ఞవత్సులుఁ డను విప్రుఁ డాగమాంత, వేత్త యయ్యును దుర్వృత్తవితతిఁ గూడి
కనక మార్జింప ధర యెల్లఁ గలయఁ దిరిగె. 263

క. నమ్మినవానిని జెఱుచుచు, నమ్మంగా రాని పరకు లమ్ముచు దనకిం

కమ్ములు మాని సదా కిం,కమ్మునఁ గా మరగి సొమ్ము గడియించె వెసన్. 264

క. శ్వాసము కాసము కుత్తుక, దాసి నిరోధింప నర్మదాతీరమునా
వాసంబునఁ బ్రాణమ్ములు, వాసెం దత్కర్మకృతికి బాహిర మగుచున్. 265

గీ. యజ్ఞవత్సలుఁ డట్లు దేహంబు విడువ, నతని కామిని నవరూప యౌవనముల
మాఱుబేరంబు లాడంగ మరగెఁ దనదు, చక్కఁదనమున జగమెల్లఁ జిక్కఁబట్టి. 266

క. ఆలోలాక్షికి నొక చం,డాలునకు స్సంభవించె నందనుఁ డతఁ డా
కాలునికైవడి జగదా, ఖీలుం డై పాపబుద్ధిపేరం బరఁగెన్. 267

క. తల యొడ లెఱుఁగక యావులఁ, బులుఁగులఁ గన్నపుడె పట్టి పొలియించుచుఁ బాఁ
పలకుం బీఁటలు మఱి యూ,లలకు న్మంచములు వేయం లలిఁ గట్టేఁడి యై. 268

గీ. కన్నములు వేసి తెరువులు గాచి కొట్టి
కొండెములు చెప్పి వఱకులు గూర్చి కోడి
పందెములు గెల్చి యోడించి పాపబుద్ది
సారిది నాలుగులక్షలసొమ్ముఁ గూర్చి. 269

వ. అది చాలక భూసంచారంబు సేయుచు నొక్కనాఁడు కావేరీమధ్యగామినియైన చంద్రపుష్కరిణి కరిగి యచటఁ గాంచనకుంభాచ్ఛాదితంబు దివ్యాలంకారశోభితంబైన రంగేశునివాసంబుఁ గాంచి నిశాసమయంబున నచ్చటి సువర్ణంబు లపహరింతు నను ముదంబున స్నానం బాచరించి యద్దేవునకు నమస్కారంబు లొనరించుచు భక్తియుక్తుండునుం బోలె రత్నసువర్ణంబు లున్నయిక్కవ లరయుచు నచ్చట నొకదెస నివాసంబు చేకొని యర్ధరాత్రంబునఁ గావేరీజలప్రవాహంబు ముంచినం జోరుల తోడఁ బాపబుద్ధియు లయంబునొందె నాసమయంబున సిద్ధసాధ్యగంధర్వాదులు సేవింప దివ్యవిమానసహస్రంబు చేతెంచి వారిని బ్రహ్మలోకంబునకుం గొనిపోయిన వార లచ్చట వేయుయుగంబులు సకలభోగంబు లనుభవించి విష్ణులోకంబున కరిగి యఖిల దివ్యలోకంబుల నిచ్ఛావిహారంబున వర్తించిరి. పాపవర్తనులకీచందం బబ్బె నింకఁ బ్రియపూర్వకంబుగా సేవ గావించిన మహాత్ములం బలుక నేల. 270

సీ. జ్ఞానసంపన్నుఁ డష్టాదశద్వీపభూపతి సింధుమన్నాముఁ డతులయశుఁడు
చంద్రవంశపురాజు జాతిస్మరత్వము హరిభక్తి తనకెల వై చెలంగ
నిచ్చలు రంగేశు నిలయంబునకు నేగి యలికి ముగ్గులు పెట్టి యావునేత
దీపంబు లిడు చొక్కదినమునఁ గావేరిఁ జంద్రపుష్కరిణిని జలకమాడి
గీ. భూషణశ్రేణి నద్దేవుఁ బూజసేసి, యచట భృత్యులతో ముత్తుఁ దయ్యొ నది యొ

ఱంగి యరుదంది నాకెఱుఁగంగఁ బలికె, నారదుండు గంగానదీతీరమునను. 271

గీ. జన్మకోటి సహస్రము ల్సకలపుణ్య, సమితిఁ జేకూర్చుకొన్న యాజనులకెల్లఁ
జంద్రపుష్కరిణిని రంగస్వామి మీఁద, నిశ్చలం బైనభక్తియుం నిలిచి చెలఁగు. 272

గీ. కామితార్థంబు చంద్రపుష్కరిణి యొసఁగు, గ్రహపతిత్వము భాసితకాంతిపుంజ
మతులతపమున మాధవు నలరఁ జేసి, యతనికృపఁ జెంద శీతాంశుఁ డచటఁ గాంచె. 273

వ. అనిన విని కళానాథుం డేమిటికై తపం బాచరించె నాకానతీయవే యని యడిగిన
యుధిష్ఠిరునకు భీష్ముం డిట్లనియె. 274

గీ. తపనుఁ డిచ్చట మును చాలఁ దపము చేసి, జలజనాభుని దయ లోకచక్షుఁ డయ్యె
నది మృగాంకుండు దెలిసి సమ్మదముతోడ, నంతరరిపువర్గము జయించి యతనికరణి. 275

మత్తకోకిల. దివ్యపుష్కరిణీతటంబున దేవవల్లభు నిందిరా
సేవ్యమానపదాంబుజున్ హరిఁ జింతసేయుచుఁ బాడుచున్
భవ్యలీలఁ దపంబు సేయఁగ భక్తవత్సలుఁ డైన యా
యవ్యయుండు ప్రసన్నుఁ డై దయ నాదరించుచు నిట్లనున్. 276

క. ఏమిటికిఁ దపము చేసెదు, నీమదిఁ గల కోర్కులెల్ల నెఱిఁగింపుము నా
కా మేలు నీకు నిచ్చెద, సోమా భీమోత్తమాంగ సురుచిరధామా. 277

క. అని యిట్లు చెవులు చల్లఁగ, మన మలరఁగఁ బలుకుచున్న మాధవుఁ గని చ
క్కన సాఁగి మ్రొక్కి సొక్కుచు, వినుతించె సుధాంశుఁ డధికవేదస్తుతులన్. 278

సీ. హరి నీలదేహాయ శరధిజామోహాయ దేవతాస్నేహాయ తే నమోస్తు
భక్తమందారాయ బహువేదసారాయ ధృతలోకభారాయ తే నమోస్తు
కౌస్తుభాభరణాయ కరిరాజశరణాయ తీర్థవచ్చరణాయ తే నమోస్తు
రక్షితదాసాయ రమ్యవిలాసాయ దినకృన్నివాసాయ తే నమోస్తు

గీ. దితిసుతాంతక మాధవ తే నమోస్తు, దివ్యమణిమాల్యహారాయ తే నమోస్తు
దేవకారుణ్యసాగర తే నమోస్తు, దీనవత్సల గోవింద తే నమోస్తు. 279

వ. అని యనేకవిధంబుల స్తుతియించి 280

గీ. శీతకరకాంతి సౌభాగ్యసిద్ధబింబ, మిమ్ము నాకిందు నీవుండు మీసరంబు
భుక్తిముక్తు లొసంగుచుఁ బుడమి నాదు, పేర విలసిల్లఁజేయుము నీరజాక్ష. 281

వ. అని వరంబు వేఁడిన తారాధీశ్వరునకు లక్ష్మీవల్లభుం డిట్లనియె. 282

గీ. అర్కునకు నీకు భేద మింతైనఁ గలుఁగ
దగుము రెండవవాఁడ వీయాన నీవు

సంశయము లేదు చంద్రపుష్కరిణి యనఁగఁ
బరఁగు ధారుణి నీసరోవరము చంద్ర. 283

క. తత్తఱము మాను మే నా, చిత్తజుజనయిత్రి కోర్కి చెల్లించి ముదా
యత్తగతి వచ్చి యత్తుక, యిత్తటి విహరింతు సంశయింపకు చంద్రా. 284

వ. అనిన విని యశేషలోకజనని యగు నిందిరాదేవి యెక్కడ నేచందంబున వర్తించు
చున్న దెఱింగింపవే యనిన సుధాంశునకు నారాయణుం డిట్లనియె. 285

సీ. శిష్టరక్షణమును దుష్టశిక్షణము నేనొనరింపఁగాఁ ద్రేతయుగమునందు
జనియింపఁ దాఁ బాయఁజాలక కుంభఘోణమున నానామరనాథసంఘ
మేదురం బైనలక్ష్మీసరోవరమున స్వర్ణపంకజవని ప్రక్కనిలిచి
తపము సేయుచు నన్ను ధ్యానించుచున్నది యాఱునూఱుయుగంబు లయ్యె నిప్పు
గీ. డబ్ధికన్యక యచ్చటి కరుగవలయుఁ, బోయి వచ్చెద నిది మొదల్పుణ్యమహిమ
నోషధీనాథుఁ డగుము నీ పుర్విలోన, హర్షకర మైనపదవికి నరుగు చంద్ర. 286

## కుంభఘోణమహిమ.

వ. అనిన విని యిందిరాదేవి యెంతదూరంబున వర్తించుచున్నది కుంభఘోణమాహా
త్మ్యం బేచందం బెఱింగింపవే యని సుధాకరుం డడిగినఁ జక్రహస్తుం డిట్లనియె.

గీ. తూరుపున నాలుగామడ మేర తామ్ర, పచట హేమాబ్జవని మించు నందుఁ గుంభ
ఘోణ మొప్పును గీర్వాణకులము పొగడ, నాతటమున లక్ష్మీసర మతిశయిల్లు. 288

క. తన పేరిట ఘనతపమున, నొనరించిన మడుఁగు గాన నున్నది యిపుడున్
వనజనివాసిని యచ్చట, మనుతోని యదిక్షేత్రములకు ముఖ్యము చంద్రా. 289

గీ. అచట నొకపూఁట స్నానంబు లాచరింపఁ, దనరు స్వర్గంబు వాసరత్రయము నిలువ
నలినభూలోక మబ్బు దానంబు సేయఁ, బితరు లెల్లరు ముక్తిసంప్రీతిఁ గంద్రు. 290

వ. ఇతరస్థలంబులం జేసిన పాపంబు పుణ్యక్షేత్రంబునఁ బోవుఁ బుణ్యక్షేత్రంబునం
గావించిన యఘంబులు వారాణసి నశించు నక్కడ చేసిన కిల్బిషంబులు కుంభఘో
ణంబునం బాయుఁ గుంభఘోణంబున సంపాదించిన దురితంబులు కుంభఘోణం
బుననే నశించుఁ గావున సర్వోత్తమం బైన యాక్షేత్రంబున కరిగెద నీవు మత్పూజా
పరుండవై సుఖంబున నుండు మని రమావిభుం డంతర్ధానంబు నొందె నదిగనుంగొని
యద్దేవుని ధ్యానంబు గావించుచు నచట ననేకకాలంబు వసియించి శీతభానుం
డుగ్రభానునికి జోడు కోడై విహరించుచుండె. 291

క. తారాపతిఁ గనుఁగొని యా, తీరునఁ గుజసౌమ్యజీవ దితిజకవిశనుల్

భూరితపంబున గ్రహాసం, ఖ్యారూఢతఁ జెంది రచట నమరులు పొగడన్. 292

వ. ఈయుపాఖ్యానంబు విన్నవారికి మనోరథంబు లీడేఱు ననిన గంగానందనునకుఁ గుంతీనందనుం డిట్లనియె. 293

చ. హరి శరణాగతార్తిహరుఁ డాయన యేక్రియ శంభుమూర్తియై
వరము లొసంగు భక్తులకు వారి భజించువిధాన మెద్ది యె
వ్వరు మును పూజచేసి యపవర్గముఁ గాంచిరి శైవు లెగతిన్
నిరుపమవిష్ణులోకమున నిల్తురు తెల్పఁగదే నదీసుతా. 294

వ. అని యడిగిన భీష్ముండు యుధిష్ఠిరునకు నిట్లనియె. 295

## హరిహరాభేదవివరము.

క. నారాయణుఁ డన శివుఁ డన, సారసభవుఁ డనఁగ వేఱు శబ్దములే త
త్కారణములు త్రిగుణంబులు, వారికి భేదంబు లేదు వసుధాధీశా. 296

సీ. ఈయర్థమున కొక్కయితిహాస మెఱిఁగింతుఁ గృతయుగంబునఁ దుల్యమతి గురుండు
సకలాగమజ్ఞుండు శాస్త్రవేత్త సుశాంతుఁ డనుబ్రాహ్మణోత్తముం డవనివొగడఁ
గామితార్థంబులు గార్హస్థ్యమునఁ జెంది ముక్తిఁ గోరి గిరీశభక్తుఁ డగుచు
బ్రహ్మదత్తాఖ్యుండు పాలించుకిష్కింధ కరిగి పంపావారి నవయవములు

గీ. కడిగి శితికంఠు గౌరీశుఁ గమలనాభు, హరుని బూజానమస్కృతి ధ్యానములను
హర్ష మొందించుచును నిరాహారనిష్ఠ, జపముగావించుచుండు నాసమయమునను. 297

గీ. ధర్మకుశలాఖ్యుఁ డొకకాఁపు ధర్మశాలి, యై విరూపాక్షు సేవింప నరుగుదెంచి
సేవచేయ సుశాంతుని చెలిమిచేసి, యెలమి నారీతి నచట నూఱేండ్లు నిలిచె. 298

వ. తదనంతరంబ విరూపాక్షుం డతనికిఁ బ్రత్యక్షం బై యిట్లనియె. 299

క. నను శంకరుఁగా నెఱుఁగుము, చనుదెంచితి నీదు కోర్కి సమకొల్ప ముదం
బున వేఁడుము వరమిచ్చెద, మనమునఁ గొంకకు సుశాంత మహితస్వాంతా. 300

క. అని పలికెడు హరుమాటలు, విని మనమున సంతసంత విస్మయ మొదవన్
ఘనభక్తి మ్రొక్కి విప్రుఁడు, వినుతించె న్నీలకంఠు విజయోత్కంఠన్. 301

క. హర నీలకంఠ శంకర, పురభంజన శర్వ యురగభూషణ గంగా
ధర యభవ చంద్రశేఖర, కరుణాకర కావవయ్య గౌరీరమణా. 302

గీ. అని నుతించిన శంకరుఁ డమరగణము, పొగడఁ బ్రత్యక్షమైన నాభూమిసురుఁడు
వినుతి గావించి యాచతుర్థునకుఁ దనకుఁ, గరుణఁ గైవల్య మిమ్మని వరము వేఁడె. 303

వ. ఇత్తెఱంగున వరము గోరిన సుశాంతునకుఁ జిఱునవ్వు దళుకొత్త గౌరీకాంతుం
డి ట్లనియె. 304

క. ఒసరించెద నిప్పుడు నీ, మనమునఁ గలకోర్కెలెల్ల మఱి శూద్రునకున్
జననాంతరమున నొసఁగెద, విను తప్పదు నాదుపలుకు విప్రవరేణ్యా. 305

గీ. అనిన నామాట విని యట్లయైన ముక్తి
కెట్లుచను దెంతు నామిత్రుఁ డితఁడు రాక
దేవ యని మ్రొక్కి విప్రుఁడు తిరుగఁ బూనె
శంభుపంచాక్షరీమంత్ర జపము సేయ. 306

గీ. అపుడు విప్రు నిరీక్షించి హరుఁడు పలికె
నట్ల కానిమ్ము మీఁది జన్మాంతరమునఁ
దగని జగడంబు జనియింపఁ దిరుగ నన్ను
దర్శనము సేయ మోక్షంబు దక్కు ననుచు. 307

వ. అనిన గౌరీకాంతునకు శశాంతుం డి ట్లనియె. 308

క. అగణితగుణ యాశూద్రుఁడు, పగవాఁ డగుచెట్టు లన్యభవమున మేమే
పగతుందుము నీదర్శన, మగు నేవెరవున నుమేశ యానతి యీవే. 309

వ. అని యడిగిన భూసురునకు నీశ్వరుం డి ట్లనియె. 310

క. నీవు మతంగమునీంద్రుఁడ, వై వెలసెద వీచతుర్థుఁ డమరేంద్రసుతుం
డై వాలి యనఁగ నెగడఁగ, నే వచ్చి రఘూత్తమాఖ్య నిర్జింతు వెసన్. 311

వ. అని శంకరుం డంతర్ధానంబు నొంది నంతటఁ గాలవశంబున సుశాంతుండును ధర్మ
కుశలుండును దివంబున కరిగి యిష్టోపభోగంబు లనుభవించి ధరణీతలంబునకు వచ్చి
యుగ్రతపం బాచరించి. 312

గీ. భూసురుండు మతంగుఁ డై పొడమి తపము
సలిపె శూద్రుండు వాలి యై సంభవించి
విష్ణుకృత్యంబు గోరుచు వివిధవాన
రేశ్వరులు గొల్వఁ గిష్కింధ యేలుచుండె. 313

చ. హరుఁ డిక్ష్వాకుకులంబునందు రఘురామాఖ్య న్విజృంభించి ని
ర్జరవాంఛ ల్సమకొల్పఁ బూని మునివేషం బూని పంపాసరో
వరతీరంబున నిల్చి సూర్యసుతుఁ గావ న్వాలి నొక్కమ్మునన్
ధరణిం గూల్చి మతంగుఁ జూచి సుమనోధామంబుఁ జేర్చెన్ దయన్. 314

గీ. ధర్మకుశల సుశాంతులు ధర్ము లగుచు, శివపురంబున కేగి యశేషసుఖము
లంది వైకుంఠనగరికి కరిగి యచటఁ, గోటికులసంభవులతోడఁ గూడి మనిరి. 315

క. కావున హరిహరపూజలు, గావించిన భుక్తి ముక్తి గలుగును భేదం
బావంత యైన మదిలో, భావింపఁగవల దెందుఁ బౌరవనాథా! 316

వ. నారదోక్తం బైనయీయుపాఖ్యానంబు విన్నవారలకు హరిహరులయందు భేదబుద్ధి జనియింప దని భీష్ముండు ధర్మరాజున కెఱింగించినచందంబు వైశంపాయనుండు జనమేజయునకుం దెలిపినట్లు సూతుండు శౌనకాదులకుం దెలుపుటయును. 317

క. మనుకులభూషణ దానవ, జనభీషణ నిత్యసత్యసంభాషణ పా
దనతవిభీషణ వారిధి, వనశోషణ వృతదిగీశ వసుధాధీశా. 318

శా. శ్రీమల్లక్ష్మణజాంబవద్భరతసుగ్రీవాంజనేయాంగదా
రామశ్రాంతవసంతసంతతజగద్రక్షా మనఃపద్మప
ద్మామిత్రార్కజరాహుకేతుగురుశుక్రాదిత్యచంద్రాత్మభూ
భౌమప్రస్తుతధామ ధామనిధి ప్రభ్రాజిత్ప్రతాపోదయా. 319

మాలిని. కరధృతశరచాపా గాఢకీర్తిప్రతాపా
తరణికులవరేణ్యా ధర్మయామాత్యగణ్యా
హరిసుతకృతసేవా యప్రమేయప్రభావా
పురహరనుతనామా భూరికారుణ్యధామా. 320

గద్యము. ఇది శ్రీమన్మదనగోపాల లీలావలోకన పవిత్ర శరణయామాత్యపుత్ర సకలవిద్యానిధాన తామరపల్లి తిమ్మయప్రధాన ప్రణీతం బైన హరివంశోదితం బైన యాశ్చర్యపర్వంబునందలి శేషధర్మంబున జయంతివ్రతంబును సత్సంగప్రభావంబును శంఖతీర్థశ్రీనివాసక్షేత్రమహిమంబులును అగస్త్యశ్రీరామచంద్రసంవాదంబును అనలపుష్కరిణీగాయత్రీమహిమలును సూర్యపుష్కరిణీమాహాత్మ్యంబును హైమవతీకావేరీసంగమ ప్రభావఫలంబులును విశ్వేశ్వరక్షేత్రగజారణ్య భీమేశ్వరస్థానవిశేషంబులును ఇంద్రపుష్కరిణీ రంగధామకుంభఘోణ విరూపాక్షంబులయందున్నతియును హరిహరాభేదకంబు ననుకథలం గలచతుర్థాశ్వాసము.



# పంచమాశ్వాసము.



వైభవ సుత్రామా
రావణఘటకర్ణముఖ్యరాక్షసభీమా
భావజరిపునుతనామా
గ్రావసుతాచరణసామ రాఘవరామా. 1

వ. విన నవధరింపు మఖిలపురాణవ్యాఖ్యానముద్రాసమేతుం డైనసూతుండు శౌనకాది మునులకు మున్ను యుధిష్ఠిరునకు గంగానందనుం డానతిచ్చినప్రకారంబు జనమేజయునకు వైశంపాయనుం డెఱింగించెనని బోధించి మఱియు నిట్లనియె. 2

క. హరిహరులకు భేదం బొక, పరమాణువు లే దటంచుఁ బలికినఁ దిరుగన్
సరిదాత్మభవుని పాదాం, బురుహంబుల కెఱఁగి ధర్మపుత్త్రుఁడు పలికెన్. 3

క. ఏధర్మంబున మనుజులు, సాధులసభఁ బుణ్యకథలు సతతము విని యిం
ద్రాధిక్యమహిమఁ గాంచిరి, బోధింపఁ గదయ్య తాత పుణ్యసమేతా. 4

వ. అనిన భీష్ముం డి ట్లనియె. 5

మత్తకోకిల. ధర్మతత్పరు లాగమజ్ఞులు దానశీలు రకల్మషుల్
కర్మకారులు శాస్త్రవేత్తలు కంజనాభుపదార్చకుల్
నిర్మలాత్ములు సత్యవంతులు నిత్యకీర్తిపరాయణుల్
నర్మదాదినదీగతు ల్నరనాథ విందురు సత్కథల్. 6

వ. అనిన భీష్మునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 7

గీ. హరికి మిక్కిలి ప్రియ మయి యర్థసిద్ధి, వాక్పటుత్వముఁ గలిగించువ్రతముఁ దద్వి
ధాన మంతయు నెఱిఁగింపు దయ దలిర్ప, గరిమ నొనరింతు నేను గంగాతనూజ. 8

వ. అనిన భీష్ముం డి ట్లనియె. 9

చ. హరి వసుదేవసూనుఁడు సురారిబలంబులఁ ద్రుంచి ద్వారకా
పురి నివసించి వాణివరపూజితసద్వ్రత మెల్లవారికిం
బరమశుభంబు లిచ్చు నని పల్కెను నే నది నీకుఁ జెప్పెదన్
స్థిరమతిఁ జేయఁ గోర్కు లఱచేత చెలంగెడుఁ బాండునందనా. 10

సీ. ఆరయంగ ధరణి మహానవమి యనంగ సొబగొందు నాశ్వీజశుద్ధనవమి
యందుఁ బ్రొద్దున లేచి యత్యంతభక్తితో భారతీదేవిని బ్రస్తుతించి
[1]ధ్యానంబుచేసి పుస్తకనికరంబుఁ బూజించి నైవేద్య మర్పించి వేల్చి
ధనధాన్యవస్తువాహనభూషణాంబరతాంబూలముఖ్యదానంబు లొసఁగి
గీ. భోజనంబులు పెట్టి విప్రులను దనుప, నీప్సితార్థంబు లెల్ల నీడేఱుచుండుఁ
గాన నవమీమహత్త్వపు గరిమ లెన్నఁ, బద్మజునకైన శక్యమె పాండుతనయ. 11
క. వ్రతఫలము సోమదత్త, క్షితివరునకె దక్కె నొరులఁ జేరునె ధరలో
నతనికి జో డాలక్ష్మీ, పతి యొక్కఁడె యెఱుఁగుఁగాని పరులకు వశమే. 12

## మహానవమీవ్రతము.

వ. అను నీవాక్యంబులు విని సోమదత్తుం డనంగా నెవ్వం డాతని కీవ్రతం బేచందం
బున లభించె నెఱింగింపవే యని కుంతీసుతుం డడిగిన దేవవ్రతుం డి ట్లనియె. 13
గీ. సోమవంశవరేణ్యుండు సోమదత్తుఁ, డనుమహీపాలుఁ డరివర్గ మణఁగఁ బట్టి
వసుధ తనయాజ్ఞ గడగడ వడఁకుచుండ, నెలమి మాహిష్మతీపురి నేలుచుండె. 14
వ. అంత నోటువడ్డ భూపతు లెల్లం గూడుకొని యొక్కవిచారంబున మాహిష్మతీపురం
బు ననేకాక్షౌహిణులబలంబులతో ముట్టడి వేసిన. 15
గీ. కరులుఁ గరులును హరులును హరులు భటులు, భటులురథములురథములు జటులగతిని
బెనఁగె నన్యోన్యజయకాంక్ష యినుమడింప, దేవదానవయుద్ధంబు తెఱఁగున నృప.
క. అమ్ముల నేసియు నీఁటెలఁ, జిమ్మియు ఖడ్గములచేతఁ జీరియు సురులం
గ్రుమ్మియుఁ బరరాజుల నొ,క్కమ్మడి నాసోమదత్తుఁ డుర్విం గూల్చెన్. 17
సీ. అంతట శాత్రవు లందఱు దొమ్మిగా నరికట్టి బలమెల్ల హతము సేయఁ
దల్లడంబున సోమదత్తుండు గర్భిణి దేవిక యనుపేరఁ దేజరిల్లు
మగువయుఁ గర్గాశ్రమంబున నిసి సమయంబునఁ జేరిరి యందు నైదు
నెలలుండి శోకంబు నిలు వెల్లఁ గప్పంగ గ్రుడ్డియు మూఁగయుఁ గుంటి యగుచుఁ
గీ. బురము రాజ్యంబు భోగము ల్పుత్రవితతి, సఖులుఁ జతురంగబలములు సంపదలును
దలఁచి తలఁచి కృశింప నాతరుణి విభుని, యడుగు లొత్తుచు నొక్కపద్యంబుఁ జదివె.

---

1 ధ్యానంబుచేసి పుస్తకనికరంబులు పూజించి నైవేద్యములు సమర్ప
ణం బొనరించి గోష్ఠంబున నేని గృహముమధ్యమున నేని యగ్ని నిలిపి
తనదుసూత్రవిధానంబుఁ దప్పకుండఁ, దిలలు ఘృతపాయసంబులు దెచ్చి వేల్చి,
భోజనంబులు పెట్టి విప్రులను దనుప, నీప్సితార్థంబు లెల్ల నీడేఱుచుండు.

క. శౌర్యంబు వలయు రణమున, ధైర్యం బాపదలవలనఁ దరుణులయొద్దన్
క. స్థైర్యంబు వలయుఁ విప్రా, చార్యులయెడ భక్తి వలయు జనులకు నెల్లన్. 19

అని చదివి దేవి వీఁపునఁ, బెనిమిటి నెక్కించుకొనుచు భీతాకృతి గ
ర్గునిపాదంబులయొద్దకుఁ, జని వందన మాచరించి సన్నుతి సేసెన్. 20

వ. ఇట్లు స్తోత్రంబు చేసి దేవిక యి ట్లనియె. 21

గీ. పాతము గావించి యరిరాజు లరుగుదేరఁ
బురము దేశంబు బలముఁ గోల్పోయి నీకు
శరణ మొందితి మింక నీసత్కటాక్ష
వీక్షణంబుల రక్షింపవే మునీంద్రా. 22

క. ఈరీతి శరణు చొచ్చిన, వారిజముఖి కనియె మౌని వలపనికష్టం
బారూఢ మయ్యె మీకా, భారతిఁ బూజింపకునికి భద్రము లెడలెన్. 23

క. శారద శుభసంధానవి, శారదఁ గొలువంగ సకలసంపద లొసఁగున్
మీరాలెఱు వెఱుఁగక యా, తీరున వర్తింప నిడుమ లేటునె తరుణీ. 24

క. మతి లేనివారు సంపద, సత మని కల్పించి దుష్టసంగతి ధర్మ
వ్రతములు నడపక సతతము, వెతఁ బనుదురు జన్మఫలము వృథగా ధాత్రిన్. 25

గీ. వ్రతము లుపవాసములుఁ జేయవలయు మేలు
వొందఁ దలఁచిన భారతిఁ బూజచేసి
నలుఁడు దమయంతి రాజ్యంబు నలఘుమహిమ
దిరుగఁ గాంచె విరూపాక్షుకరుణఁ గాంచి. 26

వ. అనిన విని దేవిక వల్లభసహిత యై వందనం బాచరించి పంపాతీరవిహారి యైన విరూపాక్షుని మాహాత్మ్యంబును దీర్ఘవైభవంబును దుంగభద్రా ప్రభావంబును నెఱింగింపవే యని ప్రార్థించిన గర్గుం డి ట్లనియె. 27

గీ. జనము లెంతటిపాపంబు సలిపిరేని, శ్రీవిరూపాక్షుని దర్శింపఁ జేరవచ్చు
రుద్రలోకంబు వందనారూఢుఁ డెవ్వఁ, డతనివంశంబువా రెల్ల నచట నుంద్రు.

గీ. బ్రహ్మశిలమీఁద శ్రీవిరూపాక్షునకును, వందనము సేయుమనుజు లవార్యలీల
నెల్లలోకంబు లెప్పుడు నేలుచుంద్రు, సంశయము లేదు కౌరవక్ష్మాతలేంద్ర. 29

క. వేసరక పుణ్యవిసరము, చేసినమానవుల కెల్ల సిద్ధించు ననా
యాసమున విరూపాక్షుని, దాసత్వము తప్ప దండ్రు ధరణీనాథా. 30

గీ. తుంగభద్రయుఁ గావేరి గంగ యమున, సరయువును గృష్ణ గౌతమి శారదయును

ధ్యాన దర్శన కీర్తన స్నానములను, సకలపుణ్యంబు లొనఁగూర్పఁజాలునదియు. 31

చ. నలుఁ డను రాజు మున్ను కలి నష్టము చేసినరాజ్యసంపదన్
తొలఁగి పదాతి యై యటవి దోయిడిచేతుల వచ్చి పంపలోఁ
జలక మొనర్చి యిందుధరు శంకరు నద్రిసుతామనోవిభుం
గొలిచి నుతింప నవ్విభుఁ డకుంఠదయన్ దివి నిల్చి యిట్లనెన్. 32

క. మెచ్చితి నీతపమున కే, నిచ్చెద వర మెద్ది యైన నిప్పుడు మదికి
న్వచ్చినయది వేఁడుము ధీర, పొచ్చెముగా దెఱుఁగు మిందుభూషణు నన్నున్. 33

వ. అనిన గౌరీవరునకు నలుం డిట్లనియె. 34

క. వరమీయఁగ వచ్చియు నం,బరమున నగపడకయుండి పలికెద వయ్యా!
దురితంబు లేమి దొరలెను, కరణీయము నాకుఁ దెలుపు గౌరీరమణా! 35

వ. అనిన శంకరుం డిట్లనియె. 36

గీ. దేవతలు పంపఁ గలి నీదు దేహ మెల్ల, నలముకొన్నాఁడు తద్దోష మణఁచు శార
దా వ్రతము నేయు మంతఁ బ్రత్యక్షమై స, హస్రవర్షంబు లిత్తు రాజ్యంబుతోడ.

క. నినుఁ దలఁచినఁ గలిదోషము, చను నని వాక్రుచ్చి శివుఁడు సకలామరులుం
దనుఁ గొలువ విరూపాక్షుం, డనుపేరిటఁ దుంగభద్రయందు వసించెన్. 38

గీ. నలుఁడు ఋతుపర్ణునగరికి నడచి యతని
తోడ కొన్నాళ్లు వసియించి తుంగభద్ర
కరిగి నవమీవ్రతము లెస్స యాచరించి
మహియుఁ బురమును దమయంతి మరలఁ గాంచె. 39

వ. కావున నీవ్రతం బాచరింపు మనిన మునివాక్యంబు లాలకించినంత నాధరణీసురుండు సర్వరోగవిముక్తుం డై దేవికతోడఁగూడి తుంగభద్రకుం జని స్నానం బాచరించి విరూపాక్షుఁ బూజించుచు నవమీవ్రతం బొనర్చి శత్రుసంహారంబు గావించి నిజ రాజ్యంబుం బొందె నీకు నత్తెఱం గాచరణీయంబు. ఇచ్చట రావణుం డపహరించిన సీతం గానక రామచంద్రుండు పంపాసరోవరంబునకుం జని మతంగమునీంద్రునకు వందనం బాచరించి యతనిచే సత్కృతుం డై నిజాగమనకారణం బెఱింగించె ననిన విని ధర్మనందనుండు గంగానందనున కిట్లనియె. 40

క. పంపాతీరంబున నే, పెంపున విహరించె రామపృథివీశుం డా
సొంపు వినిపింపు నాకను,కంపమెయిని ధర్మనిచయ గంగాతనయా. 41

వ. అనిన భీష్ముం డిట్లనియె. 42

క. శ్రీరామచంద్రుచరితము, వారిజగర్భాదులైన వర్ణింపఁగలే
రారూఢి గాఁగ సాక్షా, న్నారాయణదేవుఁ డతఁడె నరనాథమణీ. 43

గీ. భానుకులమౌళి శ్రీరామభద్రుఁ డంతఁ
దుంగభద్రామహానదీతోయములను
స్నాన మొనరించి మధ్యాహ్నసమయకృత్య
మంతయును దీర్చి యమ్మౌని కనియెఁ బ్రీతి. 44

చ. వినయమునం దపంబునను విద్యల ధర్మమునందు వర్తనం
బున మఱి యెందు నీకు సరిపోల్పఁగరాదు సమస్తపాపనా
శన యగు తుంగభద్ర సురసన్మునిసేవిత యీనదీతటం
బునికికి యోగ్యమయ్యె భవదున్నతి కొంచెమె మౌనిశేఖరా. 45

గీ. దోసకారుల కీనది దొరకవడదు, నిన్నుఁ బోలెడువారికి నిచ్చలబ్బు
వారు విరూపాక్షుఁ గోటిశంకరుని జూపు, దర్శనముచేసి నీకృప ధన్యుఁ డౌదు. 46

వ. అనిన రామచంద్రునకు మతంగమునీంద్రుం డిట్లనియె. 47

క. శ్రీవిభుఁ డగునారాయణ, దేవుఁడు నీవౌటఁ దెలియుం దేవర కెఱుఁగం
గావలయునట్టియర్థం, బేమంతం గలదు రామ యినకులసోమా. 48

గీ. తెలిసి వేఁడుట కారుణ్యదృష్టిఁగాదె, కోటిశంకర మనెడు నిచ్చోట నెన్న
మును దిశాపాలవసురుద్రముఖ్యసురలు, శంకరుని గొల్చి రున్నతస్థానకాంక్ష. 49

వ. అనేకకోటి సహస్రలింగంబులం బ్రతిష్ఠచేసి యేడు యుగంబులు పూజించిన నొక్కొక్కటికిఁ గోటిరూపంబులఁ బ్రత్యక్షం బైన కపాలపాణిం జూచి వెఱచి దేవత లిట్లనిరి. 50

గీ. వేళగానట్టివేళ నీవిశ్వరూప, మేల కనుఁగొనఁజాల మీమేలురూపు
చూపి కూర్చుండి పరమాయఁ జూడవయ్య, మౌళికీలితతారేశ నీలకంఠ. 51

వ. అని ప్రార్థించుదేవతలకు శంకరుం డిట్లనియె. 52

క. చిరకాలము బ్రహ్మశిల, న్నిరుపమవిభవంబు వెలయ నిలిచెద మీకున్
వరము లొసంగెదఁ గోరిన, సరణి న్సురసముదయంబు చనుఁడిం డటకున్. 53

క. అని దివ్యరూపధరుఁ డై, చని బ్రహ్మశిల వ్వసించె శంకరుఁ డాదే
వుని వెంట నరిగి సురలు, న్వినుతించి రనేకభంగి వేదాంతములన్. 54

క. కడలేని దివ్యభోగం, బడుగని కైవల్యపదవి యున్నతదయతో
నిడి ప్రోవవలయు మము నీ, యడుగులు దప్పంగ నెఱుఁగ మద్రిసుతేశా. 55

వ. అనిన శంకరుం డిట్లనియె. 56

తరల. కమలగర్భుని కంద శక్యము గానిలోకము లిత్తు నే
నమరఁ బెక్కొద రామచంద్రుఁడ నై ధరాస్థలి మాధవాం
శమునఁ బుట్టి దశాననాది నిశాచరావలిఁ ద్రుంతు నీ
యమరు లొక్కట ఋక్షవానరు లై జనింపుఁడు ముందరన్. 57

మత్తకోకిల. కందమూలఫలాదు లచ్చటఁ గల్గినట్లు భుజించి మా
కంద బిల్వ కపిత్థ కాంచన కందరాల మహావనీ
మందిరంబుల సంచరించుచు మాటిమాటికిఁ దుంగభ
ద్రేందుమౌళికి మ్రొక్కుఁ దార్చుచు నీరలుండుఁడు భక్తితోన్. 58

క. అని శంకరుండు పలికిన, విని మనమున హర్ష మొంది వేలుపులెల్లన్
మును వచ్చినమార్గంబునఁ, జనిరి నివాసములు చేర సంఘము లగుచున్. 59

ఉ. రావణకుంభకర్ణముఖ రాక్షసులన్ హరియింప శంకరుం
డీవగుచున్ జనింప సురలెల్లను వానరు లైరి యింక నీ
సేవ యొనర్పవచ్చి యరిసేనలఁ ద్రుంచెద రవ్విభీషణున్
వావిరి లంకలో నిలిపి వచ్చియ కెక్కుఁడు వీవు రాఘవా. 60

గీ. అనిన విని రామచంద్రుండు హర్ష మొంది
బ్రహ్మశిల సిద్ధసాధ్యదిక్పాలవినుత
ముందు రచ్చటఁ గల్గు మహాత్త్వ మెల్లఁ
దెలుపు మన్న మతంగుండు తిరుగఁ బలికె. 61

క. సనకాది యోగివర్యులు, వనజాసనముఖ్య దివిజవర్గము స్నానం
బొనరించి విరూపాక్షుని, మనురాజము హృదయపీఠి మరపుదు రచటన్. 62

గీ. మాఘమాసంబునను దివ్యమంత్రవిధులు, సురలు భూసురు లెల్లను సురుచిరముగ
స్నాన మొనరించి బ్రహ్మసంధానకృత్య, మచటఁ గావింప బ్రహ్మశిలాఖ్య మయ్యె.

గీ. స్నానదానంబు లచ్చటఁ జలుపు వారి, ధర్మవిభవంబు లెక్కింపఁ దరము గాదు
శ్రీవిరూపాక్షుపదమట సిద్ధసేవ్య, మై వసిష్ఠాశ్రమము మించు నవనిమీఁద. 64

సీ. మహి మించు నయ్యాశ్రమము తూర్పుదిక్కునఁ గోటిశంకర ముందుఁ గోటిలింగ
ములను దేవత లెల్ల నిలుపంగ నాపేరు ధర నుతికెక్కెఁ దత్స్నానమునను
సంక్రాంతిముఖపుణ్యసమయవాసరముల మాఘమాసంబున మజ్జనములు
సురసిద్ధసాధ్యకిన్నరయక్షగంధర్వపతులు గావింతురు పార్వతీశ

గీ. దర్శనము సేయఁ బాపము ల్దలఁగి పోవు, స్నానసై వేద్యముఖ్యోపచారములను
బూజగావింపఁ గులకోటి బొత్తుఁ గూడి, శివునిలోకంబు సతముగాఁ జేయవచ్చు. 65
క. అక్కడకుఁ బరువు నేలను, జక్కనితూరుపునఁ గపిల సంయమి తపముల్
దక్కించుకొన్నచోటా, చక్కిం గపిలేశుపూజ సలుపుచునుందున్. 66
క. ఆపుణ్యమహిమఁ గలిగె, న్నీపదరజ మాశ్రయింప నేఁ డన్నింటం
గాపాదుక రమ్మా ననుఁ, జేప ట్టేమఱక ప్రేమ శ్రీరఘురామా. 67
క. అని యానందజలంబులు, గనుదమ్ములు ముంప మౌని కదలక యుండెన్
జనకసుతాపతి కాని, మ్మనఘా రావణు జయింతు నట్ల ననియెన్. 68
వ. తుంగభద్రోదకస్నానంబునను విరూపాక్ష దర్శనమ్మునను బాపంబులు తూలె మనంబు
ప్రసన్నం బయ్యె నింకఁ గిష్కింధకు నరిగెద మీకు శుభం బగు నని రామచంద్రుండు
చనియె నీవు నాచందంబునఁ బంపాసరోవరంబున కేగి విరూపాక్షుంబునఁ గోటి
శంకరు నీక్షింపుము మనోరథంబు లీడేఱు నీయుపాఖ్యానంబు విన్నవారలకు గంగా
స్నానఫలంబు సిద్ధించు ననిన విని యుధిష్ఠిరుం డిట్లనియె. 69
గీ. ధర్మనిధి యైన శ్రీరామధరణివిభుఁడు, తంత్రియానతి శిరమునఁ దాల్చి యెచటి
కరిగె నాపుణ్యదేశంబు లెఱుఁగఁ బలుకు, మమరతటినీతనూజ విఖ్యాతతేజ. 70
వ. అని యడిగిన కుంతీసుతునకు దేవవ్రతుం డిట్లనియె. 71
క. వైదేహి వెదక రాఘవుఁ, డేదెసకుం జనియె నీకు నెఱిఁగించెద నే
నా దేశము పుణ్యస్థల, మాదరమున వినుము పాండవాగ్రజ తెలియన్. 72

## అహోబలశ్రీశైలవేంకటాచలాదులమహిమ.

వ. రామచంద్రుం డహోబల శ్రీశైలవేంకటాచల కాంచీనగరంబుల కరిగి యక్క
డక్కడ బ్రాహ్మణజనంబులకు గోభూతిలకన్యాదానంబులు ముదంబునం జేయుచు
నహోబలంబునందు నృసింహునకు నమస్కారం బొనరించి యిట్లని వినుతించె.
మత్తకోకిల. శౌరి మాధవ కృష్ణ కేశవ చక్రహస్త ముకుంద నా
గారివాహన కాంచనాంబర యాదిదేవ యుపేంద్ర భూ
భారవారణ దైత్యభంజన భక్తవత్సల కావవే
నారదస్తుత పద్మలోచన నారసింహ రమాపతీ. 74
క. సురగరుడోరగ విద్యా, ధరకిన్నర సిద్ధసాధ్య దనుజాలు మునుల్
నిరతంబుఁ గొల్తు రెవ్వని, చరణాబ్జము లానృసింహు శరణు భజింతున్. 75
క, కలిగింపను వెలయింపను, బొలియింపను కర్త వీవ పుడమికి వలసె

మెలఁగుదువు మూఁడుమూర్తులఁ, జెలఁగుచు నినుఁ బొగడ వశమె శ్రీనరసింహా.

గీ. ఇట్లు నుతియించు తఱి సుర లెల్లఁ గూడి, స్వామిమీఁదఁ బువ్వులవాన గురిసి
రామచంద్రునిడెందంబు రంజిలంగ, సరస భూషణ మొసరించి చనిరి దివికి. 77

వ. అంత రాఘవుండు గాలవమహామునిం జూచి యి ట్లనియె. 78

క. గాలవమూర్తివి హరికిన్, మేలగునికిఁ గూర్చునట్టి మేటివి శ్రుతులుం
జాలవు నీచందంబున, గాలవ యీక్షేత్రమహిమ గణుతింపంగన్. 79

గీ. క్షేత్రవిభవంబు శ్రీనరసింహమహిమ, తీర్థమునఁ గల్గుపుణ్యంబుఁ దెలుపుమయ్య
కరుణ నామీఁద నీకింత గలిగెనేని, ఘనతపోగణ్య గాలవమునివరేణ్య. 80

వ. అని యిత్తెఱంగున వేఁడిన రామచంద్రునకు మీరాచరించిన యద్భుతంబు లెఱుంగ
మావశంబె యైన మీయాజ్ఞాక్రమంబునఁ దెలియ విన్నవించెద నని గాలవుం డి
ట్లనియె. 81

గీ. విష్ణుదేవుండు నరసింహవేషమునను, గనకకశిపుని హరియించి ఖచరవితతు
లనుసరింపఁగ నిచటఁ బ్రత్యక్షమయ్యె, నితనిపదసేవ ముక్తికి నేగవచ్చు. 82

ఉ. నాకెఱుఁగంగ శక్యమె వినాయక పన్నగనాయకాదులే
కాకృతి వెన్నలే రనిన నచ్చట ముప్పదిమూఁడు కోట్లు నా
కౌకులు నారసింహపదయుగ్మముఁ గొల్వఁగఁ గాచి యుండు రా
నాకసరోవరంబు భవనాశి యన న్వెలసిల్లు రాఘవా. 83

ఉ. వామనుఁ డై బలి న్నవనవాటికి వేఁడి జగత్త్రయంబు సు
త్రామునకై యొసంగె జమదగ్నితనూభవుఁ డాదిరాజుల
న్వేమఱుఁ ద్రుంచె శంకరుని విల్విఱిచె న్రఘువరాఖ్యుఁ గృష్ణుఁడై
సేమము పాండుసూనులకుఁ జేరుచు నీహరి యింక రాఘవా. 84

ఉ. అక్కడనున్న యాపశుమృగాదులు తావకపాదపద్మము
ల్దిక్కని ముక్తికామినికి దీవన లిచ్చుసుపర్వ లెంతయుం
న్నిక్కమ యిగ్గిరీంద్రమున నిల్వఁగవచ్చును బుణ్యశాలికిం
గక్కసమౌ మహాదురితకర్ములకు న్వసియింప నిచ్చటన్. 85

గీ. అనిన విని యంత రఘురాముఁ డధికభక్తి, మొలక లెత్తంగ గాలవమునికి నార
సింహునకు మ్రొక్కి చనియెను శ్రీగిరీంద్ర, మునకు శంకరు మల్లికార్జును భజింప.

వ. అహోబలాచలంబునకు నీవు నరుగుము నారసింహప్రసాదంబున మనోరథంబు
లీడేఱు నచటికిం జనఁ బతితుం డైన ముక్తుం డగు ద్విగాత్రంబు వసియించినవారి

పుణ్యవైభవంబులు లెక్కింప శక్యంబు గాదు. ఈయుపాఖ్యానంబు విన్నవారికి
బ్రహ్మలోకంబు సిద్ధించు ననిన భీష్మునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 87

క. శ్రీగిరికి నరిగి రాఘవుఁ, డేగతి వర్తించె నదియు నీశ్వరుఁ డచటన్
సాగించుకొన్నమహిమలు, బాగుగ నెఱిఁగించు తాత ప్రజ్ఞోపేతా. 88

వ. అని యడిగిన యుధిష్ఠిరునకు భీష్ముం డిట్లనియె. 89

గీ. ఎల్లకాలంబు శంకరుం డిందుమౌళి, శ్రీగిరిని నిల్చి నచ్చటఁ జేరువారి
కబ్బ చెందఁ బునర్జన్మ మనుచు నాకు, నారదమునీంద్రుఁ డెఱిఁగించె భూరికరుణ.

వ. శ్రీకైలాసంబు హేమశైలంబు విశ్వేశ్వరంబు విరూపాక్షంబు మహాకాళంబు మార్కం
డేయంబు శ్రీశైలంబును గౌరీపతినిజనివాసంబు లిందు నార్తవత్సలునకు నమస్క
రించి పాపయుక్తుం డైన ముక్తుం డై దివంబునుం జెందు. 91

గీ. పాపకర్ములకును బునర్భవభయంబు, దలఁగు శ్రీశైలశిఖరాగ్రదర్శనమున
నొక్కరాత్రి యచ్చట నుండువారు, బాంధవులతోడఁ గైవల్యపదవిఁ గంద్రు. 92

మత్తకోకిల. సత్యజిత్తుఁడు భార్గవుండును జామదగ్న్యుఁడు శంఖుఁడు
న్సత్యకీర్తియు నాదియౌమునిజాలముల్ చనుదేర నా
దిత్యవంశసముద్భవుం డగు దేవదేవుఁడు రాఘవుం
డత్యుదాత్తముదంబునం గని యాచరించి నమస్కృతుల్. 93

గీ. అర్ఘ్యకృత్యంబు లన్నియు నాచరించి, పలికె మునులార మీపాదపద్మసేవ
శుభము చేకూరె శ్రీగిరిఁ జూడఁగంటి, నెఱుఁగఁ బలుకుఁడు కరణీయ మిందు ననుచు.

వ. అనిన రఘురామునకు సకలమునిజనానుమతంబునం బరశురాముం డిట్లనియె 95

క. ధారుణి రక్షింపను నవ, తారముఁ బొందితివి తునుము దనుజులఁ గరుణా
సారమునఁ గావు మునులం, జేరి న్నిరాక శుభము శ్రీరఘురామా. 96

గీ. అన్నపానీయములు వివిధార్థముఖ్య, దానముల నిందు విప్రులఁ దనుపఁ బితరు
లెల్లఁ బరితృప్తులై మనోభీష్ట మొసఁగ, స్వర్గసౌఖ్యంబు గాంతురు సంతతంబు. 97

క. ఎప్పుడు శ్రీగిరి కరుగుదు, మెప్పుడు శంకరుని జూతు మెప్పుడు శుభము
ల్చొప్పడు నిఁక దమ కంచును, దప్పక నుతియించు దివిజతతి యెల్లపుడున్. 98

వ. పూర్వజన్మంబున స్నానదానజపానుష్ఠానంబు లాచరించిన నీశైలవల్లభుసందర్శనంబు
దొరకుఁ దూర్పువాకిట నింద్రుండును దక్షిణపుదిక్కున శమనుండును బడమట వరు
ణుండును నుత్తరంబునఁ గుబేరుండును దద్దేవు దివ్యదేహవిలాసంబులు విలోకించు
చుందురు సురగరుడోరగసిద్ధసాధ్యసేవితం బైన యీస్థలం బన్యుల కగమ్యంబు

భూలోకంబు రక్షింపఁ ద్రిదివం బీశైలం బయ్యె నని పరశురాముం డానతిచ్చిన రామచంద్రుం డా దక్షిణద్వారంబునం జనియె నచటి కెవ్వం డరిగె నతనివంశంబువా రెల్ల ముక్తు లగుదురు నారదోక్తం బైన యీయుపాఖ్యానంబు విన్నవారికి శివ సాయుజ్యంబు సిద్ధించు ననిన భీష్మునకు యుధిష్ఠిరుం డి ట్లనియె. 99

## వృషభగిరిమహాత్త్వము.

గీ. శ్రీనివాసునిమహిమ నాచెవుల నునుపు, పద్మలోచనుఁ డిందిరాప్రాణవిభుఁడు
వృషభగిరిమీఁద నేరీతి వెలయు నచటఁ, గలుగు విభవంబు లెవ్వి గంగాతనూజ.
వ. అని యడిగిన యుధిష్ఠిరునకు భీష్ముం డి ట్లనియె. 101
గీ. నారదుఁడు మున్ను కలశాబ్ధితీరమునకు, నరిగి మాధవు నీక్షించి యరుగుదేరఁ
గుంభసంభవముఖమానికులముతోడ, వ్యాసుఁ డీక్షించి పలికె నత్యాదరమున. 102
క. సారసభవునకు సుతుఁడవు, నీరజనాభాంఘ్రిభక్తనివహంబునకుం
జేరువకాఁడవు నీకుఁ, ధారుణి నెదు రెవ్వ రన్న నారదమౌనీ. 103
ఉ. శ్రీలలనామనోహరుని శేషఫణామణిమండలప్రభా
జాలవిభాసమాను హరి సర్వశరణ్యుని జూచువేడుకం
దాలిచి వచ్చి రీమునులు దక్కు శుభంబులఁ గార్యసిద్ధికిన్
మూలము మీపదాబ్జములు ముందరఁ జూచుట లెల్ల నారదా. 104
వ. ఇత్తెఱంగున నిజాగమనప్రయోజనం బెఱింగించు వ్యాసముని వాక్యంబు లాల కించుచు మీకు భద్రంబగు వైకుంఠలోకంబునుండి యొక్క వార్త యుద్భవం బయ్యె విన్న తెఱంగు వివరింతు వినుం డని నారదుం డిట్లనియె. 105
గీ. అధికమాయావిహారి నారాయణుండు, పుణ్యనిలయుండు వైకుంఠపురము విడిచి
స్వామిపుష్కరిణీతీర్థసౌధవీథి, నువిదతోఁ గూడి విహరించుచున్నవాఁడు. 106
క. అనువార్తలు సురలందఱు, విని చని రాస్వామి జూడ వేంకటగిరి కే
నును బోయెద నని నారద, ముని యాకాశమున కెగసి ముదమునఁ జనియెన్. 107
గీ. కుంభసంభవమునిముఖ్యకులము వ్యాసు, సరణి దివిజులతో ధర్మగిరికి నరిగి
స్వామిపుష్కరిణిని జేరి స్నానదాన, విధులు దీర్చి చరించెను వివిధగతుల. 108
ఉ. కొందఱు సన్నుతించుచును గొందఱు వందన మాచరించుచుం
గొందఱలంకరించుచును గొందఱు ధ్యానముజేయఁ గోరుచుం
గొందఱు కౌఁగిలించుచును గొందఱు నవ్వుచు మానిదేవతా
బృందము లందఱు న్ముదముఁ బెంపునఁ దాల్చిరి విష్ణుసన్నిధిన్. 109

గీ. అమరగంధర్వకోటిపై నద్రిమీఁదఁ, గురిసె సురుచిరమందారకుసుమవృష్టి
పటహకాహళశంఖశబ్దములతోడ, నభము నిండఁగ దేవదుందుభులు మొరసె. 110

మత్తకోకిల. వ్యోమయానసహస్రము ల్తనయోరలం జనుదేరఁగా
సోమకోటి సుశీతలద్యుతిశోభితుం డయి యిందిరా
కాముకుండు ప్రసన్నుఁ డయ్యెను స్నానభంబులు దానయై
స్వామిపుష్కరిణీతటంబున సర్వమోహనమూర్తితోన్. 111

చ. హరుఁడు బితామహుండు మఘవానలదండధరాసురాదులున్
వరుణమరుత్కుబేరులు దివాకరుఁడు న్శశి సిద్ధసాధ్యకి
న్నరులును బుణ్యశైలవిపినంబులు వారినిదాన మీచరా
చరములు దానయై హరి ప్రసన్నతఁ జెందె జగద్ధితార్థియై. 112

సీ. శతపత్రమల్లికాచంపకకరవీర కుందమందారాదికుసుమములును
బంచామృతస్నానబహువిధనైవేద్య కర్పూరతాంబూలకల్పనములు
మాధవగోవింద మధుసూదనాచ్యుత కృష్ణాదిబహునామకీర్తనములు
దండకాష్టకగద్యతారావళీముఖ మహితప్రబంధసమర్పణములు
గీ. వారివారికిఁ దగినట్లు వసుధ యెల్ల, భక్తియుక్తులఁ బూజింప భద్రలీల
స్వామిపుష్కరిణీనామసరసియందు, సువిదతోఁగూడ మాధవుఁ డున్నవాఁడు. 113

వ. జగద్గురుం డగు శ్రీనివాసునిసందర్శనంబు నెవ్వం డాచరించు నతనివంశంబువా రెల్ల ముక్తు లగుదురు. భూలోకంబునం గలుగుపుణ్యక్షేత్రంబు లెల్ల నద్దేవుని సేవించు. నీవు నరిగి యావేంకటేశ్వరుపాదారవిందంబులకు వందనం బాచరింపుము భుక్తిముక్తులు సిద్ధించు ననిన భీష్మునకు యుధిష్ఠిరుం డిట్లనియె. 114

గీ. దివ్యపురి కాంచి యెచ్చటఁ దేజరిల్లు, హరి జగన్మయుఁ డెట్లు శ్రీహస్తిశిఖరి
వెలసెఁ బ్రత్యక్షమై దీనిఁ దెలుపు మమ్ము, మనుప భావంబు నీకుఁ గల్గినను భీష్మ.

వ. అని యడిగిన యుధిష్ఠిరునకు మున్ను సనత్కుమారునకు నారదమునీంద్రుం డెఱింగించిన యుపాఖ్యానం బాయురారోగ్యవర్ధనం బది విను మని భీష్ముం డిట్లనియె. 116

క. వారిజగర్భుఁడు మున్నీ, ధారుణి నిర్మించి చింత దలఁకఁగ నుండం
దారాపథమున నొకపలు, కారూఢం బయ్యె మదికి నద్భుత మొదవన్. 117

గీ. అశ్వమేధసహస్రంబు లాచరింపు, మనము పరిశుద్ధ మగు నీకు వనజగర్భ
యన్న విని శారదానిభుం డందులోన, నొక్కటేనియుఁ జేయంగ నోప ననుచు.

## కాంచీపురిమహిమ.

సీ. అధికచింతాకులుం డైన నవ్వాణియు మంజువాగ్వైఖరి మగుడఁ బలికె
గంగకు శమనదిగ్భాగంబున శతద్వితయయోజనమ్ములఁ దనరు వేగ
వతి దానిదరిఁ గాంచి వఱలు నాపురిలోన ధరశైల్ల హరి తాన వరము లిచ్చు
చున్నవాఁ డచ్చోట నొనరింపు మొకయాగ మది సహస్రఫలంబు లలవరించు
గీ. స్థానబలమున నీకు నోజలజగర్భ, యనుచుఁ బలికిన నావేలు పరిగి యచట
నఖిల దిక్పాలవరులతో నాచరింప, నబ్ధికన్యావిభుండు ప్రత్యక్ష మయ్యె. 119

వ. ఇట్లు లన్నారాయణుండు హారకిరీటకేయూరమకరకుండలకౌస్తుభప్రభావిభ్రాజమానుండును సురగరుడోరగసిద్ధసాధ్య యక్షకిన్నరకింపురుషసేవ్యమానుండును శంఖచక్రగదాధరుండును నై ప్రత్యక్షంబైన నమస్కారపూర్వకంబుగా వేదాంతముల నుతియించు కాంచనగర్భునకుం బ్రీతుం డై నీ వొనరించుహయమేధంబున భద్రం బగుఁ గృతయుగంబునం ద్రికాలంబు నన్నుఁ బూజింపుము త్రేతాయుగంబున ముక్తికాముం డైనగజేంద్రునిచేతను ద్వాపరంబున మునిశాపభీతుం డైన దేవలుని చేతను గలియుగంబున శేషునిచేతను భక్తు లగుభూసురాది సకలజనంబులచేతను బూజితుండ నై వర్తింతు నని వరంబు లిచ్చి యంతర్ధానంబు నొందె గీర్వాణసముదయంబు నాశ్చర్యంబు నొందె నావాగీశుం డశ్వమేధంబు విధ్యుక్తప్రకారంబుగా సాంగంబు గావించె నయ్యవసరంబున నింద్రాది దిక్పాలకులు వసువులు మనువులు వసిష్ఠాత్రికణ్వగాలవవిశ్వామిత్రవ్యాసప్రముఖ మునివర్గంబులుఁ దక్కినవారు ననేక యాగంబు లాచరించిరి. కాంచీపురంబు ప్రవేశించినవారికిఁ బునర్భవంబు లేదు గావునఁ గైవల్యం బాసించినవారికి సేవ్యం బై చెలంగు. 120

క. పుట్టిన మరణభయంబును, గిట్టిన జన్మంబు లేదు కేవలశుభము
ల్పట్టించుఁ గంచి వరదుఁడు, గట్టిగ సేవించునట్టి ఘనులకు నెల్లన్. 121
గీ. వెలయుఁ గాంచిని శారద వేగవతియుఁ, దజ్జలమున మజ్జనంబు నిత్యంబుఁ జేయం
వారివంశంబువారికి వఱలు శుభము, లలఘుతరపాపసముదయములు నశించు. 122
క. కామాక్షి యనఁగ శారద, భూమి న్మాఁగకును శాస్త్రములు రప్పించుం
గామారియుం గిరిజాయుతుఁ, డై మామిడిమొదల నిలుచు నమరులు గొల్వన్. 123
గీ. కంచి నేకామ్రనాథు సేవించువారి, కఖిలపాపంబు లణఁగు విద్యార్థబంధు
వర్గములు గల్గు వాణీశవసతి దొరకు, ననుచు నారదమునిచంద్రుఁ డానతిచ్చె 124
క. కాంచీనాథునికథ వినఁ, గాంచినవా రఖిలబంధుగణములతోడన్

సంచారం బొనరింతురు, కాంచనగర్భాది దివ్యఘనలోకములన్. 125

వ. అనిన భీష్మునకు యుధిష్ఠిరుం డి ట్లనియె. 126

## శ్రీసింహాశైలవిశేషములు.

గీ. సింహగిరి నుండు శ్రీనరసింహుఁ డందు, కాంబళంబున నచ్చట నమరులెల్ల
నెట్లు విశ్రమ మొనరించి రెఱుఁగఁ బలుకు, ఘనుఁడ వన్నింట నీవు గంగాతనూజ.

వ. అని యడిగిన గుంతీనందనునకు గంగానందనుం డి ట్లనియె. 128

ఉ. శ్రీనరసింహకీర్తనము చేసిన నెవ్వరికైనఁ బాపముల్
దానణఁగుక్ జయం బొసఁగు దైవతరాజు శివుండు బ్రహ్మ వై
శ్వానరుఁ డింద్రుఁడు న్రవియు సర్వముఁ దానయి లోకజాలముం
బూనికఁ గాచు నవ్విభుఁడు పూర్ణ దయారస ముప్పతిల్లఁగన్. 129

గీ. నారసింహుఁడు మును దైత్యునామ మణఁచి, దివ్యయోగవిలాసంబు తేజరిల్ల
కాంబళంబున వసియింప నమరగణము, లెల్ల నీరీతి నుతియించి రింపుమీఱ. 130

క. గోవింద గరుడవాహన, కేవలకారుణ్యరూప కృష్ణ మురారీ
భావించి నీపదాంబుజ, సేవకులము మమ్ముఁ గావు శ్రీనరసింహా. 131

గీ. అనుచు వేదాంతవేద్యుని నభినుతించు
దివిజవర్గముఁ గరుణార్ద్రదృష్టిఁ జూచి
పలికె నరసింహుఁ డిందిరాప్రాణవిభుఁడు
కోర్కె యెఱిఁగింపు డిపుడ చేకూర్తు ననుచు. 132

వ. అవ్వచనంబు లాలకించి దేవత లి ట్లనిరి. 133

క. ఈయోగమూర్తి యంతయు, మాయింపుమ దివ్యభోగమహిమాస్పదమౌ
కాయముఁ గైకొని మమ్ముం, బాయనిదయఁ గావు మయ్య పరమేశ హరీ! 134

వ. అనిన విని ముందఱ నొక్కపర్వతంబు సింహాద్రి యనం జెలంగు నచట మునివిప్ర
గణంబులతోడ మిమ్ముఁ గూడి యత్యైశ్వర్యసంపన్నుండ నై సకలభోగంబు లను
భవించుచు నఖిలలోకంబులఁ బరిపాలించెద. మీరు నరుగుదెం డని పలికి దివ్యవిమాన
శతంబుతో శ్రీనరసింహుం డాశైలంబున నిలిచె. వేల్పుగమియును వెంటం జని
యాధారుణీధరంబున స్వామిం గానక విచారించుచుండ. 135

సీ. మెఱపుఁదీఁగెల తోడ మేలంబు లాడుచుఁ దనలోచనద్యుతు ల్దడఁబడంగ
దీప్తహాటకకాంతి దెలుపు కేశాంతజిహ్వాగ్రరోచులు దిశ లావరింప
రక్త లాంగూలవిభ్రాజితద్యుతిపుంజ మలఘుసంధ్యారాగ మనుకరింప

దంష్ట్రాగ్రసంభూతధాళధళ్యప్రభ ల్నెఱిమించు నిందువెన్నెలలు గాయఁ
గీ. జిత్రనఖదేహకాంతు లశేషధరణి, కువలయాక్షికి వెలిపట్టుకోకగాఁగ
దివ్యసింహాసనంబున దీప్యమాన, శతసహస్రార్కదీప్తులు సందడింప. 136
క. హరిమాయయొ హరుమాయయొ, హరి యయ్యో నటంచు నక్కడక్కడ గములై
గిరిగహ్వరముల దాఁగిరి, సుర లందఱు మిగుల దిగులుచొచ్చినమదితోన్. 137
వ. ఆసమయంబున. 138
సీ. శంఖగదాచక్రశార్ఙ్గాయుధప్రభాతతి దిశాపటలిఁ జిత్తరువు వ్రాయ
హారకుండలకాంచికాంగదకోటీరముఖరత్నభూషణములు చెలంగఁ
దక్షిణాంబూనదోత్తాలచేలస్ఫూర్తి వసుధ కపూర్వపర్వంబు సేయఁ
బద్మాక్షమాలికా పరిగణనక్రియ హస్తాంగుళిశ్రేణి కనువు సూప
గీ. నారదుఁడు పర్వతుండు సనకసనంద, ను లగస్త్యుండు జయవిజయులును మఱియుఁ
గలుగు వైకుంఠవాసులు కమలమిత్ర, కోటితేజంబుతో నందుఁ గూడఁబోఱి. 139
గీ. సింహరూపంబుఁ దాల్చిన శేషశయనుఁ, బుండరీకాక్షు సేవించి పుష్పవృష్టి
గురిసి ధ్యానంబు గావించి కోర్కిదీర, సన్నుతించిరి వేదాంతసరణితోడ. 140
వ. అంత లక్ష్మీకాంతుండు గరుడారూఢుండై యంబరమార్గంబున వచ్చి దేవగణంబులు నుతియింప గిరిమీఁద నిలిచి సింహాద్రినాథుండు నరసింహుం డన దివ్యగంధర్వులతో ననేకవిభవంబు లనుభవించుచున్నవాఁ డాకౌస్తుభవక్షు నింద్రాదిదిక్పాలకులు తమ స్థానంబుల నిలిచి ముక్తికొఱకు భజింతు రాచక్రహస్తు సేవించినవారు సకలదురితంబులం బరిహరించి సుఖంబు లనుభవింతురు గావున నీవునుం బూజింపుము నీరాజ్యలక్ష్ములు శీఘ్రకాలంబున ననుభవింతు వీయుపాఖ్యానంబు పఠియించిన విన్నవారికి నిహపరంబులు చేకూరు ననిన విని జనమేజయుం డిట్లనియె. 141
గీ. ఇట్లు కృష్ణుండు సర్వలోకేశ్వరుండు, ధర్మకథ లెల్ల నుడువంగ ధర్మతనయుఁ
డేమి యడిగెను దిరుగ నీకెఱుఁగవచ్చు, వ్యాసుదయఁ దెల్పఁగదవయ్య భూసురేంద్ర.
వ. అనిన జనమేజయనరేంద్రునకు వైశంపాయనమునీంద్రుం డిట్లనియె. 143
గీ. కనుఁగొనఁగ వచ్చి కామ్యకవనములోన, దర్భపీఠంబుపై నున్నదానవారిఁ
దామరసనేత్రు శ్రీకృష్ణు ధర్మకథలు, భక్తియుక్తుల నడిగిరి పాండుసుతులు. 144
క. తనయుఁలకు బ్రహ్మపదమును, ఘనవిభవము నొసఁగుపుణ్యకథ యెయ్యది మా
కును గృప నెఱుఁగం బలుకుము, వనజాక్ష ముకుంద కృష్ణ వనమాలి హరీ. 145
వ. అనినఁ గుంతీనందనులకు దేవకీనందనుం డిట్లనియె. 146

గీ. సకలసౌభాగ్యదము ద్విజస్థాపనంబు, నాథుఁ డైన సనాథుఁ డైనను గుణాఢ్యు
వడుగుఁ బెండ్లియుఁ జేసినవారు పుత్ర, పౌత్ర సౌభాగ్యములు బ్రహ్మ పదముఁ గంద్రు

వ. అనిన యుధిష్ఠిరుం డి ట్లనియె. 148

క. కలుగుదురు సుతులు పాపా,త్ముల కైనను లేరు పుణ్యమూర్తులకు నిదే
ఫలమున సంశయ ముడుగం, బలుకుము నీ పలుకు వేదభాషణము హరీ. 149

వ. అనిన యుధిష్ఠిరునకు మురహరుం డి ట్లనియె. 150

గీ. పూర్వజన్మంబునందున భూసురులకు, దాన మొనరింప నెక్కుడు ధనముగలుగు
వడుగుఁ బెండ్లియుఁ జేసినవారికెల్లఁ, దనయవర్గంబు లుదయించు ధర్మతనయ. 151

## సోమకాంతునిచరిత్రము.

సీ. ఈయర్థమున కొక్క యితిహాస మెఱిఁగింతు విను పుత్రపౌత్రాభివృద్ధికరము
సోమవంశమురాజు సోమకాంతుఁ డనంగఁ దనరువాఁ డత్యంతధర్మశాలి
యతిథిపూజాసక్తి హరిపాదభక్తియుఁ దనసొమ్ముగాఁ బ్రజఁ దండ్రిరీతి
మనుపుచు ధరయేలి మఖములు గావించి కొమరొప్ప వేల్పులకోర్కి దీర్చి

గీ. తనయసంపద లేకున్నఁ దనువు రోసి
స్వర్గమున కేగి యచ్చట సకలదివిజ
తతి జయంతుఁడు గొలువ సుధర్మయందు
సాంద్రమోదంబుతో నున్న యింద్రుఁ జూచె. 152

క. వాసవుఁ డానరపతి కర్ఘాసన మిడి యపుడు తావకాగమనం బే
యాసను నీవచనంబులు, చేసెద నని గారవంబు చేసె నరేంద్రా. 153

క. ఈగతి వాసవుఁ డడిగిన, స్వాగమననిమిత్త మెల్ల సంతతి కొఱకే
యేగతి రక్షింతో దయా, సాగర యని మ్రొక్కి పలికె జనపతి యంతన్. 154

వ. ఇంద్రుఁ డి ట్లనియె. 155

గీ. ఆత్మజులఁ గోరి సర్వదేశాధిపతులు, పైన మైనారు వారు నీ వేను నరిగి
పద్మసంభవు శ్రీపాదపద్మములకు, విన్నపము సేయఁ దగు నెల్ల వేగరమ్ము. 156

క. మును సుతులు లేమి మిక్కిలి, మనమున దురపిల్ల నన్ను మన్నించి దయా
వననిధి కాంచనగర్భుం, డనఘా శ్రీమంతుఁ డగుజయంతుని నొసఁగెన్. 157

వ. అని వారలం దోడుకొని యింద్రుండు సత్యలోకంబున కరిగి కాంచనగర్భునకు వం
దనం బాచరించి వీఁడె సోమకాంతుం డనుచక్రవర్తి వీరె దిక్పాలకులు పుత్రార్థులై
మీశరణంబు వేఁడెద రనినఁ జతురాననుం డి ట్లనియె. 158

గీ. పెదలై యున్నవి ప్రలపెండ్లి వసుగు, లవనిపతియును దిక్పాలు రాచరింప
వలయు నట్లైనఁ గోరుకు లలరు మున్ను, గరిమఁ గావించి నే సృష్టికర్త నైతి.

క. అని పలికి వనజగర్భుఁడు, చనియె న్నిజధామమునకు శక్రాదిసుర
ల్జననాథమణియుం నేగిరి, వినుతించుచు శారదేశువితరణగుణముల్. 160

గీ. సోమకాంతుండు వలసినసొమ్ము లిచ్చి, వసుగుఁ బెండ్లింప్లు భూసురవర్గములకుఁ
జేసి ధర్మవ్రతాఖ్యు నశేషదివిజ, సన్నుతుండైన సుతుఁ గాంచి సంతసించె. 161

వ. కావున బ్రహ్మప్రతిష్ఠ గావించినఁ గోరుకు లీడేఱు. సంతానంబు గలుగు నీవు నొనరింపు మీయుపాఖ్యానంబు ప్రాతఃకాలంబున నిశాసమయంబునఁ గాంతాసన్నిధానంబునం బఠియించిన సుపుత్రావాప్తి యగు ననిన విని యుధిష్ఠిరుండు వధూసమేతుండై స్త్రీలకు సకలసంపత్కరం బైనవ్రతం బేమి యెఱింగింపవే యని యడిగిన ద్రౌపదిం జూచి భీష్ముం డిట్లనియె. 162

## చాతుర్మాస్యవ్రతము.

క. గతము సరోరుహానందన, సుతుఁ డగునారదుఁడు పలికె శుభము లొసంగు
న్నతులకుఁ జాతుర్మాస్య, వ్రతమని యది జనులకెల్ల వలయు లతాంగీ. 163

సీ. శుభమైనశ్రావణశుద్ధదశమి నింతి వనజాప్తు రాకకు మునుపు లేచి
జలకంబులాడి నిజనికేతమున గంధపుష్పాక్షతాదులఁ బూజచేసి
పతియాజ్ఞఁ గైకొని పంకజాక్షు ముకుందుఁ జేకూర్పు మీకార్యసిద్ధి యనుచుఁ
బ్రార్థించి యారాత్రి భద్రదీపము పెట్టి యొంటిపూఁట భుజించి యుదయమైన

గీ. నెలమి నేకాదశీవ్రత మలవరించి, ద్వాదశిని యజమానుండు ద్వాదశాక్ష
రాది మంత్రంబులను హరి కర్పణంబు, నడుపఁ దాను వందన మిడఁగవలయు.

క. స్త్రీలకు శూద్రులకున్ హరి, నాలోకింపంగవచ్చు నంటఁగరా దీ
క్షీలెఱిఁగి పూజ సేయుచుఁ, గీలిం బాయసము వేల్వ గృహపతికిఁ దగున్. 165

గీ. శాంతి పౌరుషసూక్తము ల్చదివి విప్ర, తతికి భోజన మిడి గృహపతి భుజింప
నంత నింతికి నాహార మనుభవింప, వలయు నట్లైన శ్రీహరి యలరు మదిని. 166

గీ. అధిక మేకాదశీవ్రతం బందు శ్రావ, ణంబు మొదలుగ మాసము ల్నాలుగింట
నాచరించినవారికి నఖిలవాంఛి, తంబు లీడేఱు నిందిరాధవునికరుణ. 167

గీ. అవని వ్రతముల కెల్ల నుద్యాపనంబు, వలయు వలవదు శ్రీహరివాసరవ్ర
తమున కది నిత్య మఖిలపాతకహరంబు, నగుచు విలసిల్లు భువనత్రయంబునందు.

వ. నారాయణదేవుండు శ్రావణమాసంబున శుక్లపక్షంబున నేకాదశీదినంబున యోగ

నిద్రఁ గైకొని కార్తికంబునఁ బ్రసన్నుం డగు నాశేషశయనుండు మేల్కాంచిన దినంబు ద్వాదశి యనంబరఁగు నందుఁ బూజించినవారికి సర్వపాపవిముక్తియు హరిసాలోక్యంబు నబ్బు ననినఁ దత్పూజాప్రకారం బెఱిఁగింపవే యని యడిగిన ద్రౌపదికి భీష్ముం డి ట్లనియె. 169

సీ. క్షీరాబ్ధితీరంబు చేరి నుతింప నారదునకుఁ జెప్పె నారాయణుండు
వ్రతరాజ మన మించు వసుధ నేకాదశి యది చతుర్మాసంబులందు ముక్తి
గావించు నది మది ఘనభక్తి గావింపు భక్తి లేకున్నను ముక్తి దొరక
దట్లుగావున నీకు ననవరతాచరణీయంబు తప్పకు నేఁటినుండి

గీ. యనుచు రాతిరి జాగర మాచరించి, నృత్తగీతపురాణాది నియమములను
యామమాత్రంబు మాధవు ననుచరింప, జన్మజన్మార్జితాఘము ల్జరుగు నపుడు. 170

క. జాగరము నాల్గుజాముల్, వేగినయందాఁకఁ జేయ వెరవరి యెపుడున్
భోగములఁ గొల్లలాడును, సాగరకన్యాధినాథు సాన్నిధ్యమునన్. 171

గీ. ద్వాదశిని స్నాన మొనరించి ద్వాదశాక్ష, రమున గోపాలరామ మంత్రమున నైనఁ
పాయసము వేల్వఁగాఁ దగుఁ బావకునకు,నూట యెనిమిది యాహుతు ల్సాటిగాఁగ.

గీ. స్త్రీలు శూద్రులు వైశ్యు లుర్వీసుపర్వ
ముఖ్యు లాహుతు లీమంత్రములును వేల్వ
నిష్టమృష్టాన్నసకలసంతుష్టి విప్ర
తతికిఁ గావింపఁ బూర్ణమై వ్రతము చెలఁగు. 173

వ. ఇవ్విధంబున ద్వాదశివ్రతం బాచరించిన జగన్నాథుండు ప్రీతుండై యిహపరంబు లొసంగు హరివాసరవ్రతంబు భ్రష్టరాజ్యసంపదలు చేకూర్చు. మున్ను బృహస్పతి వాక్యక్రమంబున శచీదేవి యాచరించి నిజవల్లభుం జెంద నదితియుఁ గాశ్యపానుమతిం గావించి త్రివిక్రము పుత్రుంగాఁ బడసె నీయుపాఖ్యానంబు విన్నవారలకు సకలమనోరథంబు లీడేఱు ననిన విని ధర్మనందనునకు రాజ్యలాభంబు సేయం దలంచి గోవిందునకు సన్నుతిపూర్వకంబుగా దండవత్ప్రణామం బాచరించి ద్రుపదరాజపుత్రి గంగాపుత్రున కి ట్లనియె. 174

గీ. అరులు రాజ్యంబు గైకొని రఖిలబంధు
వర్గ మెల్లను విడిచె నీవనములోన
దైన్యమున నున్న మమ్మింకఁ దలఁచువారు
కమలనాభుండు నీవు గంగాతనూజ, 175

క. ఏతపమున నేజపమున, నేతీర్థస్నానమహిమ నేదానముచే
నేతెంచుఁ దిరుగ రాజ్యము, నాతెఱఁగెఱిఁగింపు తాత యధికప్రీతిన్. 176
వ. అనిన ద్రుపదపుత్త్రికి గంగాపుత్త్రుం డిట్లనియె. 177
గీ. పార్వతీదేవి చేయుశుభవ్రతంబు, నీకెఱింగింతు నేనది నియతి నడుప
నష్టరాజ్యంబుఁ బుత్త్రుల నిష్టసంప, దలను విభవంబుఁ జేకూర్చు లలన వినుము. 178
క. మును శివుని గూర్చి గిరిసుత, ఘనతప మొనరించుచుండఁగా నచ్చటికై
యనసూయ యరుంధతియును, జనుదెంచిరి గనుఁగొనంగ సంభ్రమలీలన్. 179
గీ. పార్వతియుఁ వారిఁ గైకొని బహువిధములఁ
బూజ గావించి పలికె నాపుణ్య మబ్బె
దపము ఫలియించె జన్మంబు ధన్య మయ్యెఁ
బుణ్యసతులార మీ రిందుఁ బొరయ ననుచు. 180
వ. వినుతించు గిరికన్య కరుంధతి యిట్లనియె. 181
క. ఏమిటికిఁ దపము సేసెదు, నీమది నున్నట్లు నాకు నెఱిఁగింపఁగదే
సోమావతంసు శంకరు, స్వామిగ నూహించినావొ శైలేంద్రసుతా. 182
గీ. అనిన విని సిగ్గు రెట్టింప నాననంబు, వంచి చిఱునవ్వుతోఁ బ్రతివాక్య మీక
యున్నసతిఁ జూచి నీకోర్కి యొసఁగువ్రతముఁ, జేసి లక్ష్మికి మోదంబు సేయు మనియెం
వ. అనిన నరుంధతికి గిరిజ యిట్లనియె. 184

### అరుంధతి గౌరికి కర్కటవ్రత ముపదేశించుట.

క. నోమేమి తద్విధానం, బేమార్గము మున్ను నోఁచి రెవ్వరు నాకుం
బ్రేమ నెఱిఁగింపు నీవచ, నామృత రసధార వర్ష మయ్యెడుఁ దల్లీ. 185
వ. అని యడిగినఁ బార్వతీదేవికి నరుంధతీదేవి గౌతమభయంబునఁ దొలంగి చనిన వాసవుం గానక శచీదేవి యాచరించి సుఖంబు నొందె. నీకా వ్రతం బెఱింగించెద విను మని యిట్లనియె. 186
ఉ. గౌతమభీతి వాసవుఁడు గానఁగరాక తొలంగి పోవ వి
ఖ్యాతపతివ్రతాతిలక మైనపులోమజ తద్వియోగచిం
తాతుర యై మదిం గలఁగి యన్యవిచారము మాని బాష్పసం
పాతన మాచరింపఁ గని పల్కె బృహస్పతి యాదరించుచున్. 187
సీ. కర్కటలగ్నంబు కమలమిత్త్రుఁడు చేర భాసురం బగు భృగువాసరమునఁ
బుణ్యనదీస్నానపూర్వకంబుగను గుంభంబున శుద్ధజలంబు నించి

పంచపల్లవములు సంచితమృదుసైకతముతోడఁ దెచ్చి గృహమున నిల్పి
ఆవాలుకయం మూఁడు బ్రోవులుచేసి చెంగటఁ దత్పయఃపూర్ణఘటముఁ జేర్చి
గీ. యధికన్యాదినారాయణాత్మకముగ, ధ్యాన మొనరించి మాధవు దానవారి
వివిధసుమగంధవస్తునైవేద్యములను, బూజఁ గావించి భూసురపుంగవులకు. 188

క. వాయన మొసఁగి కథాస్మృతి, పాయక కావించి మిత్రబాంధవతతికిన్
న్యాయార్జితాశనంబులు, చేయించి భుజింపఁ గోర్కి సిద్ధించు శచీ. 189

గీ. ఇత్తెఱంగున నొనరించితేని పతిని, బుత్రపౌత్రుల రాజద్ధరిత్రిఁ బెద్ద
సంపదలఁ గాంతు సత్యంబు సలుపు మింక, నీమనోరథ మలరఁ బులోమతనయ.

క. అనిన బృహస్పతిమాటలు, విని యావ్రత మాచరించి విబుధాధిపు నిం
ద్రునిఁ గనుఁగొనియె బులోమజ, వనితారత్నము సుపర్ణవాహనుదయచేన్. 191

గీ. అనిన మునిపత్నిమాటల కద్రితనయ, పరమసంతోషభరిత యై భక్తియుక్తి
వ్రతము గావించి కైలాసవాసు నీశు, శివుని వరియించి మిక్కిలి చెలువు దాల్చె.

ఉ. కావున నీవొనర్పు శుభకారణ మీవ్రత మిట్లు రుక్మిణీ
దేవి యొనర్చి కృష్ణు వసుదేవకుమారునిఁ బెండ్లియాడి నా
నావిబుధాంగనానిటలనవ్యశుభాక్షరపంక్తిఁ బాదరా
జీవపరాగలేశములఁ జిత్తరువుల్ రచియించె ద్రౌపదీ. 193

క. పతిహీన యైననారియు, క్షితివిరహితుఁ డైనరాజు శిష్టక్రియ నీ
వ్రత మొనరించి మహాశా,శ్వతసౌఖ్యముఁ గాంతు రవని జలజాతాక్షీ. 194

వ. ఈకర్కటవ్రతమాహాత్మ్యంబు నాచరణసమయంబున విన్నవారికి సకలభద్రంబు
లబ్బు ననిన విని వందనం బాచరించి యింక శివరాత్రివ్రతలక్షణం బెఱింగింపవే
యని యుధిష్ఠిరుం డడిగిన భీష్ముం డిట్లనియె. 195

## శివరాత్రిమాహాత్మ్యము.

క. నారాయణుఁ డెఱింగించెను, నారదునకు నతఁడు నాకు నానామునిభం
చారవిరాజిత మగు భా,గీరథితీరమునఁ దెలియఁ గీర్తన చేసెన్. 196

. నలినభవలోకమునుండి నభము డిగ్గి, సిద్ధమునిసేవ్య మైన యాక్షేత్రమునకు
నారదుఁడు రాఁగ గీర్వాణవార మెఱిఁగి, వచ్చె నచ్చోటికేఁ జని వారి కెరఁగి.

. నారదు నడిగిరి నీవ్రత, సారంబే నఖిలమునులు సమ్మత మనఁగా
వారు నిది దెల్పి మా మా, కోరుకు లీడేర్పు మనుచుఁ గూర్చుండి రిలన్. 198

ఉ. నారదమౌని యాదరమున న్నను జూచి శివవ్రతంబు వి
ద్యారమణీసుఖార్థదము ధర్మయశోబలవర్ధనంబు దు
ర్వారభవాబ్ధిపోత మపవర్గఫలప్రదరాజమంచు ల
క్ష్మీరమణుండు పల్కె నిది సిద్ధ మటంచు వచించె ధర్మజా. 199

క. చండాలుఁ డైనఁ గానీ, చండీశవ్రతము నడపి చండప్రభ నా
ఖండలపురి నుండు దిశా, మండలి వినుతింప దివిజమండనుఁ డగుచున్. 200

క. శివరాత్రివాసరంబున, శివసన్నిధి జాగరంబుఁ జేసినవారల్
శివసంయము లై యుందురు, శివలోకమునందు దివిజశేఖరు లగుచున్. 201

ఆ. ఉపవసించి యైన నూరకేనియుఁ శివ, రాత్రి నెవఁడు జాగరంబుతోడ
శివుని బూజసేయఁ జేకొను నాతఁడు, సిద్ధసాధ్యవినుత శివపదంబు. 202

క. ఏయూర నీవ్రతం బెవఁ, డాయతగతి నాచరించు నామానవుచే
నాయూరు పవిత్రం బగు, శ్రేయస్కరములకు నెల్ల సేవ్యం బగుచున్. 203

ఆ. భూప్రదక్షిణమునఁ బుణ్యపురుషసేవ, నమున దానయాగసముదయముల
వెలయునట్టి ఫలము గలుగును శివరాత్రి, వ్రతము నడుపఁ బుడమివారికెల్ల. 204

వ. అనిన యుధిష్ఠిరుండు శివపూజానుష్ఠానమంత్రంబు లెఱింగింపవే యని ప్రార్థించిన
భీష్ముండు నారదమునీంద్రుం డానతిచ్చినవిధంబు వినిపించెద వినుమని యిట్లనియె.

సీ. ప్రొద్దున మేల్కాంచి పూతాత్ముఁ డై పుష్పములుఁ బండ్లుఁ గొని గృహమునకు వచ్చి
శుభమండల మొనర్చి చుట్టు నాలుగు మధ్యమున నొక్కటియుఁ గాఁగఁ బూర్ణకుంభ
ములు నిల్పి వాసవముఖ్యదిక్పాలురఁ బూర్వాదిదిక్కులఁ బొందు గాఁగ
నావాహనము చేసి యానడిమింట ఘటంబున శంకరు నంబికేశు

గీ. నున్నవానిగ ధ్యానించి యోగమంత్ర
వస్త్రమాల్యానులేపనవైభవములఁ
బూజఁ గావించి నైవేద్యమును బ్రియంబు
లెసయఁ గర్పూరతాంబూల మిడి నుతించి. 206

గీ. ఇత్తెఱంగున నీవ్రత మెలమిఁ జేయఁ, వారు వినువారుఁ బఠియించువారుఁ బాప
పటలి యణఁగించి కోరిక ల్పల్లవింప, శివునిసాన్నిధ్యమున నుంద్రు సిద్ధమెపుడు.

వ. అనిన విని యుధిష్ఠిరుం డిట్లనియె. 208

క. ఎవ్వ రొనరించి రీవ్రత, మెవ్వరు తత్ఫలముఁ జెంది రెఱిఁగింపఁ గదే
నివ్వటిలుకరుణ మెఱయం, జివ్వన గంగాకుమార శ్రితమందారా. 209

వ. అనిన భీష్ముం డిట్లనియె. 210

చ. మునుపు సుధాకరుండు మినుముట్టిన కౌతుక ముప్పతిల్ల యా
వనమున రూపురేఖలును వాసికి నెక్కి శుభాంగి నంగిర
స్తనయుని కామినిం దగవు దప్పి రమింప సుపర్వసంఘము
ల్వని యది యుద్ధతం బనుచు వేదనఁ బొందిరి వారివారికిన్. 211

క. ఆకార్యంబు బృహస్పతి, చక్కఁగ విని చంద్రుఁ బిలిచి స్వామిద్రోహం
బిక్కరణిఁ జేయఁ బాడియె, తక్కనె శీలంబుఁ గులముఁ దపమును సిరులన్. 212

క. మాను మిది యన్న నట్లే, కానిమ్మని తిరుగ పుండు గానక శశి యా
మానినిఁ గలయ బృహస్పతి, పూనిక శపియించె క్షయముఁ బొందు మటంచున్.

ఆ. శాప మణఁపఁ గోరి చంద్రుండు కావేరి, తీరమునకు నరిగి దేవదేవు
శివుని గూర్చి తపము సేయ నావేల్పు ప్రత్యక్షమగుచుఁ బలికె నాదరమున. 214

క. శివరాత్రి వ్రతము నడుపుచు, శివునిం బూజింపు కోర్కి చేకూరు సదా
శివుఁ డనఁగ నేను నిక్కా, శివలీల న్మౌళిఁ దాల్తు సిద్ధము చంద్రా. 215

తే. అనుచుఁ బలికి యభవుఁ డంతర్హితుం డైనఁ
దారకేశుఁ డా వ్రతంబు చేసి
శివుని మౌళియందుఁ జిత్తవిహారంబు
సలుపుచున్నవాఁడు జనవరేణ్య. 216

సీ. దివమున నిప్పుడు తేజంబుతో నున్నవాఁడు త్రిశంకుభూవల్లభుండు
తన పేరఁ బట్టంబు దనర సర్వోన్నతపదవి నారూఢుఁ డై ప్రబలె ధ్రువుఁడు
వీరబాహుకభృత్యవేషంబు విడనాడి సౌఖ్య మొందెను హరిశ్చంద్రనృపతి
కలిబాధ దప్పించి కాంతాసమేతుఁడై నిజరాజ్యలక్ష్ముల నెగడె నలుఁడు

i. వామనునిఁ బుత్రుఁగాఁ గాంచి వఱలె నదితి
నాతి రూపాంతరము మాఱె గౌతముండు
ధ్యానదానాంఘ్రిపూజావిధానగాన
వందనంబులు శివరాత్రి వ్రత మొనర్చి. 217

వాసవుండు యముఁడు వరుణుండు ధనదుండు, దిక్కులేలి రక్షిలద్విజమునులు
బ్రాహ్మణాదిమనుజపటలంబు శివరాత్రి, వ్రత మొనర్చి శివునివసతిఁ గనిరి. 218

మార్జాల మూషికంబులు, ధూర్జటి సన్నిధిని ఫలము దుగ్ధంబులుఁ దా
మార్జింపఁ గోరి యసువులు, వర్జించి దివంబునందు వసియించె నృపా. 219

గీ. దొంగ యొక్కఁడు ధనములు దొంగిలింప, జాగరము చేసి నిటలాక్షుసన్నిధాన
మున మహీపాలుభటులచేతను వినిహతుఁ, డగుచుఁ గైలాసపురమున నధివసించె.

గీ. దేవపూజార్థమై ధూపదీపముద్ధ
తైలగోధూమగుడములు తనియమోసి
గార్దభము వైశ్యుతో నీలకంఠు నొద్దఁ
బ్రాణములు వోవఁ గైలాసపదముఁ గనియె. 221

క. శివరాత్రి వాసరంబున, శివకథ విన్నట్టివారు శివలోకమ్మున్
శివ మనుభవించుచుందురు, శివుఁడే తా మగుచు నఖిలజీవులుఁ బొగడన్. 222

వ. అని యజ్ఞపత్నీసమేతయైన పాంచాలికిం దెలిపి భీష్ముం డూరకుండిన ధర్మనందనుం
డి ట్లనియె. 223

గీ. ధర్మకథ లెల్ల వింటిని దయ దలిర్ప
నైనఁ గార్తికముఖహాయనములలోనఁ
గలుగు వ్రతములఁ దెలియంగఁ గౌతుకంబు
విస్తరిల్లెడు మదిఁ బల్కవే మహాత్మా. 224

వ. అనిన భీష్ముం డి ట్లనియె. 225

## ప్రతిమాసంబునం జేయవలయు వ్రతాదులు.

సీ. ఆశ్వీజమాసంబునందునఁ గృష్ణపక్షత్రయోదశి బంధుజనులతోడ
నరుణోదయంబున నభ్యంజనస్నాన మొనరించి తత్కాలజనితకృత్య
ములు దీర్చి యిందిరామోదకారణు హరిఁ గౌస్తుభరత్నవికాసివక్షు
నావాహనార్ఘ్యపాద్యస్నానమాల్యానులేపనాంబరధూపదీపములనుఁ

గీ. బూజ యొనరించి నైవేద్యములు సమర్ప, ణములు గావించి నృత్యగీతములు భక్తి
నలరఁ జేసిన నశ్వమేధాదియాగ, సవనములఁ గల్గు ఫలములు సంభవించు. 226

క. నరకాసురుఁడు చతుర్దశి, హరిశరముల నేలఁ గూలు చవ్విభు లక్ష్మీ
వరుఁ గాఁగ నెఱిఁగి తత్పద, సరసిజముల కెరఁగి పల్కె సజ్జనఫణితిన్. 227

ఆ. పుడమి నాకుఁ దల్లి పడఁతుక నీ కెన్నఁ, దండ్రి వైతి వింకఁ దప్పు మఱచి
యెల్లలోకములకు హితవుగాఁ గోరెద, వర మొసంగ వయ్య వనజనాభ. 228

వ. దివ్యరూపధరుండ నగు నీచేత ముక్తిఁ గాంచిన యీచతుర్దశి తనపేర నరకచతుర్దశి
యనఁ బ్రసిద్ధంబు గావలయు నిందు నభ్యంజనస్నాన మాచరించి నిన్నుఁ బూజించిన
నన్నుఁ దలంచిన వారికిఁ బుత్రపౌత్రాదివిభవంబులుఁ గైవల్యంబు నొసంగవలయు

నని వందనం బాచరించిన నట్ల కానిమ్మని వరం బిచ్చి యవ్వాసరంబున భక్ష్యభోజ్యా
దినైవేద్యంబులం బూజించినవారికి ముక్తి చేకూరు నభ్యంజనస్నానంబు లొనరించి
యొక్కవిప్రునికి భుజింపం బెట్టిన వాజపేయఫలంబు చేకూరు నని కృష్ణుం డాన
తిచ్చెం గావున నవ్వాసరంబు పుణ్యాధికం బై చెలంగు. 229

గీ. ఒకటియే నాల్గు నైదేని నోపినట్లు, దీపములు కార్తికంబునఁ దేజరిల్ల
రాత్రి వెట్టినఁ బాతకరాశి యణఁగు, మహితవిభవంబు లొనగూర్చు మాధవుండు.

క. దినదినము నొక్కటొక్కటి, ఘనముగ దీపములు కార్తికంబున వెట్టం
దనవంశభవులు వెంటం, జనుదేరఁగ నొందు విష్ణుసాన్నిధ్యంబున్. 231

గీ. కార్తికమునను శ్రీరమాకాంతునకును, వేడ్క గావించుదిన మందు వృషవిసర్గ
మన్నపానాది దానంబు లాచరించు, వారు గైకొంద్రు నిత్యనిర్వాణపదవి. 232

క. మాధవుఁడు పుడమి గొని తను, సాధించి ప్రసన్నదృష్టి సలుపుచుఁ గోర్కుల్
బోధింపు మిత్తు నన్న య,శోధనుఁ డగు బలియు సురలు చొక్కఁగఁ బలికెన్.

క. ఉరగనివాసమ యేలా, నిరయంబును లెస్స నాకు నీచరణాంభో
జరజఃకణముల మీఁద, న్నిరతంబును భక్తి యొసఁగు నీరజనాభా. 234

చ. పుడమికి నేఁటఁ గార్తికపుఁబున్నమ నీచరణాంబుజాతముల్
పొడఁగన వత్తు నే నపుడు పుణ్యసతు ల్తమయిండ్లు వాకిటుల్
దుడిచి యలంకరించి సురతోరణమై వెలయంగ దీపముల్
సడలనిభక్తితో నిడఁగ శాశ్వతభక్తి యొసంగు మాధవా. 235

గీ. అనుచుఁ బ్రార్థింపఁ బలికి నిష్టార్థ మొసఁగి, చనియె వైకుంఠనగరికి జలజనాభుఁ
డబ్జగర్భాదిసురనివహంబు గొలువ, దనుజనాథుండు పాతాళతలముఁ జేరె. 236

వ. కార్తికంబునం దీపంబు లిడినం గైవల్యసాధనం బైనజ్ఞానంబు సిద్ధించు నర్కుండు
ధనూరాశిగతుం డైనఁ బ్రాతఃకాలంబున లేచి హరిం బూజించి గుడసంయుతం
బైన ముద్గాన్నంబు సమర్పించిన భూసురులకు వైకుంఠ నగరంబు కరతలామలకం
బగు మున్ను దానవులతోడి యుద్ధంబున సురలు ప్రార్థించిన గరుడధ్వజుండు నిట్టు
లాచరించి విజయంబు గైకొనియె నది మొద లీవ్రతంబు విష్ణుభక్తుల కవశ్యకరణీ
యంబై యుండు మాఘంబున స్నానం బొనరించియు మేషసంక్రాంతికాలంబున
భోజనంబులను చైత్రశుక్లపక్షంబున వైశాఖశుద్ధతృతీయఁ బూర్ణిమావాసరంబుల
గుడపానీయ దధ్యోదన నారికేళచ్ఛత్రచామరపాదుకాదానంబుల భూసురులను
దనుపుచు నారాయణుం బూజింప వైకుంఠంబు గరతలామలకం బగు ననినఁ గుంతీ

నందనుండు జ్యేష్ఠమాసంబునం గలధర్మంబులు యోగనక్షత్రవారంబుల విలసిల్లు
వ్రతంబులు నెఱిఁగింపవే యనిన భీష్ముం డిట్లనియె. 237

గీ. జ్యేష్ఠమాసపుఁబున్నమఁ జేయవలయుఁ, నిందిరానాథు పాదారవిందసేవ
దాన సిద్ధించు నమితగోదానఫలము, దివ్యలోకంబు గోరికి తేజరిల్ల. 238

గీ. యోగములలో వ్యతీపాత యుత్తమవ్రతంబు నా మించు నవ్వాసరంబునందు
స్నానము లొనర్చి హరిపూజ సలుపువారి, కిహపరంబులు చేతివై యెపుడు నుండు.

క. తారలలో శ్రవణంబును, వారంబుల భానుసోమవారంబులు దు
ర్వారశ్రేయస్సారము, లారయఁ దద్వ్రతము మహిమ లమితంబు లిలన్. 240

క. శ్రవణమున నుపవసించుచు, నపహితభక్తులను గృష్ణు నలినాక్షుని గే
శవుఁ బూజించిన మనుజులు, సవరింపుదు రిహపరైకసౌఖ్యము లెల్లన్. 241

క. శ్రవణైకాదశి నుపవాసవిధానంబునను భక్తి సలుపఁగ వలయున్
స్తవవందన పుణ్యకథా, శ్రవణార్చనవిధులు హరికి సంతస మొదవన్. 242

క. శ్రవణర్క్షము ద్వాదశియును, గవగూడిన నుపవసింపఁ గలిగినమనుజుం
దవులున్ హయమేధాదిక, సవనాచరణప్రభూతసకలఫలంబుల్. 243

గీ. శ్రవణనక్షత్రమున కెందు సాటిగలుగ, దొకటి మూఁడైదు నేండ్లలో నోలి నట్లు
వ్రతము గావించి యిందిరాస్వామి హరిని, బూజచేసిన వైకుంఠపురము దొరకు.

క. ఇనుమాఱు భానువాసర, మున భుజియించిననరుండు మునుఁగును నరకం
బున వనజాసనకల్పము, దనుకను నొకపూఁట యైనఁ దనరు సుఖంబుల్. 245

గీ. పర్వసంక్రమణవ్యతీపాతభాను, వాసరంబుల రాతిరి వలదు భోజ
నంబు గావింపఁ జేసిననరుఁడు ఘోర, నిరయముల నుండు మగుడంగ నేర్పులేక.

క. ఇనుఁ డుదయింపకముందఱ, నినవారమునందు స్నాన మెలమిం జేయన్
మునుపటి యెనిమిది దినములఁ, గనుపట్టినపాప మణఁగుఁ గళ్యాణ మగున్. 247

మత్తకోకిల. సోమవారమునాఁడు శంకరు సోమఖండవతంసు సు
త్రామవందితు ధూపదీపపురాణవాద్యనమస్కృతి
స్తోమము ల్దగఁ బూజ సేయుచు సౌమ్యు గల్గినకైవడిన్
భూమినిర్జరకోటిఁ దన్పినపుణ్య మెన్నఁగ శక్యమే. 248

గీ. ఏకభుక్తంబుచే నభివృద్ధి గలుగు, నక్త మొనరించి పూజింప నాకలోక
మొనర లభియించు శివునిసాయుజ్య మబ్బు,సోమవారంబునాఁ డుమాస్వామికరుణ.

వ. ఇత్తెఱంగున వ్యతీపాత శ్రవణ భానుసోమవారంబు లాచరించిన మనోరథంబు
లీడేఱు నొనరింపు మనిన యుధిష్ఠిరుండు భీష్మున కిట్లనియె. 250

ఉ. ఎవ్వనినామము న్నొడువ నెక్కువ ధర్మము గల్గు ధాత్రియం
దెవ్వనియాయుధాంకము వహింపఁగ యోగ్యము దివ్యకోటిలో
నెవ్వనిభక్తు లెన్నికకు నెక్కుదు రెవ్వని సన్నుతించిన
న్నివ్వటిలు న్వైకుంఠపురనిత్యనివాసము వాహినీసుతా. 251

## నామస్మరణయోగ్యతావిచారము.

క. నొడువు మని ధర్మతనయుం, డడిగిన భాగవతజనుల కగ్రేసరుఁడై
పుడమిని వెలసిన భీష్ముఁడు, కడిమిన్ ధ్యానించి పలికె గారవ మెసఁగన్. 252

గీ. పార్వతీదేవి కైలాసపర్వతమున, దండ మర్పించి వైష్ణవోత్తముల మహిమ
వినఁగ మనసయ్యె నెఱిఁగింపు మనుచు నర్థి, నడుగ శంకరుఁ డిట్లని యానతిచ్చె.

గీ. విష్ణుచక్రాంకితుం డగువిప్రునకును, క్షితిని సాఁగిలఁబడి నమస్కృతి యొనర్చె
నతని కబ్బును నొసటిపై నలమియున్న, పాంసులె న్నన్ని వేలేండ్లు బ్రహ్మపదవి.

గీ. శంఖచక్రాంకితుం డగుత్మ్సాసురుండు, పలుకుపలు కెల్ల వేదంబు జలకమాడి
నట్టిచో టెల్లఁ దీర్థమ యడుగు వెట్టు, నెచట నది దివ్యదేశమా నిందువదన. 255

వ. శంఖచక్రాంకితుం డగువిప్రుండు భుజియించినపంక్తి పావనం బగు నతనికి గోచర్మ
మాత్రంబు భూమి దానం బొసంగిన రాజ్యంబు సిద్ధించు నభ్యుత్థానాభివందనంబుల
గంధపుష్పాక్షతంబులం బూజించినం గౌతుకం బాపాదించిన నుతియించిన నిహపర
సుఖంబులు కరతలామలకంబు లైయుండు. 256

క. వైష్ణవులకుఁ గూడైనను, గృష్ణార్పణ మనిన జనుల కీర్తులు వెలయున్
విష్ణుని సన్నిధి నుండుదు, రుష్ణాంశు సుధాంశు ముఖ్యు లోహో యనఁగాన్. 257

గీ. విష్ణుభక్తుండు గానట్టివిప్రు వేద
శాస్త్రములు తీర్థయాత్రలు సవనములును
దపము జపమును దానంబు ధర్మములును
బూదెలో వేల్చు నెయివోలెఁ బొల్లు వోవు. 258

క. భూసురకులగుణవిద్యా, వాసుం డైనను ద్విజుం డవైష్ణవుఁ డైనన్
భాసిల్ల నేరఁ డెంతయు, వాసన లేనట్టి విరులవైఖరి ధాత్రిన్. 259

ఆ. విష్ణుభక్తి లేక వైష్ణవులకు ద్వేష, మాచరించు విప్రుఁ డధికుఁ డైన
హీనజాతిఁ బొంది యెల్లదుర్గతులను, బొందుఁ గాన నతనిపొందు గాదు. 260

తరల. సుఖము దుఃఖము నొక్కరీతిఁ జూచుచు న్నిరపేక్షచే
సఖులు శత్రులు ననక దుర్జనసంగముల్ నిరసించుచున్
నఖవిదారితదైత్యు మాధవు నారసింహుఁ భజించువాఁ
డఖిలసమ్మతి వైష్ణవుం డన నంద మొందు జనాధిపా. 261

క. హరిభక్తులు పుణ్యాత్ములు, పరికింపఁగ వారిఁ గన్నఁ బాపము లణఁగుం
బరమపవిత్రత మగు దచ్చరణాబ్జపరాగలేశసంస్పర్శమునన్. 262

గీ. జలజనాభుండు వైష్ణవస్వాంతవీథిఁ, బద్మతోఁ గూడఁ బ్రకృతిసంబంధదేహ
పటలి నలరించుచుండును బహుళరంధ్ర, ఘటవిరాజితదీపంబుకరణి నధిప. 263

క. బహురూపారూపంబులు, వహియించుచు భక్తియోగవశమున నఘముల్
ప్రహరించు నిందిరాపతి, దహనుండు సువర్ణదోషతతులం బోలెన్. 264

గీ. శ్రవణమును గీర్తనంబును స్మరణ మర్చనంబు దాస్యంబు పదసేవనంబు వంద
నంబు సఖ్య మాత్మనివేదనంబు ననఁగ, భక్తి నవలక్షణంబులఁ బరఁగుచుండు. 265

వ. అనిన విని యుధిష్ఠిరుండు నీకటాక్షంబున సర్వంబును శ్రుతం బయ్యె నింక భగవం
తునిభక్తులలక్షణంబు లుపన్యసింపవే యనిన భీష్ముం డిట్లనియె. 266

## భగవద్భక్తలక్షణములు

సీ. హరినామసంకీర్తనార్చనవందనపఠనసేవారతు ల్భాగవతులు
వేదశాస్త్రపురాణవివిధేతిహాసాదిబహుకథాభిజ్ఞులు భాగవతులు
దేవగురుద్విజదీనమాతాపితృబంధుతోషణరతు ల్భాగవతులు
పరమపదధ్యానపారీణతాస్వాంత పరమపుణ్యోదయు ల్భాగవతులు

గీ. భానుసూక్తపరాయణు ల్భాగవతులు, పావకార్చననియతులు భాగవతులు
పరహితాచారకర్తలు భాగవతులు, బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు భాగవతులు. 267

సీ. తమయట్ల యందఱిఁ దనుపఁజూచినవారు సత్కథాశ్రవణంబు సలుపువారు
శత్రుమిత్రుల నొక్కసరణిఁ గాంచినవారు పేదల కన్నంబుఁ బెట్టువారు
నేకాదశీవ్రత మెలమిఁ జల్పెడువారు నిర్మలజ్ఞానంబు నెఱపువారు
జగమెల్ల హరి గాఁగఁ జర్చించువారలు పరధనంబుల కాసపడనివారు

గీ. మంచి కర్మము లెల్లఁ జేయించువారు, పలికి బొంకనివారును భాగవతులు
... ... ... 268

ఉ. భాను సుధాంశులోచను గృపామయుఁ గౌస్తుభవక్షు నిందిరా
మానవతీమనోవిభుని మౌక్తికహారకిరీటుఁ జక్రధా

రానికరప్రభాదళిత రాత్రిచరున్ హరి భక్తవత్సలున్
ధ్యానము సేయువారలకుఁ దత్పద మబ్బు నరేంద్రమండనా. 269

సీ. హరినీలమణిదేహు నబ్ధికన్యామోహుఁ గారుణ్యపరిణాహు గరుడవాహు
మకరకుండలకర్ణు మందిరద్వటపర్ణు సకలజగత్పూర్ణు జలదవర్ణుఁ
బాలితకరిరాజు భాస్కరశతతేజు నాభిస్థితాంభోజు నతబిడౌజు
నఖిలలోకాధారు నాశ్రితమందారు నాగమాంతవిహారు నమితసారు
గీ. వనజదళనేత్రు నిత్యపావనచరిత్రు, భక్తజనతోషుఁ గౌస్తుభప్రకటవేషు
నమరకులసోము నవమౌక్తికాభిరాము, ధ్యాన మొనరింపఁ జేకూరుఁ దత్పదంబు.

క. నారాయణు గోవిందుని, గారుణ్యపయోధి హరినిఁ గౌస్తుభవక్షున్
సారసనేత్రు భజింపుము, కోరిక చేకూరు నీకుఁ గురువంశమణీ. 271

క. హరిచే నారదుఁ డన్నని, వరుచే నే విన్నదెల్ల వరుస న్నీకుం
బరిపూర్ణములుగఁ దెలిపితి, గురుమతి నెయ్యది వినంగఁ గోరెదవు మదిన్. 272

వ. విష్ణువామన పద్మ బ్రహ్మాండ భాగవతాది పురాణంబులు విన్నవారి కోరిక లీడేఱు
సాక్షాన్నారాయణదేవుండు కృష్ణుం డని పూజింపుము. సకలసామ్రాజ్యవిభవమ్ము
నీకుఁ జేకూరు ననిన విని ధర్మనందనుండు సంతసించె నిఖిలమునివిప్రరాజలో
కంబు గాంగేయు నభినందించె నమ్మహాత్ముండును వాసుదేవునివిచిత్రచరిత్రంబులకుఁ
బరమానందంబు నొందుచుండె. 273

సీ. శ్రీరాజ్యవిభవసంస్థితులు చేకుఱు ధర్మతనయుండు వేఁడిన ధర్మమూర్తి
యైన శ్రీకృష్ణుండు హరివంశకథగాఁగ నానతియిచ్చిన యట్టి నార
దీయము బహుపుణ్యతీర్థప్రదంబునాఁ దనరిన యీశేషధర్మ మెలమి
నెవ్వరు పఠియించిరేనియుం వినిపించిరేనియుఁ గీర్తించిరేని వారి
గీ. కశ్వమేధాదియాగంబు లాచరించి, సకల ధరణియు వేదశాస్త్రప్రవీణు
లగుధరామరులకు నిచ్చినట్టిఫలము, తమకు సిద్ధించు నాచంద్రతారకముగ. 274

వ. నిత్యంబును నీకథ విన్నఁ బఠించిన వారికిఁ శుభంబు లబ్బు బ్రాహ్మణుండైన సకల
విద్యాధికారియగు. క్షత్రియుం డైన రాజ్యంబు చేకూరు. వైశ్యుం డైనఁ బాశుపా
ల్యవాణిజ్యంబులు సిద్ధించు. శూద్రుం డైన ధర్మం బలవడుఁ బుత్రకాములకుఁ బుత్రు
లును గన్యకకు వరుండును లభింతు రెవ్వరేనియు ధనకనకవస్తువాహనదివ్యరత్న
ప్రముఖవాంఛితము లెవ్వికోరిన నీడేఱు నిది నిశ్చయంబు. 275

క. ఘనుఁడు పరీక్షిత్తనయుఁడు, జనమేజయవిభుఁడు గ్రామసముదాయ మొసం

గెను హరివంశము కథ ధృతి, విని గురువున కధికభక్తి వినయమ్ములతోన్. 276

చ. హరిచరణాంబుజాతములయందు మనంబు దృఢంబు సేయుచున్
ధరణితలంబుఁ గావు దయఁ దాత తెఱంగున ఘోరపాపసం
హరణము వాంఛితార్థఘటనామరభూరుహమై తనర్చు నీ
నిరుపమధర్మసారమున నిచ్చలు వీనులవిం దొనర్చుచున్. 277

ఉ. ఈకథ విన్నవారలకు నెల్లప్పుడున్ జయపుత్త్రపౌత్త్రకాం
తాకనకాంబరాశ్వధనధాన్యమణీగృహదాసదాసికా
నీకచిరాయురున్నతులు నీరజనాభపురీవిహారము
ల్చేకుఱు శౌనకాదిమునిశేఖరులార యథార్థ మింతయున్. 278

వ. అని సూతుండు శౌనకాది మహామునులకు మున్ను గంగానందనుండు కుంతీనందనున కెఱింగించినచందంబున వైశంపాయనుండు జనమేజయున కానతిచ్చె నని బోధించె. 279

క. కరుణాసముద్ర పావన, చరణాబ్జపరాగలేశసంఘటితమునీ
శ్వరతరుణీయోగపరి, స్ఫురితయశస్సాంద్ర నిత్యభోగసురేంద్రా. 280

శా. రాజీవప్రియవంశసంభవ భవబ్రహ్మాదినానామరు
ద్రాజభ్రాజిత పద్మరాగమకుటారగ్రావసంఘృష్టిని
ర్వ్యాజప్రాగ్భవ దివ్యకాంతిపటలీవ్యాపూర్ణ సద్ధర్మధ
ర్మాజీమంత్రికృతార్హణగ్రహణసామ్రాజ్యప్రదానోత్సుకా. 281

మాలిని. శకలితశివచాపా చండభానుప్రతాపా
ముకుళితరిపుహస్తా ముక్తిదానప్రశస్తా
ప్రకటవిశదకీర్తీ బ్రహ్మరుద్రేంద్రమూర్తీ
సకలగుణగరిష్ఠా శాశ్వతశ్రీప్రతిష్ఠా. 282

గద్యము. ఇది శ్రీమన్మదన గోపాలలీలావలోకనపవిత్ర శరణయామాత్యపుత్త్ర సకల విద్యానిధాన తామరపల్లి తిమ్మయప్రధాన ప్రణీత శ్రీహరివంశోదితంబైన యాశ్చర్యపర్వంబునందలి శేషధర్మంబున మహానవమీవ్రతంబును బంపాసరోవరంబునకుం జని శ్రీరామచంద్రుండు మతంగమహామునితో సంభాషించుటయు నహోబల శ్రీశైల వేంకటాచల కాంచీనగరమాహాత్మ్యంబులును సింహాద్రివర్ణనంబును ధ్వజస్థాపన సామర్థ్యంబు శివరాత్రివ్రతప్రభావంబును నరకచతుర్దశీమహిమయుఁ గార్తికాదిమాససంవత్సరవిశేషంబులును యోగనక్షత్రఫలంబులును వైష్ణవలక్షణంబులును ననుకథలంగల సర్వంబును బంచమాశ్వాసము.

శేషధర్మము సమాప్తము.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1927.

# ఆంధ్రగ్రంథములు.

| ఆంధ్రగ్రంథములు. | రూ. | అ. |
|---|---|---|
| **ఆంధ్రప్రబంధములు.** | | |
| అచ్చతెనుఁగురామాయణము | 1 | 4 |
| డిటో కాలికోబైండు | 1 | 10 |
| అడవిమల్లెలు | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, పద్యము | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము | 0 | 8 |
| డిటో కాలికోబైండు | 0 | 14 |
| అప్పకవీయము, శ్రీగిడుగురామమూర్తి పంతులుగారి విమర్శతో చక్కగ ముద్రితము | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | 0 | 4 |
| ఆముక్తమాల్యద, సటీక | 3 | 8 |
| ఆంజనేయదండకం,హనుమద్దండకం | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, చక్కనిప్రతి | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి 2-సం, | 8 | 0 |
| ఆంధ్రభారతము, 7 సంపుటములు | 15 | 12 |
| డిటో 3 సంపుటములప్రతి | 15 | 0 |
| ఆది సభాపర్వములుగల సంపుట | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములు ,, | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 2 | 4 |
| శాంతిపర్వము | 2 | 4 |
| అనుశాసనిక అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | 2 | 4 |
| ఆదిపంచకము, పద్యకావ్యము | 6 | 8 |
| యుద్ధపంచకము ,, | 4 | 4 |
| శాంతిసప్తకము ,, | 4 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము | 0 | 8 |
| ఆదిపర్వము, పెద్దచ్చు చిన్నసైజు | 1 | 8 |
| ఆనందరంగరాట్ఛందము | 1 | 8 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | 0 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మకృతము, ౩-సంపుటములు | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | 14 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | 5 | 0 |
| ఆంధ్రభాషాభూషణము | 0 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, వగైరా | 0 | 12 |
| డిటో కాలికోబైండు | 1 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | 0 | 12 |
| డిటో కాలికోబైండు | 1 | 2 |
| ఆంధ్ర లలితోపాఖ్యానము | 1 | 8 |
| ఉత్తరరామాయణము | 2 | 0 |
| ఉత్తరహరివంశము | 1 | 8 |
| కవికర్ణరసాయనము | 1 | 8 |
| డిటో కాలికోబైండు | I | 14 |
| కవిసంశయవిచ్ఛేదము | 0 | 6 |
| కళాపూర్ణోదయము | 2 | 4 |
| కాశీఖండము, క్రొత్తకూర్పు | 1 | 8 |
| డిటో కాలికోబైండు | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | 0 | 6 |
| కృష్ణరాయవిజయము | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక | 0 | 8 |
| డిటో కాలికోబైండు | 0 | 10 |
| గణికాగుణప్రవర్తనతారావళి | 0 | 2 |
| గద్యపద్యసంగ్రహము | 0 | 10 |
| గరుడాచలయక్షగానము | 0 | 2 |
| గోపీనాథరామాయణము,2-సం | 7 | 8 |

